# మహాభారత విమర్శనవ

ద్వితీయ భాగ



ుహాకవి, సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు

విజయనగర సామ్రాజ్యమునకు వేసవి రాజధానిగా విఖ్యాతిగాంచిన పెనుగొండ పురమున వైష్ణవ విద్వత్కుటుంబమందు జన్మించి (1914), ఆంధ్రాంగ్ల గీర్వాణములనే కాక పెక్కితర ప్రాచ్య, ప్రాశ్చాత్య భాషలను గూడ నభ్యసించి బహుభాషా కోవిదులై, విద్వత్పట్టభద్రులై, ఉపాధ్యాయశిరోమణులై, బహు హృద్య పద్య గేయకావ్య విరచనా ప్రదర్శితా ప్రతిమాన ప్రతిభా పాండితీ మహితులైన, మహాకవులై, విమర్శకావతంసులై, వాగ్మితా విరాజమానులై, నిఘంటు నిర్మాణ కార్యధురీణులై, నాట్య సంగీత కళారహస్య నిధులై, బహుబిరుద విభ్రాజమానులై రసజ్ఞ చక్రవర్తులై, భక్త నరేణ్యులై, బహు వారకృత కావ్య పరనోపన్యాస విన్యాస పరితోషిత సకలాంధ్ర పుటభేదన రసిక విసర ప్రశంసా పాథోనిధి పూర్ణిమాప్రాలేయ భానువులై, నైకశత ప్రమితాంతే వాసి సంతాన సంతత ప్రకటిత ప్రతిభా విస్తారిత విశద యశస్సితీకృత దిగ్దిగంతరాళులై, హరహర చరణ సరోరుహ నిరంతర ధ్యానతత్పర హృదయాంతర పరిపక్వతా తులిత సోమయాజి కవిరాజులై, విరాజిల్లు ధీరధిషణావ ధీరిత దివిషదాచార్యులు శ్రీ మత్పుట్టపర్తి నారాయణాచార్యుల వారు.

– డాక్టర్. దివాకర్ల వేంకటావధాని

# మహాభారత విమర్శనము

## ద్వితీయ భాగము



'మహాకవి' 'సరస్వతీపుత్ర'

పద్మశ్రీ

డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు

# Mahabharata Vimarsanam - Volume II

*[Critical Study of Mahabharata]*

by Padmasri Dr. Puttaparthi Narayana Charyulu



Published by
Dr. Puttaparrthi Naga Padmini,
Second Edition
April 2001

Printed with
The Financial
assistance
from
Tirumala
Tirupathi
Devastanams.

*Printed at*
**Akruti Offset printers**
Chikkadapally, Hyderabad,
(040 - 7664525)

*For Copies:*
**Dr. Puttaparthi Naga Padmini**
6-3-1142 Flat No. 106
Bhola Shankar Makta Begumpet
Hyderabad - 500016
Ph: 3410761

**Visalandhra Book House**
All Branches

Price - 80-00




**తిరుమల తిరుపతి దేవస్థానము వారి**
**ఆర్థిక సహాయముతో ప్రచురితము**

# పీఠిక

జగమంతయు వ్యాసోచ్ఛిష్ట మన్నారు పెద్దలు. ఎన్ని మహా పర్వత శిఖరములనైనను - యెన్ని మహాసముద్రముల నైనను నూహింపవచ్చును. కాని - వ్యాసుని మేధస్సు నూహించుట కష్టము. అతని సృష్టి-యెంత విస్తృతమో అంత గంభీరము. ఎంత గంభీరమో - అంత విస్తృతము. అందుకే పూర్వు లాతని నారాయణ స్వరూపు డనిరి. భగవద్వ్యాస రచితములని చెప్పబడు వానిలో గొన్ని వారివి గాకపోవచ్చును. స్కాందపురాణములో చాల భాగ మాతనిది గాదనియే యనిపించును. ఆతని రచనము లనిపించువానిలో గూడ నతని కూర్పెంతయో - తరువాతి వారి చేర్పెంతయో - యిదమిత్థమని తేల్చుట - "గగనం గగనాకార" ముగా నుండును. అనేక ప్రతులలో ననేకములగు క్రొత్త శ్లోకములు వచ్చును. నేను నా దగ్గఱనున్న ప్రతినిబట్టియే యీ రచనమునకు బూనుకొన్నాను. నే నుద్ధృతీకరించిన శ్లోకములు గొన్నింటిలో లేకపోవచ్చును. మఱికొన్నింటిలోఁ గ్రొత్తశ్లోకము లుండవచ్చును. అన్ని ప్రతులను దెప్పించికొని పరీక్షించుటకు నా కార్థికస్తోమత లేదు. ఆయువును లేదు. నాకే కాదు మరెవ్వరికిని సాధ్యము గాదని నా యనుమానము. క్షమింపుడు.

వ్యాసుని రచన చాల ప్రౌఢమైనది. ఓజోగుణ మెక్కువ. వాల్మీకివాణి ప్రసన్న లలితము. ఆ కథ నర్థము చేసికొనుటయు సులభమే. భారతమున ననేక సమస్యలు. సమస్యలకన్నను గ్లిష్టమైనది యాతని రచన. ఏదో నాశక్తి కొలది యుపాసించినాను. భారతమున గొన్ని ప్రతులలో - వస్త్రాపహరణకథయే లేదట - వస్త్రాపహరణమే భారతయుద్ధమునకు బ్రచోదకశక్తి. దానినే గాదన్నచో నిక భారతయుద్ధము నూహించుటయే కష్టము. నాయీ విమర్శనములు సర్వసమ్మతములుగ నుండవలెనను పేరాస నాకు లేదు. దానిలో నా రాగద్వేషములు ప్రతిఫలించి యుండవచ్చును. కొన్ని యెడల నా దృష్టి

సంకుచితమైయుండవచ్చును. పాఠకులు నా యీ దౌర్బల్యములను సహృదయతతో క్షమింపవలెను.

నేనీ గ్రంథమును రచించి చాల సంవత్సరములైనది. అనేక కాల మీ రచన మూలబడియుండెను. ఇది వెలుగు జూచునను నాశగూడ నాకుండలేదు. దైవ మెప్పు డెప్పు డేపని చేయునో యూహించుట కష్టము. మిత్రులు, సహృదయులు, శ్రీ పాలుట్ల పాలంకయ్యగారి యుదారహృదయము - యీ పుణ్య కార్యమునకు బూనుకొన్నది. భాషాభిమానులు సహృదయ ధనికులైన శ్రీ ఈదర వేంకట్రామయ్య గారీ గ్రంథమును బ్రచురించు మహాకార్యమునకు బూనికొనిరి. వారిరువురకు నా నమోవాకములు.

మహాభారతముపై గృషియొనర్చిన మేధావు లెందరో గలరు. వారిలో నొక్కొక్క రొక్కొక్క మహాపర్వతము. నావంటి యల్పజ్ఞునకు వారితో సామ్యము లేదు. చాలవఱకు వారి కృషి నంతయు నేనీ గ్రంథమున వాడుకొన్నానియే చెప్పవచ్చును. ఈ రచనమున నా ప్రత్యేకత యేమియు లేదు. వారి భావముల నొక మాలగా గూర్చి - మీయెదుట నుంచితినంతే. మహారాష్ట్రులెందఱో మహాభారతముపై విమర్శనము లొనర్చినారు. వారిలో ముఖ్యముగ "హరిదానుబాళాశాస్త్రి" గారి పేరు చెప్పవలసియున్నది. వారికి నా ప్రత్యేక కృతజ్ఞత.

గ్రంథము ముందున్నది. సహృదయులు చదివి - సౌజన్యముతో విమర్శించినచో ధన్యుడను.

కడప - పుట్టపర్తి నారాయణాచార్యులు

25-1-65

# సాహితీ సహస్రఫణి

అటు పటుతర గద్య పద్యోక్తుల జలధులను మధిస్తూనే, యిటు మృదు మధుర బంధురంగా, పదాలను సంధించగల ప్రజ్ఞగలవారు-పుట్టపర్తివారు. అటు భారత ప్రాచీన వైభవ కాంతుల తేజస్సులకు, ముగ్ధ హృదయులవుతూనే-యిటు సర్వధర్మాతీత మానవతా గాయత్రీ మంత్రాన్ని ప్రపంచ జనావళికి . ఉపదేశించగల అపర విశ్వామిత్రుడీ పుట్టపర్తివారు. స్వామీ శివానందుల వారిమాటల్లో సాహిత్య దర్పణకారుడు, ఉత్కళ దేశీయుడైన విశ్వనాధ కవిరాజులా 'చతుర్దశ భాషా విలాసినీ మనోహరుడు'గా వెలుగొందుతూనే మరోవైపు జ్యోతిష వ్యాకరణాలంకార శాస్త్ర పాండితీ ప్రకర్షతో 'సహఫణి'లా ప్రకాశించగల విద్వన్మణి పుట్టపర్తి. వీటితోపాటు సంగీత నాట్య విద్యలలోనూ అనన్య సామాన్యమైన ప్రజ్ఞాధురీణతను ప్రదర్శించగల బహుముఖీనమైన పాండితీ మూర్తి మత్వం పుట్టపర్తి వారిది. ఓ జీవితకాలంలో ఒక పండితుడు, యింతటి విశ్వరూపాన్ని ప్రదర్శించటం-"న భూతోన భవిష్యతి". సాహిత్యవేత్తగా వారి రచనలలో కనబడే చిక్కదనం, చారిత్రక పరిశోధకునిగానూ అనుభవానికి రావటం అద్వితీయం. వాగ్గేయకారునిగా వారి రచనలలో జాలువారేకమ్మదనానికీ-భాషా శాస్త్రవేత్తగా వారి ప్రసంగాలలో తొంగి చూచే కఠిన తపస్సు తాలూకు కరుకుదనానికీ పోలికే వుండదు. వజ్ర సమంగా తోచేవారి సమీక్షా ధోరణి నవనీత కోమలంగా అనుభూతమయ్యే వారి కవితాత్మక దృష్టి-దక్షిణ, ఉత్తర ధ్రువాలని ఒకచోటచేర్చటం సాధ్యమే ననిపిస్తాయి సుమా!

కవిగా, వాగ్గేయకారునిగా విమర్శకునిగా, పుట్టపర్తి భారతీయ సాహిత్య సువిశాల క్షేత్రంలోనే నిరుపమానులు. ఇన్ని రంగాలలోనూ పరిపక్వతను సాధించిన మహామేధాశాలులు మరి ఒకరు కనిపించటం దుర్లభమే.

డెబ్భై ఐదు సంవత్సరాల జీవన యాత్రలో అంతకు రెండింతల రచనల్ని వెలువరించి భారతీయ సాహిత్యక్షేత్రంలో 'నారాయణ గహనవనాన్ని' వ్యాపింపజేసిన పుట్టపర్తి వారి ముద్రిత రచనలలో యీ 'మహాభారత విమర్శనము' పండితోత్తముల

ప్రశంలనందుకున్న గ్రంధరాజనం.

పూర్వ సాహిత్య సురభిళాలను గ్రోలి, నవ్యసాహిత్య సీమలలో విహరించి, అన్య భాషా సాహిత్య చందన లేపనంతో పులకించి, సంగీత రసాస్వాదనలో మునిగి, నాట్యాభినయ భంగిమలలో తేలి, కావ్య వచన రచనాటవులలో చిక్కి, భక్తి సూత్రాధారంతో భగవత్సాన్నిధ్యానికి చేరుకున్న అపర భాగవతోత్తములు . మా అయ్యగారి మహాభారత విమర్శనము గ్రంధ పునర్ముద్రణకై తిరుమల తిరుపతి దేవస్థానం ఆర్ధికసహాయాన్ని అందజేయటానికి అంగీకరించటం, నా అదృష్టం. కారణాంతరాల వల్ల, ముద్రణ సకాలంలో జరగకపోయినా, నా అభ్యర్ధనమేరకు, మరింత గడువును పొడిగించి, పుస్తక ముద్రణలో సహకరించిన తి.తి.దే. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారికీ, సంపాదకులు శ్రీ ఎన్. ఎస్. రామమూర్తిగారికీ కృతజ్ఞతాంజలులు. గ్రంధముద్రణలో తగుసూచనలూ. సలహాలనిచ్చి. ఓరూపం వచ్చేలా చేసిన 'రచన' జర్నలిజం కళాశాల ప్రిన్సిపాల్, డాక్టర్, గోవిందరాజు చక్రధర్ గారికీ, అందంగా ముద్రించిన ' ఆకృతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారికీ, గ్రంధవిక్రయ భారాన్ని సహృదయంతో, అయ్యగారిపట్ల గౌరవాదారాలతో అంగీకరించిన 'విశాలాంధ్ర' శ్రీ రాజేశ్వరరావుగారికీ నా వినయాంజలులు. ముఖ్యంగా గ్రంథముద్రణలో సహకరించిన మా అన్నయ్య శ్రీమాన్ పుట్టపర్తి అరవింద్, కీ మా వదినె కుం.సౌ. రాజ్యలక్ష్మికి నా శుభాకాంక్షలు. అఖండ ప్రతిభా సంపన్నులు, పరమభాగవతోత్తములు 'పుట్టపర్తి' వారి కుమార్తెగా జన్మించి, ఈ మహోత్కృష్ట రచనను మళ్ళీ తెలుగు సాహితీలోకానికి అందించే మహద్భాగ్యం దక్కటం నా పురాకృత జన్మ విశేషం.

- పుట్టపర్తి నాగపద్మిని

# పుట్టపర్తివారి మహాభారత విమర్శనము

డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు, హైదరాబాద్

" నేనీ గ్రంథమును రచించి చాలా సంవత్సరము లయినది. అనేకకాల మీరచన మూలబడి యుండెను. ఇది వెలుగు జూచునను నాశ గూడ నాకుండ లేదు " లని పీఠికలో చెప్పుకున్నారు ఆచార్యులవారు.

శ్రీ ఆచార్యులవారు సంస్కృతం, ఇంగ్లీషు, ఇతర భారతీయ బాషలలో వచ్చిన మహాభారత వ్యాఖ్యానాలూ విమర్శలూ అన్నీ అవలోడనం చేసి ఈ గ్రంధాన్ని రచించినట్లు తెలుస్తున్నది. మహాభారత కాలం నాటి రాజకీయ, సాంఘిక, మత, నైతిక పరిస్థితులను ప్రతిభావంతంగా ఈ గ్రంథములో సమీక్షించారు ఆచార్యుల వారు. హిందూ మతం ఉత్పత్తతను గూర్చి తెలుసుకోదలచినవారు ఈ గ్రంధాన్ని తప్పక చదవాలి. భారతీయ సమాజాన్ని అనుశాసించే ఉన్నతాదర్శా లెటువంటివో, వారు ఆశించిన జీవిత పరమీర్థము ఎటువంటిదో, దాని ఉత్థాన పతనావస్థల చరిత్ర ఎటువంటిదో మహాభారతం ఆధారంగా ఈ విమర్శన గ్రంధంలో ఆచార్యులవారు నిరూపించారు.

వారు పలు భారతీయ భాషలలో మహాపండితులు కాబట్టి పరమ మనోజ్ఞమైన భావుకతా పరసీమలకు వారు చేరుకోగలిగారు. . ఈ గ్రంధం ఆచార్యుల వారి ప్రసన్నధారా మధురమైన శైలికి నిలయం. ఆదునిక తెలుగువచన శైలీ నిర్మాతలలో ఆచార్యులవారికి చెప్పుకోదగిన స్థానముంది వారి కాకువు, వారి అధిక్షేపణ, మృదుహాసోజ్జ్వలలలిత పదవిన్యాసశైలి ఈ గ్రంథంలో హృదయంగమం.

" మహాభారతం కురుపాండవుల యుద్ధగాథ మాత్రమే గాదు. అది ఆర్యుల తత్త్వజ్ఞాన, ధర్మశాస్త్ర, నీతిశాస్త్ర, రాజ్యశాస్త్రముల పేటిక. వ్యవహారశాస్త్ర , కామశాస్త్రముల సమావేశము. మన సంస్కృతి యొక్క సర్వస్వము. మన జ్ఞానకోశము " అంటారు ఆచార్యులవారు. ప్రపంచ సాహిత్యంలో ఇటువంటి గ్రంధం ఇంకొకటి లేదు అంటారు వారు. భారతదేశంలో మధ్యయుగాలలో విలసిల్లిన భక్తిపంధాకు మహాభారత విజ్ఞానమే జన్యభూమి అని సిద్ధాంతీకరించారు అచార్యులవారు.

శ్రీకృష్ణ తత్త్వాన్ని పరమ మనోజ్ఞంగా ఆవిష్కరించారు. మహారాష్ట్ర భాషలో ఉన్న గీతా వ్యాఖ్యానాలనన్నిటినీ పరిచయం చేశారు.రామాయణ, మహాభారతాలు భారతీయ జనజీవనంపై చూపిన ప్రభావాన్ని పుస్తకానుప్రసక్తంగా ప్రస్తావించారు.

మహాభారతానికి సంబంధించిన వివిధ విషయాల పరిశీలన ఆచార్యులవారి ఈ గ్రంధంలో నిస్తులంగా, అమితాశ్చర్యజనకంగా కనిపిస్తుంది . పాశ్చాత్య సాహిత్యకులు, విమర్శకులు, తత్త్వవేత్తలు మహాభారతాన్ని గురించి చేసిన అపవ్యాఖ్యానాలు, పడిన పొరపాట్లు, వెలిబుచ్చిన అసంగతాభిప్రాయాలు ప్రస్తావించి వాటికి మరి ప్రత్యాఖానం చేయలేని సమాధానాలు చెప్పారు ఆచార్యులవారు. భారతంలో పొంది పొసగనట్లు కన్పించే అంశాలను శ్రీ ఆచార్యులవారు ఎంతో సమర్థంగా సమన్వయించారు. ఇక విదేశీయుల స్వదేశీయుల దురర్థకమైన వ్రాతలను ఖండించారు.

భారతదేశంలో చిరకాల వ్యవస్థతమైనది ప్రజాసత్తాకమేనని అత్యంతాహ్లాదకరమైన ఆధారాలతో మహా భారతంలోని అనేక సన్నివేశాలను చూపుతూ నిరూపించారు ఆచార్యులవారు. అంతేకాదు

భాదతీయ రాజ్యవ్యవస్థపై పౌర జాన పదులకున్న నియంత్రణను అద్భుతంగా ఆవిష్కరించారు ఇటువంటి వ్యవస్థ అశోకుడి కాలం వరకు అమలులో ఉన్నట్లు చారిత్రక ప్రమాణాలు చూపారు ప్రజల సమ్మతితోనే పన్నులు పెంచవలసిందే కాని రాజు తనంతట తానుగా అధికంగా పన్నులు వసూలు చేయకూడదనటానికి నిదర్శనాలు భారతం శాంతి పర్వం ద్వారా వివరించారు.

మహా భారతేతివృత్తం కల్పితమనీ, చారిత్రం కాదనే వాదనలను ఆచార్యులవారు విశ్వసనీయమైన ఉపపత్తులతో ఖండించారు. మహాభారత యుద్ధం జరగటానికీ, ఆనాటి సామాజిక రాజకీయ జీవనంలో పతనావస్థ కలగటానికీ గణరాజ్య వ్యవస్థ దెబ్బతినడమేనని సోపపత్తికంగా వ్యాఖ్యానించారు. పురాణ చరిత్ర కాలం నుంచీ భారతదేశంలో గణ రాజ్యాలు అంటే రిపబ్లిక్‌లు మాత్రమే ఉండేవనీ వీరంతా కలిసి ఒక సమ్రాట్టును ఎన్నుకొనే వారనీ సమాఖ్య వ్యవస్థగా దేశమంతా శాంతి భద్రలతో, ప్రజా సౌకర్యానికి ప్రముఖ స్థానం ఇచ్చి అలరారుతూ ఉండేదనీ నిదర్శనాలతో విశ్లేషించి చూపారు శ్రీ ఆచార్యులవారు. ఈ ప్రజా సత్తాక గణరాజ్య వ్యవస్థకు జరాసంధుడు, శిశుపాలుడు, కంసుడు, దుర్యోధనుడు విఘాతం కలిగించడం వల్లనే భారత యుద్ధం అనివార్యమైందని అయా సంఘటనలద్వారా నిరూపించి చూపారు శ్రీ ఆచార్యులవారు. శ్యాంతి పర్వంలో భీష్ముడు ధర్మరాజుకు విచ్ఛిత్తి దేశ విపద్దశకు కారణమవుతున్న సత్యాన్ని విపులంగా వ్యాఖ్యానించారు పుట్టపర్తి వారు

పుట్టపర్తి వారి మహాభారత విమర్శనంలో మెచ్చుకోదగిన విషయం ఏమంటే ఆయా పాత్రల ఆంతరిక చిత్తవృత్తులను ఆయా సన్నివేశాల ఆధారంగా పారదర్శకంగా నిరూపించి ధర్మాధర్మాల పర్యవసానాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించడం. ఆధునికులలో కొందరు విమర్శకులు కౌరవుల పట్ల అమిత ఔదార్యాన్ని ప్రదర్శించడం, ఆపద్ధర్మ సన్నివేశాలను దుర్మేధావిలసనంతో వ్యాఖ్యానించడం, పాండవులను దోషులుగా నిరూపించడానికి ద్రావిడ ప్రాణాయామానికి పూనుకోవడం పుట్టపర్తి వారు నిర్ద్వంద్వంగా విస్పష్టంగా సూటిగా సరళంగా పరాస్తం చేశారు.

కర్ణుడి పాత్రౌన్నత్యాన్ని అమిత సానుభూతితో రూపుకట్టించారు. ధృతరాష్ట్రుడి దుర్మార్గాన్ని కాదనడానికి వీలులేని ప్రమాణాలతో నిరూపించారు. ధృతరాష్ట్రుడి వల్లనే భారత యుద్ధమనే మహా సంక్షోభం అనివార్యం కాలేక పోవడాన్ని గొప్ప న్యాయాధిపతి తిరుగులేని తీర్పులాగా ప్రకటించారు.

ఆచార్యులవారీ మహాభారత విమర్శనంలో కర్ణుడి దైవదుర్విపాకాన్ని విపులంగా, పరమకారుణికంగా వర్ణించారు. ప్రధాన పాత్రలన్నిటిలో కర్ణుణ్ణి అత్యంత ప్రధానపాత్రగా అతడి ఔదార్యాన్ని, సత్య సంధతను, దానగుణాన్ని విశ్లేషించి చూపారు. భీష్మ ద్రోణుల పాత్రల విశ్లేణం అద్భుత మనిపిస్తుంది. సంస్కృత భారతం చదవడానికి సామర్థ్యం లేని వారికి మహోపకారం చేశారు ఆచార్యులవారు. ఆ ప్రధాన పాత్రల స్థానాన్ని కూడా ఎంతో ప్రతిభావంతంగా విశ్లేషించారు.

ప్రసక్తాను ప్రసక్తంగా ఆధునిక ప్రపంచంలోని అనేక విప్లవ సిద్ధాంతాలతో మహాభారత తాత్త్విక దర్శనాన్ని పోల్చి నిగ్గు తేల్చడం శ్రీ ఆచార్యులవారి మహా ప్రతిభకు గీటురాయిలా ఈ విమర్శ గ్రంథం కనపడుతుంది.

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారి మహాభారత విమర్శనం యుగ యుగాల భారతీయ సంస్కృతిని వివరించే విశిష్ట గ్రంథం.

శ్రీమతే నారాయణాయ

# మహాభారత విమర్శనము

# ద్వితీయ భాగం

## స్పర్ధతో నుత్పన్నములైన మంచి గుణములు

ధర్మరాజుతో నన్నివిధముల దుర్యోధనునకుఁ బోటీ! తాను ధర్మరాజు కన్నను గొప్పవాఁడని 'పౌర జానపదు' లెంచవలెను. దానికిఁ దగిన మార్గము లన్నియు దుర్యోధనుఁ డన్వేషింపఁ దొడఁగెను. కౌంతేయులు రాజసూయము నొనర్చిరి. ఆ యజ్ఞముచే వారికిఁ బేరు ప్రతిష్ఠలు పెరిగినవి. పాండవు లడవులలో నున్నప్పుడు దుర్యోధనుఁడు గూడ తా నా యజ్ఞమును జేయఁ దలపోసెను. కాని రాజసూయము నొనర్చుట చిన్న పనిగాదు. ఆ యజ్ఞము చేయుటకు ముందు యజమానుఁడు లేక యాతని బంధువులు, సాటి క్షత్రియుల నందరిని బాహుబలముతో జయింపవలెను. విక్రమముతో రాజ్యమును సంపాదింపవలెను. ఇప్పటికి నీ రెండు పనులు దుర్యోధనుఁ డొనర్పలేదు. అతఁడు గర్ణునకుఁ దన కొఱఁత నెఱిఁగించెను. రాధేయుఁడు సుయోధనుని కోర్కెనుఁ జెల్లింపఁ బూనుకొన్నాఁడు. కర్ణు డెందరినో క్షత్రియులను గెల్చి, దుర్యోధనునకు వశవర్తులనుగా నొనర్చెను. మైత్రికి వశుఁడైన కర్ణుఁడు క్షత్రియుల నందరిని జయించి, తనకు స్వాధీనమొనర్చిన వెంటనే దుర్యోధనుని యాశ మూడు పూవు లారు కాయలైనది. అతఁడు గర్ణునితో నన్నాఁడు. నీవంటి మిత్రుఁడున్న వానికి ప్రపంచమున నలభ్యమైన సిద్ధి యేమున్నది? నా మనస్సునందున్న కొఱఁత నీ వెఱుఁగుదువు. యుధిష్ఠిరుఁ డొనర్చిన శ్రేష్ఠమైన రాజసూయయాగమును నేను సూచితిని. అట్టిదానిని నా చేతులారా నడిపింపవలెనని నాకోరిక. ఈ మాటలకుఁ గర్ణుఁ డెతయో సంతోషపడెను. అతఁడు దుర్యోధనునితో నిట్లు పలికెను. "మహారాజా! క్షత్రియు లందరును తావక పదాంకితులైనారు. ఇఁక రాజసూయము నొనర్ప వలెనా? లేదా? యన్న ప్రశ్న కవకాశ మెక్కడిది? అవశ్య మొనర్పుము. దాని కగు సంబారముల నన్నిటిని సేకరింతము గాక! పురోహితులను సిద్ధ మొనర్తుము."

కాని, కుల పురోహితు లందులకు సమ్మతి ంపలేదు. వారు రాజసూయమునకు బదులు "విష్ణుయాగ" మొనర్పఁదగునని దుర్యోధనునకు సలహా నొసఁగిరి. వారి మాటలివి.

స ఏవ ముక్తో నృపతి మువాచ ద్విజసత్తమః

...... ..... .......

తేన త్వం యజ! రాజేంద్ర! శ్రుణు చేదం వచో మమ

(భా. వవ. ప. అ. 266)

"సుయోధనా! యుధిష్ఠిరుండు జీవించి యున్నంతవఱకును, రాజసూయ మొనర్చు నధికారము నీకు లేదు. నీవు రాజు లందరిని గెలిచితివి. నిజమే! కాని, యుధిష్ఠిరుని జయింపలేదు గదా! మఱియాతని నిర్జించువఱకును క్షత్రజాతి నంతయు జయించినట్లు గాలేదు. ఇంతమాత్రమే గాదు. నీ తండ్రి పెద్దవాడు. ధృతరాష్ట్రుఁడు జీవించియే యున్నాఁడు. అతఁ డున్నంతవఱకును నీకు రాజసూయ మొనర్చు నధికారము లేదు. కనుక నా యజ్ఞ మొనర్చు తలఁపును వదలుము. మఱి యేదైనను వేఱుదాని నొనర్పుము."

దుర్యోధనుఁడు పురోహితుల యుపదేశములనుఁ బాలించెను. అతఁడు విష్ణు యాగము నొనర్చినాఁడు. తపస్వులు, యాచకులు, బ్రాహ్మణులు మొదలైనవారు యువరాజు దానగుణమున కెంతయో దనిసిరి. అతనికి 'దానశూరుఁ' డన్న కీర్తి దక్కినది. కాని యిందులో నొక్కటే లోపము. దుర్యోధనున కేర్పడిన యీ వితరణమునకు స్పర్ధయే కారణము. దుర్వాసుఁ డత్యంతకోపను డనుట జగద్విదితమే! అతనిని గూడ దుర్యోధనుఁడు దన యౌదార్యముచే మెప్పించెను. సేవలచే దృష్టి పెట్టెను. ఇంతటి యోర్పు హఠాత్తుగ దుర్యోధనునకెట్లు బుట్టినది? పాండవుల పేరెత్తినంతనే వాఁడు భగ్గుమని మండును గదా! కౌంతేయులను ప్రశంసించిన మైత్రేయ మహామునిని వాఁడు దమ్మిడీకి లెక్కగట్టి మాట్లాడెను.

మఱి దుర్వాసు నెడ నింత వినయముతో దుర్యోధనుడు వర్తించుటలో గారణమేమి? ఈ కపటవినయమునకు వెనుక నున్న మూలసూత్రమిది. పాండవులపై నుసిగొల్పుటకుఁ దన కెవరెవరు బనికి వత్తురని వానికిఁ దోచునో వారి నందరిని దుర్యోధను డెంతయో శ్రద్ధతో సేవించెను. దుర్వాసునిఁ గొలుచుటలో గూడ వాని యుద్దేశ్య మిదియే! ఈ యుక్తి బాగుగఁ బారినది. దుర్వాస మహర్షి దుర్యోధనునకు వరదానము గూడ నొనర్చెను. ఆ ఘట్ట మిది.

శ్రుత్వా తేషాం తథా వృత్తిం నగరే వసతా మివ

...... ..... ..... .....

స్వైరేవ తే మహాపాపై ర్గతా వై దుస్తరం తమః

(భా. వన. ప. అ. 262)

పాండవులు వనమునందు వసించుచుండిరి. కాని దుర్యోధనునకు నిరంతరమును వారి చింతయే! కాపట్యమునఁ బేరు మోసిన కర్ణ దుశ్శాసనులతోఁ జేరి దుర్యోధనుఁడు పాండవుల కెట్లు కీడొనర్పవలె ననియే సతత మాలోచించుచుండెను. ఇట్లుండ నొకనా డొక సంఘటనము జరిగినది. దుర్వాసుఁడు దన పదివేల శిష్యులతోఁ గూడ దుర్యోధనుని కడకు వచ్చెను. సుయోధనుఁడు వినమితుఁడై యా మహర్షి నాతిథ్యమున కాహ్వానించినాఁడు. శిష్యులతో పాటు, దుర్వాస మహర్షి నాతఁడు విధియుక్తముగ బూజించెను. రాత్రిందివము లేమరక యా మహర్షికి సేవలు సేయసాఁగెను. కొన్ని దినములు దుర్వాసుఁ డక్కడనే నిలిచినాఁడు. ఏ సమయమున కే శాపము వెట్టునో యని దుర్యోధనుని భయము. అందుకై వాఁడు శరీరమంతయు కన్నులుఁ గలిగి యా మహర్షి నుపాసించెను. ఎంతయో సమర్థతతో సేవలు నిర్వర్తించెను. ఋషి యాతనిని వింతవింతగాఁ బరీక్షించును. ఒకనా డా మహర్షి యిట్లు బలికెను. "నాకెక్కువ యాకలిగా నున్నది. వెంటనే భోజనమును దయారు జేయింపుము." ఈరీతి నాజ్ఞాపించి స్నానమునకై నదికి

వెళ్ళెను. వంట వెంటనే దయారైనది. ఓరంత ప్రొద్దునకు ఋషి తిరిగి వచ్చినాఁడు. వచ్చిన వాఁడు భోజనముకుఁ గూర్చొనలేదు. "నా కాకలి కాలేదని" యూరకొనెను. ఒకానొకనాఁడు ఋషి హఠాత్తుగ నా కాకలి యగుచున్నదనును. నోటిమాట నోట నుండగనే వంటలు దయారు గావలసినదే! మఱియొక నాటి యర్ధరాత్రి దుర్వాసుఁడు లేచి భోజనమన్నాఁడు! దుర్యోధనుడు వెంటనే వంట దయారుగావించెను. దుర్వాసు డిష్టము వచ్చినట్లు, దుర్యోధనుని నిందించుచు, "నాకు తిండి వలదు. పొమ్మన్నాడు!" ఈరీతి నాతఁడు పెట్టిన చిక్కులకు లెక్కలేదు. కాని దుర్యోధనుఁ డే వికారమునుఁ బొందలేదు. ఒకనాఁ డైనను విసుగుకొని యెఱుఁగడు. దుర్యోధనుని సేవలకు రుద్రాంశజుడైన దూర్వాసుఁడు పరమసంతుష్టుఁ డయ్యెను. అతఁడు సుయోధనుని జూచి "నీ సేవల కెంతయో సంతసించితిని. నేను బ్రసన్నుఁడ నైన నిఁక నీ కలభ్యమైన పదార్థము ముల్లోకములలో నుండరాదు. వరము గోరుమనెను." దుర్వాసుఁ డీమాట యనుసరికి సుయోధనుఁడు మిన్నందినాఁడు. కర్ణ దుశ్శాసనులతో నాలోచించికొని, యాతఁడు ఋషి నిట్లు వేడెను. "స్వామీ! మా కులమున కలంకారభూతుఁడైన యుధిష్ఠిరుఁడు బంధుజన సహితుడై వనములం దున్నాఁడు. అతఁడు గుణవంతుఁడు, ధర్మాత్ముఁడు, చారిత్రసంపన్నుఁడు. మీ రాతని కతిథి గావలెను. కాని యందులో నొక చిన్న కోరిక. పాంచాల రాజపుత్రు సుకుమారి, యశస్విని, శీలవతి, ఆమె బ్రాహ్మణులను, దన మగలను భుజింపజేసి, తానుగూడ నాహారమును స్వీకరించి, విశ్రాంతి గొనుచున్న సమయమున మీరచటికిఁ బోవలెను. అప్పుడు దమరు భోజనమును యాచింపవలెనని నా మనవి".

దుర్వాసుఁ డట్లే గానిమ్మన్నాఁడు. ఆ మహర్షి యటనుండి గదలెను. దుర్వాసుఁ డిచ్చిన వరమునకు సుయోధనునకు బట్టరాని సంతోషము గలిగినది. అతఁడు కర్ణుని చేయి చరిచి, పకపక నవ్వెను. రాధేయునకుఁ గూడ నీ

విషయ మిష్టమే! "మహారాజా! నీ శత్రువులింక దుర్భర సంకటములలో మునిగినట్లే! దుర్వాసునకుఁ గోపము మిక్కుటము. ఆ వహ్నిలో వారు భస్మమై పోవుటయు నిజము. ఇఁక చింతింపకుమ"ని కర్ణుఁడు దుర్యోధను నోదార్చెను. కనుక కర్ణుని వినయ ప్రదర్శనమును సత్యమైనది గాదు. అతని సద్గుణ ప్రదర్శనముల కెల్లనుఁ బ్రేరకమైన మూలశక్తి యొక్కటియే? పాండవులపై నసూయ, వారిని నాశన మొనర్పవలెనను దృఢ సంకల్పము. దుర్యోధనుని సద్గుణము లన్నియు, నిట్లు దుష్టభావ ప్రబోధితములై యురగ ఫణాలసితమైన రత్నమువలె, సత్పురుషుల కనిషేవ్యములైనవి. తన మాటలకు సమ్మతింపక, పాండవులఁ బ్రశంసించు పెద్దల నెందరినో వాఁడు దూషించెను. మైత్రేయ మహర్షి కౌంతేయులను ప్రశంసించినాఁడు. ఆ పొగడ్త సుయోధనునకు సహింపరాలేదు. వాఁడు వెంటనే మైత్రేయు తొడను బలముగాఁ జేతితో గ్రుద్దెనట.

దుర్యోధనుని బ్రాహ్మణభక్తి వంటిదే బ్రజలయెడ వాఁడు గనుపరచిన ప్రీతి గూడ! ఆశ్రమవాస పర్వమున నొక కథ వచ్చును. ధృత రాష్ట్రుఁ డీ మాట లనెను. "మావంశ మెన్నియో వర్షములనుండి మిమ్ముఁ బాలించుచు వచ్చినది. మీరును మా యెడల, ననూచానముగ రాజభక్తినిఁ బ్రదర్శించితిరి. నేటికిని నా సంతతియైన పాండవులు పాలించుచునే యున్నారు. నా సుతుఁడైన దుర్యోధనుఁడును మిమ్ము నింతవఱకుఁ బరిపాలించెను గదా!" ఈమాటలకు పౌర జానపదు లిట్లు సమాధానము నొసఁగిరి. "రాజా నీ వింతవఱకును, మమ్మెంతయో యాదరమునఁ బాలించితివి. నీ సుతుఁడైన దుర్యోధనుఁడునుఁ బ్రీతితో జూచెను. అతఁడు మా మనస్సుల కెన్నఁడును నొప్పి గలిగించినవాఁడు గాఁడు. దుర్యోధనుఁడు మమ్ము తన సంతానము వలెఁ బ్రేమించెను. యుధిష్ఠిరుఁడు గూడ వర్షసహస్రములు మమ్ముఁ గంటికి రెప్పవలె గాచి రక్షించినాఁడు.

దుర్యోధనుని పాలన యెడఁ బ్రజ లనురక్తులై యుండిరి. ఆతఁడు వారి నెంతయో యాదరముతోఁ జూచెను. కాని యా యాదరము నిష్కామమైనది గాదు. ధర్మశీలమైనది గాదు. పాండవులకన్నను దాను మిన్నయని జనులు దలపవలెను. ఈ భావమే యాతని సర్వ సద్గుణ ప్రదర్శనములకునుఁ బ్రేరకము. దుర్యోధనుఁడు ప్రజలయెడ జూపిన ప్రేమకు మఱియొక కారణము గూడ నున్నది. నాటి గణతంత్రరాజ్యములలో పౌరజానపదులకున్న పలుకుబడి సామాన్యమైనది గాదు. వారి సమ్మతి లేనిది యే రాజు గూడ సింహాసనము నెక్కి నిశ్చింతగఁ బాలింపలేదు. ఈ పౌరజానపదుల పలుకుబడియే పూర్వము దేవాపిని రాజసింహాసనము నుండి నిష్కాసితునొనర్చెను. ఈ విషయము లన్నియు సుయోధనునకుఁ దెలియనివి గావు. తనకు రాజ్యము ధర్మముగ, సంక్రాంతము గాలేదనియు వాఁడెఱుఁగును. అందుచేఁ బ్రజలెప్పుడు తమపైఁ దిరుగఁబడుదురో యని, తండ్రి కొడుకుల కిర్వురకును భయమే! ధృతరాష్ట్రుని హృదయమున నీ భయ మెంత గాఢముగ నుండెనో, యింతకు ముందు వివరించితిమి. దుర్యోధనుఁడుఁ గూడ బ్రజలనోళ్ళు మూయుటకై వారి యెడల లేని దయనుఁ గనుపరచెను. ఈ విషయములు మేము గల్పించి, దుర్యోధనుని తలపైకెత్తిన యభాండములు గావు. వాఁ డన్న మాటలలోనే యీ యర్థ మున్నది. దుర్యోధనుఁ డాడిన పల్కులివి.

ఏవ మేత న్మయా తాత! భావితం దోష మాత్మని

.....  .....  ......

ధ్రువ మస్మత్సహాయా స్తే భవిష్యంతి ప్రధానత:

(భా. ఆది ప. అ. 142)

తతో దుర్యోధనో రాజా! సర్వ మకృతయ శ్శనై:

.....  .......  ..........

అర్థమానప్రదానాభ్యాం సంజహార సహానుజ:

(భా. ఆది. ప. అ 143)

"ప్రజలకు నా పైన యిష్టము గలుగుటకు సంభవ మున్నదని నే నింతకుముందే గ్రహించితిని. గ్రహించి, వారి యసమ్మతినిఁ బోఁగొట్టుటకై యర్థమాన ప్రదానములతో నింతవఱకును లాలించుచు వచ్చితిని. ఈ ప్రజలు మనకే తోడుపడుదురని నాకు తోచుచున్నది."

ఇట్లు భావించి దుర్యోధనుఁ డనేకములైన త్యాగములతోఁ బ్రజలనుఁ బ్రసన్నులనుఁ జేసికొనెను. వారి హృదయములనుఁ గట్టివేయ దొడఁగెను.

## విడువని పట్టుదల - నాయక గుణములు

వానిది యుడుముపట్టు. ఒక యభిప్రాయము మనస్సున బడినచో దానిని సాధించుకొనుటకు, వాఁడు వేయు యెత్తులకు మితముండదు. త్యాగముతో ననేకులను, దుర్యోధనుఁడు వశీకరించికొనెను. ఇంతమాత్రమేగాదు. దూరస్థులైన వారితోఁ గూడ, దన ప్రయత్నమున కెవ్వరెవ్వరు దోడ్పడుదురో వారి నందరిని వేయి కన్నులతోఁ గనిపెట్టికొని సుయోధనుఁ డాదరించుచునే యుండెను. ఈ ప్రయత్నములు వాని బాల్యము నుండియే సాగినవి. ఇది యెంత దూరదృష్టి! అర్జునుఁడు మహాస్త్రసంపన్నుఁడు. ఈ విషయము సుయోధనునకుఁ దెలియును. ధనుర్విద్యలో కవ్వడి కెత్తువచ్చువాఁడు గర్ణుఁడే! కనుక దుర్యోధనుఁడు రాధేయునితో నెంతయో స్నేహము చేసెను. వాని కంగరాజ్య మొసఁగి లాలించెను. న్యాయముఁ జూచినచోఁ గర్ణుఁడు దుర్యోధనున కనుచరుఁడు. కాని యీ భావమును దుర్యోధనుఁ డెన్నడునుఁ గనుపరుపనే లేదు. కలకాలము కర్ణునితో మిత్రుని వలె మెలఁగెను. వాని స్నేహభిక్షను యాచించెను. ఈ విషయమును భారతకారులిట్లు వ్రాసిరి.

అభిషిక్తోzంగ రాజ్యేన శ్రియా యుక్తో సహాబలః

....... .......... .... ...

అత్యంత సఖ్య మిచ్ఛా మీత్యాహ తం స సుయోధనః

(భా. ఆది. ప. అ. 136)

దుర్యోధనస్యాపి తదా కర్ణమాసాద్య పార్థివ
భయ మర్జున సంజాతం క్షిప్ర మంతరధీయత
(భా. ఆది. ప అ. 137)

కర్ణుఁ డంగరాజ్యమున కభిషిక్తుఁ డైనాడు. రాజసంపద లన్నియు నాతనికి సంక్రమించినవి. ఛత్ర వాల వ్యజనములతో నాతఁడు దుర్నిరీక్ష్యుఁడై వెలిఁగెను. తనకుఁజరిపిన సత్కారమునకు సంతసించిన కర్ణుఁడు దుర్యోధనునితో "నీవు నాకు మహోపకారమొనర్చితివి. దానికి బదులు నేనేమి యొనర్తును? నా నుండి నీకేమి గావలెనో కోరుకొమ్మని యడిగెను. అప్పుడు దుర్యోధనుఁడు గర్ణునితో నిట్లన్నాఁడు. "త్రికరణశుద్ధిగా నీ స్నేహమే నాకుఁ గావలసినది. ఇంతకు మించి నీనుండి నాకేమియు వలదు."

కర్ణుఁడు మిత్రుడై నంతనే దుర్యోధనున కర్జునుని గూర్చిన భయము దొలఁగిపోయెను. ధార్తరాష్ట్రుఁడు గర్ణున కెన్ని యుపకారములో యొనర్చినాఁడు. అతఁడు వానిపై నిరంతర ప్రేమను వర్షించెను. లోకమున నే శక్తియు నే ప్రత్యాశయు వారి హృదయములను, మైత్రిని విడదీయలేకుండెను. అంతగా వారి మనస్సులు బరస్పర మల్లికొని పోయెను. కర్ణుఁడు పాండవులవైపు వచ్చినచో వానికిఁ గొన్ని గౌరవములు గలుగునని కృష్ణుఁ డొకసారి యాశ చూపెను. కర్ణుఁ డా యుచ్చునకు లొంగలేదు. సరిగదా! యా గౌరవము లన్నియు దుర్యోధనుఁడే గర్ణున కొనర్చెను. కృష్ణుఁడు గర్ణునిఁ గౌరవులనుండి విడదీయుటకై యెంతయో సమర్థముగఁ బ్రయత్నించినాఁడు. కాని రాధేయుఁడు రాలేదు. అతఁడు వినమ్రుఁడై వాసు దేవున కిట్లు జవాబు సెప్పినాఁడు. "కృష్ణా! దుర్యోధనుని యాశ్రయమున నేను పదమూడు వర్షములు జీవించితిని. ధార్తరాష్ట్రులందఱును నన్నెంతయో ప్రేమించిరి. ఎట్టి కష్టములలో నైనను నేను దుర్యోధనునకు హాని సేయనేరను. నాకు మరణమే ప్రాప్తించుగాక! సుయోధనుని నుండి నన్నెవ్వరును

వేఱుచేయలేరు. ఇఁక దక్కిన కష్టముల కేమి లెక్క? గొప్ప రాజ్యమిత్తునని నీవు పలుకుచున్నావు. ఆ రాజ్యము నా కెందులకు? ఒకవేళ నీవు మహా సామ్రాజ్యమే యొసఁగినను దానిని వెంటనే సుయోధనునకు సమర్పింతును. ఇది నిజము." కుంతీదేవి గూడఁ గర్ణునిపై నీ బాణమునే ప్రయోగించెను. ఆమె యుపాయము గూడ సాఁగిరాలేదు. కుంతీదేవితో కర్ణుఁ డిట్లన్నాడు. "అమ్మా! దుర్యోధనుఁడు నన్నెంతయో గౌరవించెను. అతఁడు నా కోర్కెలన్నియుఁ దీర్చినాడు. అభిన్నుఁడైన మిత్రుఁడుగ నాతో మెలఁగెను. ఒకనాడైనను నే నసుఖమును భావింపలేదు. ఇట్టి వానిని నేను వదిలి వచ్చుట ధర్మమగునా! దుర్యోధనుఁడు పాండవులతో వైరమునుఁ గట్టుకొనుట నన్ను విశ్వసించియే! నే నాతని వైపున నుండగఁ వైరు లెవ్వరు నాతని జయింపలేరని దుర్యోధనుని నమ్మకము. దేవత లింద్రుని పాదములకు నమస్కరించినట్లు నిరంతరము దుర్యోధనాదులు నాకు నమస్కరింతురు. ఇట్టి స్థితిలో దుర్యోధనుఁడు సంకటములో నున్నప్పుడు నే నాతనిని వదలి వచ్చుట నీచమైన పనిగదా! అతని యన్నముతో నింతవఱకును బ్రతికితిని. దానికి బదులు దీర్పవలసిన కాలము అరుదెంచినది. కృతఘ్నుఁడు సేసిన యుపకారమునకు బదు లపకారము నొనర్చును. కృతజ్ఞుఁడు యుపకారము నుపకారముతోనేఁ దీర్చును. నేను కృతఘ్నుఁడను గారాదు." దుర్యోధనుఁ డొక్క కర్ణుని పైననే యాధారపడలేదు. భీష్మద్రోణాదుల శక్తుల నాతఁడు బాగుగా గుర్తించి యుండెను. వారినిఁ బ్రసన్నుల జేసికొననిది తనకు పక్షబలముండదని వాఁ డెన్నడో యాకళించికొన్నాఁడు. అందుకై వారి సదభిప్రాయములను సంపాదించుట కెన్ని యత్నములనుఁ జేయవచ్చునో యన్నిటిని వాఁ డొనర్చినాఁడు. కడకు వారి హృదయములు సుయోధనునకు సంపూర్తిగ వశమైనవి. వారికిఁ గదలను మెదలను వీలులేకుండఁ జేసినాఁడు. అందుకుఁ గావలసిన మాట లన్నియు దుర్యోధనుఁడు వారితోఁ బలికెను. పాండవులు వనములం దున్నప్పుడు, సుయోధనుఁ డొకనాఁడు, భీష్మాదులతో నిట్లనెను:

వనే ప్రవ్రజితాన్ పార్థాన్ యదాయా న్మధుసూదన:
అగచ్ఛంతు వినేష్యామి! దర్ప మేషాం శితై శ్శరై:
(భా. ఉద్యో. ప. అ 52)

దుర్యోధనుఁ డిట్లనెను. "పాండవులు వనముల కేగినప్పుడు శత్రుసమ్మర్దన క్షమములైన తన సైన్యములఁ గూర్చికొని, శ్రీకృష్ణుఁడు వారితోఁ జేరినాఁడు. కృష్ణుని నేతృత్వమున నా సైన్యములన్నియు, ధార్తరాష్ట్రులను నాశన మొనర్పవలెనని తీర్మానించుకొన్నవి. వారందులకై ఘోర ప్రతిజ్ఞలుఁ గూడ నొనర్చిరి. అమాత్య సహితముగ ధృతరాష్ట్రుని వంశము నంతయు నాశనమొనర్చి రాజ్యము సంపాదించికొనుట దమ యభిమతమని కౌంతేయు లా సైన్యముల కెక్కులు వెట్టిరి. ఈ విషయములు నాకుఁ దెలిసినవి. నే నా మాటలను భీష్మ, ద్రోణ కృపాశ్వత్థామల కెఱిఁగించితిని. వారప్పుడు నాతో నన్నారు. "దుర్యోధనా! పాండవు లెత్తివత్తురని నీవేమియు భయపడకుము. మేము నీకు బాసటగ నిల్తుము. మేము నీ పక్షమున నున్నంత వఱకును, సర్వజగత్తులును గూడి యెత్తి వచ్చినను నిన్ను సాధింపఁజాలవు. మాలో నొక్కొక్కఁడును ఒక్కొక్క ప్రపంచమును జయింపఁజాలుదుము. ఇట్టి మేమందఱమునుఁ జేరి నీ వైపు నిలిచి పోరెదము. పాండవుల గర్వమంతయు మా బాణములచేఁ దుత్తునియలై పోవును. నీవు నిశ్చింతగ నుండుము."

ఈరీతి సత్యసంధులైన మహావీరులనుండి దుర్యోధనుఁడు ముందే జాగ్రత్తపడి ప్రమాణములను గ్రహించెను. ఇది యెంతటి గొప్ప రాజనీతి! కర్ణు డాతని కభిన్న మిత్రుఁడు. తొలుత నాతఁడే సర్వసేనాధిపతి గావలసియుండెను. ఇంతలో కర్ణ, భీష్ములకు వివాదమేర్పడినది. భీష్ముఁడు జీవించియుండు వఱకును నే నాయుధము ముట్టనని రాధేయుఁడు శపథమొనర్చెను. వేఱొకఁడైనచో నీ సన్నివేశమున ధైర్యమునుఁ గోలుపోయి యుండును. ఈవిషమ పరిస్థితిలో

దుర్యోధనుఁ డేమాత్రమునుఁ జలింపలేదు. అతఁడు నిశ్చలుఁడై భీష్మునికి సర్వసైన్యాధిపత్య మొసఁగెను. కర్ణుని మైత్రిచేఁ గట్టివేసికొనెను. కురువాహినియందు దినమునుఁ గలహములే! సేనాపతులు నిరంతరము దమలోఁదాము గలహించుకొనుచుండిరి. పరస్పర వధోద్యుక్తులగు వఱకును వారు విజృంభించెడివారు. కాని దుర్యోధనుఁ డెంతయో బుద్ధికుశలతతో నా కలహముల నప్పటికప్పుడు చల్లార్చుచుండెను. అందఱి హృదయములందును, వాఁ డొక విశిష్టమైన స్థానము సంపాదించుకొని ప్రేమతో నా మహావీరుల నోళ్ళనుఁ గట్టి వేసినాఁడు. భారతయుద్ధము గడముట్టఁ గొనసాగింపక దుర్యోధనుఁడు వదలలేదు. వాని రాజనీతిచాతుర్య మసామాన్యము. మహాసమర్థుఁడైన నాయకుఁ డాతఁడు. శల్యుని వాఁడు బొగడెను. "కృష్ణునికన్నను, నీవు గొప్పవాఁడ" వన్నాడు. ఆ పొగడ్త కుబ్బిపోయిన శల్యుఁడు కర్ణ సారథ్యమున కంగీకరించెను. అంత సమర్థమైనది దుర్యోధనుని రాజనీతి! ఉత్తర గోగ్రహణము మొదలు, కర్ణుఁడు నేలఁ బడువఱకునుఁ గౌరవ సభలో దినదినము నంతః కలహములే! ఒకనాఁడు కర్ణ భీష్ములు వాదించుకొందురు. వేఱొక దినమునఁ, నశ్వత్థామపైఁ గర్ణుఁడు సెలరేగును. మరియొకనాఁడు కర్ణ శల్యులు బోట్లాడుకొందురు. ఈ కలహముల నన్నిటిని, దుర్యోధనుఁ డెంతయో చాతుర్యముతోఁ జక్కదిద్దికొనుచుండెను. అందఱినుఁ దనయెడఁ బ్రసన్నులుగ నుండునట్లు వర్తించెను. ఈ సామర్థ్యము మానవదృష్టి కందనిది. కురువీరులు దమలోఁ దా మెంత కలహించికొనుచున్నను దుర్యోధనుని ప్రాణములను రక్షింపవలసి వచ్చినపుడు మాత్రము తమ ప్రాణములనుఁ దృణములుగ నెంచి పోరుటకు సిద్ధపడుచుండిరి. ఇదియే దుర్యోధనుని యాజమాన్యములోని కీలకము. వారందరి నంతగాఁ బ్రేమించెను. ఈ రాజకీయ చాతుర్యము కృష్ణపరమాత్ముని గూడ విభ్రాంతునొనర్చినది. అన్నిటికన్నను మించినది వాని ధైర్యము.

# అలౌకిక ధైర్యము

ఉత్సాహమే యూతగా దుర్యోధనుఁడు పాండవులతోఁ బోర దొరకొన్నాడు. రానురాను వాని బలగమంతయు క్షీణించినది. కాని వాని ధైర్య మినుమడించినది. ధృతరాష్ట్రుఁడు "దుర్యోధనా! నీ వెవ్వరిని నమ్ముకొని యుద్ధమునకు దిగుచున్నావో వారందఱు నీకుఁ బ్రతికూలురు. బయటికి మాత్రమనుకూలురవలె వర్తింతురు. మానవులేగాదు, దైవిక శక్తులును నీకు విరుద్ధముగాఁ బనిచేయుచున్నవి. ఇఁక నీ వెట్లు గెలుతు'వని ప్రశ్నించెను. దానికి దుర్యోధనుడిచ్చిన యుత్తరమిది.

"సమర్థం మన్యసే యచ్చ కుంతీపుత్రం వృకోదరం
విశీర్ణగాత్రః పృథివీం పరాసుః ప్రపతిష్యతి"
(భార. ఉద్యో. అధ్యా. 55)

నాహం భవతి న ద్రోణే నాశ్వత్థామ్ని న సంజయే ....
తావ దప్యపరిత్యాజ్యం భూమే ర్నః పాండవా ప్రతి
(భార. ఉద్యో. అధ్యా. 58)

మయాభిమంత్రితః శశ్వ జ్జాతవేదాః ప్రశామ్యతి ........
సమా ప్యనుపమం భూయః దేవోభ్యో విద్ధి భారత
(భార. ఉద్యో. అధ్యా. 61)

కుంతీపుత్రుఁడగు వృకోదరుఁడు చాల సమర్థుఁడని తలఁచుచున్నావు. అది నీ పొరబాటు. నన్ను గూర్చి యెఱుఁగవలసినంత నీ వెఱుఁగవు. గదాయుద్ధమున నాకు దీటగువాఁడు ముల్లోకముల లేడు. ఇఁక నన్ను మించువాడు లేడని వేఱుఁగాఁ జెప్పవలెనా? ఇఁకమీద నిట్టివాఁడు పుట్టునో లేదో గూడ సంశయము. అనేక సంవత్సరములు కష్టపడి గదా కౌశల్యమును సంపాదించితిని. ఇఁక భీమునకును వానివంటి యితరులకును భయపడవలసిన యవసరము నాకేమున్నది?

నేను గదాభ్యాసము నొనర్చు నాళులయందే నా గురువైన బలరాముఁడు గదా కౌశల్యమున నాతో సమానుఁడు లేడని నన్ను బ్రశంసించువాఁడు. అభ్యాసకాలమున నా పరిశ్రమ యంతటిది. అనేక సంవత్సరములు నేను గదామర్మముల నెఱిఁగి నేటికి బలరామునంతటివాఁడ నైతిని. నా గదాప్రహారమును భీముఁడు సహింపలేడు సుమా! ఒక్కసారి గదను బూన్చికొట్టితినా వృకోదరుఁడు భూమిపైఁ బడవలసినదే. గద బూన్చికొని భీముఁడు నాపై నడచివచ్చు వాలకముఁ జూడవలయునని గొప్ప యాశ. నా వ్రేటు దిని వాఁడు భూమిపై బొర్లాపడకుండ నుండడు. ద్రోణాశ్వత్థామలను గాని, సంజయ భీష్మకాంభోజాదులను గాని నమ్మి నేను యుద్ధమునకు దిగలేదు. బాహ్లీక భగదత్త భూరిశ్రవాదులు నన్ను రక్షింతు రనుకొనలేదు. నేను నా బలమునే పూర్తిగా నమ్మితిని. ఈ రణయజ్ఞమునకు నేనునుఁ గర్ణుఁడునుఁ బూర్తిగా యజమానులము. మే మిరువురము దీక్ష గైకొంటిమి. యుధిష్ఠిరుడే పశువు. రథములే యజ్ఞవేది. ఖడ్గమే స్రువము. గదయే స్రుక్కు. కవచమే సదము. బాణములే దర్భలు. కీర్తియే హవిర్భాగము. ఆత్మయజ్ఞముచే యమదేవతను ప్రసన్ను నొనర్చుకొని తత్ఫలముగ నఖండభూమండలము నేలుటకే నేను నిశ్చయించుకొన్నాను. కర్ణ, దుశ్శాసనులు నాకుఁ దోడుగాఁ బాండవుల నేను జయించి తీఱుదును. దీన సందేహము లేదు. ఈ యుద్ధమున నేను మరణించిననుఁ జింతింపను. నన్నుఁ జంపి వారో, వారిని జంపి నేనో రాజ్య మేలవలెను. ఇరువురును జీవించి రాజ్య మేలుకొందుమను మాట మాత్రము కలలోని వార్త. పలుమాట లెందుకు? సూదిమొన మోపినంత భూమిని గూడ నేను పాండవుల కియ్యను. తండ్రీ! నా సామర్థ్యమును నీ వెఱుఁగవు. నే నభిమంత్రించినచో నగ్ని గూడఁ జల్లబడిపోవును. అధిక తేజస్వులైన దేవతలకన్నను నేను తేజశ్శాలిని. దీన సందేహము లేదు. నీవు మిన్నకుండుము.

ఈ మాటలు దుర్యోధనుఁ డన్నప్పుడు వాఁడు మిత్ర సంపన్నుడు. నాడు వానికిఁ గావలసినంత బలగముండెను. కాని క్రమక్రమముగ వాని సర్వసంపత్తునుఁ దఱిగినది. మంత్రు లొక్కొక్కరే రణభూమికి బలియైనారు. తానెవ్వని నత్యంతము నమ్మి యుండెనో యట్టి మహారథుఁడైన కర్ణుఁడు గూడ గాండీవనిర్ముక్త బాణ భస్మీ భూతదేహుఁ డై నాడు. ఇఁక మిగిలినవారు గొందఱే. వారైనను గొప్ప సమర్థులు గారు. సమర్థులైనవా రొక్కరిద్దఱు మాత్రమే మిగిలియుండిరి. వారుగూడ యుద్ధోన్ముఖులుగ లేరు. మాటిమాటికి సంధి యొనర్చుకొనవలెనని దుర్యోధనుని హెచ్చరించుచుండిరి. ఇంతటి విరుద్ధసన్ని వేశములతోను దుర్యోధనుఁడు ధైర్యమును వదల లేదు. వాఁడు మేరువువలె నిశ్చలుఁడై నిలచెను. కృపాచార్యుఁడు సంధికై హెచ్చరించినప్పుడు సుయోధనునిమాట లెంత యుదార గంభీరములై యున్నవో చూడుడు.

"పాండవానాం ప్రసాదేన భోక్ష్యే రాజ్య మహం కథం ....
ఋణం తత్ప్రతియుంజానో రాజ్యేన మన ఆదధే.
(భార. శల్య. అధ్యా 5.)

మూర్ధాభిషిక్తులైన రాజుల శిరస్సులపై నేనింతవఱకును సూర్యునివలెఁ బ్రకాశించుచు వచ్చితిని. నా యాజ్ఞలను క్షత్రియులు మాల్యములవలె శిరస్సులపై ధరించిరి. ఇట్టి నేనిపుడు పాండవుల నాశ్రయించి వారు దయతో నొసఁగు భిక్షను గ్రహింతునా? ఇంత వఱకును దేవేంద్రసుఖములనే యనుభవించితిని. అడిగినవారి కడిగినట్లంతయు దక్షిణ లొసఁగితిని. సామాన్య దాసునివలె నేనిపుడు ధర్మరాజు నెట్లు సమీపింతును? వీరుఁడై యుద్ధమొనర్చి మరణింపవలసిన కాలమే. అంతేగాని షండునివలె ధర్మరాజునకు భయపడి నా జీవితమును, వయస్సును. నేనవమానపఱుపలేను. క్షత్రియుఁడు సామాన్యునివలె నింటిలోఁ బడకపైఁ బడి చావరాదు. అట్టిమరణమధర్మము. బంధువులు, భార్యలు తనచుట్టు మూగి

యేడ్చుచుండగా మరణమునకు భయపడిన వానివలె వెలవెలఁ బోవుచుఁ బ్రాణములు వదలుట అదియు నొక మరణమేనా? వాఁ డొక మనుష్యుఁడేనా? బ్రతికినంతకాలము శూరుల వృత్తము ననుసరించి వెన్నుఁ జూపక రణముఖమునఁ బడి పోరితిని. సత్యసంధుఁడనై మెలఁగితిని. ఋతువుల యందుఁ దప్పక యజించితిని. ఇట్టివాఁడను నేడు బాలిశుఁడనై స్వర్గము దప్పిన మరణము ననుభవింతునా? వీరమరణము పవిత్రము. అట్లు మరణించినవారి కప్సరస లెదురువత్తురు. వాని పితరులు సంతసింతురు. కృపాచార్యా! ఇన్నిమాట లెందుకు? నన్ను ప్రేమించి నా జయమునకై యనేకులు మహావీరులు రణస్థలికిఁ బ్రాణములు బలిగట్టిరి. వారందఱు వోయిన వెనుక నేను ధర్మజునితో సంధిఁ జేసికొని రాజ్యసుఖముల ననుభవింపవచ్చునా? అది వారియెడ నేనొనర్చు ద్రోహము కాదా? యుద్ధమే నాకవశ్య కర్తవ్యము.'

దుర్యోధనుని సైన్యము లన్నియుఁ బోయెను. శల్యాదులు నశించిరి. సోదరులు మరణించినారు. ఏకాకిగా వాడు మిగిలెను. వాఁడు గదఁ చేతఁబట్టుకొని జలస్తంభనవిద్యచే నొక హ్రదమునఁ బ్రవేశించి విశ్రాంతి దీసికొనుచున్నాడు. ఈ విషయమును గ్రహించి యుధిష్ఠిరుం డాతని వెంబడించెను. సైన్యసమేతుఁడై ధర్మరాజా హ్రదముయొక్క తీరమున నిలచి "భయపడి పాఱివచ్చినావే" మని కురురాజు నెకసక్కెము లాడఁదొడగెను. దానితో దుర్యోధనుని మనస్సు గదలాడెను. వాడు భయపడి రాలేదు. విశ్రాంతి గైకొనుటకై వచ్చెను. కాక నది యొక క్షణికమైన దౌర్బల్యము. వెంటనే దుర్యోధనుని హృదయధైర్యమిట్లు ధర్మరాజునకు జవాబు చెప్పెను. గుండె గదలించు నా యుత్తర మిది.

"అరథ శ్చానిషంగీ చ నిహత: పార్ష్ణి సారధి: ..
అహ ముత్థాయ వ స్సర్వా న్ప్రతియోత్స్యామి సంయుగే"
(భార. శల్య. అధ్యా 31)

'ధర్మరాజా! నాకడ రథము లేదు. నిషంగము లేదు. రథరక్షకులైన సారథులు నశించిరి. నా పరివార మనుకొనఁదగిన వాఁడొక్కఁడు గూడ మిగులలేదు. అందుచేఁ గొన్ని గడియలు విశ్రాంతి ననుభవించుటకై వచ్చితిని. దీనికి నీ వంత పరిహసింపవలసిన పని యేమున్నది? నే నిట నుండుట కేవలము విశ్రాంతి కొఱకే. ప్రాణముల దాచికొనుటకు గాదు. నిన్నుఁజూచి భయపడి కాదు. విషాదమునకు లోఁగికాదు. నీవునుఁ గొన్ని గడియలు విశ్రమింపుము. నేవిదే వచ్చుచున్నాను. మఱల యుద్ధ మారంభింతము.'

మాలో నీ యిష్టమైన వాని నొక్కని నెన్నుకొని వానితోఁ బోరి జయింపుమని ధర్మరాజు నిర్ణయమొనర్చెను. దుర్యోధనుఁడు కేవల కార్యకరుడైనచో భీముని దప్ప మఱి యొక్కనిని గోరికొని యుండెడువాఁడు. అతం డట్లొనర్పలేదు. వృకోదరుఁడే తనకు సరియైన యుద్ధియని యాతని యభిప్రాయము. కురుక్షేత్రము నుండి శమంతకపంచకమునకుఁ గదలి యచ్చటఁ బోరఁదగునని బలరాముఁడు వారి నాజ్ఞాపించెను. అతని యాదేశము నందఱు మన్నించి యటకుఁ గదలిరి. గదాధారియైన దుర్యోధనుఁడు కృతాంతుని వలె పాదచారియై శమంతకపంచకమునకుఁ గదలెను. అతఁడు పాండవులవైన రథాదిసౌకర్యములఁ గూడ నపేక్షింపలేదు. వాడంత నిర్భీకుఁడు. అంత స్వతంత్రుఁడు. అప్పటి వాని ధైర్యమును దేవతలే స్తుతించిరట. ఈ వర్ణనము వ్యాసభగవానునిదే.

"తతో దుర్యోధనో రాజా ప్రగృహ్య మహతీం గదాం

...... ........ .......

దేవతా శ్చారణా యే తు దృష్ట్వా తే హర్ష మాగతాః"

(భార. శల్య. అధ్యా. 55)

గదా ధారియైన దుర్యోధనుఁడు తేజోబిషహ్యుఁడై పాండవుల వెంట నడచెను. దంశితుఁడై ప్రతివీరులవెంట నడిచివచ్చుచున్న యా దుర్యోధనుని వాలకమునుఁ

జూచి యాకాశమున నున్న దేవతలు సాధువాదము లొనర్చిరి. చారణులు గంధర్వులు మొదలైన దేవజాతులు గొంతెత్తి స్తుతించిరి.

భీముఁ డ ధర్మమున వాని తొడకుఁ గొట్టెను. అప్పుడు గూడ దుర్యోధనుని ధైర్యము చలింపలేదు. వాని యా మూర్తినిఁ గాంచి యందఱు రిచ్చపడినారు. కృష్ణుఁడును విభ్రాంతుఁడయ్యెను. నేలపైఁ బడిన దుర్యోధనుని శిరమును భీముఁడు వామపాదమునఁ దన్నునపుడు కృష్ణుఁడు గూడ సహింపలేక పోయినాఁడు. అతఁడు ధర్మరాజు నిట్లు ప్రశ్నించెను.

"దుర్యోధనస్య భీమేన మృద్యమానం శిరఃపదా
ఉపప్రేక్షసి కస్మాత్త్వం ధర్మజ్ఞస్స న్న రాధిప"
(భార. శల్య. అధ్యా. 60)

ధర్మరాజా! నీవు ధర్మసూక్ష్మము లెఱిఁగినవాఁడవు. నేలఁబడిన దుర్యోధనుని శిరస్సున భీముఁడు పాదముతోఁ గొట్టుచున్నపుడు చూచి యుపేక్షించుట నీకుఁ దగునా?

కడకు కృష్ణుఁడు దుర్యోధనునిఁ బరిహసింపఁ దొరకొన్నాఁడు. ఆ పరిహాసమునకు ధార్తరాష్ట్రుఁడు దట్టుకొనలేక పోయెను. వాఁడు వెంటనే కృష్ణున కుత్తరమిచ్చెను. వాని ధైర్యమెంతటిదో యా మాట స్పష్టముగఁ జెప్పును. ఆ సన్నివేశమును వ్యాసుఁ డిట్లు వర్ణించెను.

"అమర్షవశ మాపన్న ఉదతిష్ఠ ద్విశాంపతే ....
కాకావా కంకగృధ్రా వా నిధాస్యంతి వదం క్షణాత్"

కృష్ణుఁ డొనర్చిన యపహాసమునకు దుర్యోధనున కమర్షము చెలరేగినది. వాఁ డిరు హస్తములను భూమిపై నాన్చి యొంటితొడపై లేచి కూర్చొనెను. వాని యా చూపులు కృష్ణునిఁ గాల్చి వేయునట్లు వెలుఁగుచుండెను. అర్ధోన్నత

శరీరుఁడగు ధార్తరాష్ట్రుని రూపము ఛిన్నపుచ్ఛమైన యాశీవిషముయొక్క శరీరీమునుఁ దలపించెను. ప్రాణాంతకమైన వేదనను గూడ వాఁడు లెక్కింపలేదు. గట్టిగా బుసఁగొట్టుచు వాసుదేవునితో దుర్యోధనుఁ డన్నాఁడు. "కంసదాసుని పుత్ర! నీ వొనర్చు దురాచారముల కంతు లేదు. లజ్జాహీనుఁడవై గొప్ప ధర్మజ్ఞునివలె భాషింతువు. నన్ను గదా యుద్ధమున గెలిచిన దధర్మముతోనే గదా! నా తొడకు గుఱిచూచి కొట్టమని భీముని నిర్దేశించినది నీవే. నేడు నాకేమి తక్కువైనది గనుక. సాగరాంబరయైన భూమినంతయు నడ్డులేక యేలితిని. క్షత్రియులు గోరఁదగినట్టి వీరమరణమునే యందితిని. నే ననుభవించిన భోగములు దేవతాయోగ్యములే కాని మానవులకుఁ దక్కునవి గావు. తృప్తిగ ననుభవించితిని. కావలసినన్ని దానము లొసఁగితిని. ఇఁక నాకేమి తక్కువ యైనది. నే నిదే స్వర్గమునకుఁ బోవుచున్నాను. వీరమరణమునకు స్వర్గమే గదా ఫలము! నా శిరస్సును భీముఁడు గాలితోఁ దన్నినని నేనేమియు బాధపడుటలేదు. ఇఁక గొంతసేపటికే నాతలనుఁ గాకులు పీకును. గృధ్రములు దీని పై నాడును. ప్రాణములు పోయిన వెనుక నెవరేమి యొనర్చిన నవమాన మేమున్నది?

దుర్యోధనుని ధైర్య మకుతోభయమైనది. అసామాన్యమైన యా ధైర్యముతోనే వాఁడు సద్గతు లందెను. స్వర్గారోహణ పర్వమున నారదుఁడు యుధిష్ఠిరునితో నిట్లు పలికెను.

"దుర్యోధనం ప్రతివృపం శ్రుణు చేదం వచో మమ

.......... ........... .......

భయే మహతి యో భీతో బభూవ పృధివీపతి:"

(భార. స్వర్గా. అధ్యా. 3)

రాజా! దుర్యోధనుని దేవతలు గూడ ప్రశంసించుచున్నారు. దీనికిఁ గారణ మెఱుఁగుదువా? క్షత్రధర్మముచే నాతఁ డంతటి గొప్ప వాఁడయ్యెను. అంతటి స్థానము నందుకొనెను.'

తల మునిఁగిపోవు కష్టములు వచ్చినను జంకనివీరుఁ డాతఁడు. మృత్యువునైనను జయింతునన్నంతటి పట్టుదల.

దుర్యోధనుఁ డలౌకిక ధైర్యసంపన్నుఁడు. కొన్ని విషయములలో నుదారుఁడు. కాని ధర్మదృష్టిలేని యభిలాష, క్షుద్రత, వాని హృదయము నావరించినవి. క్రోధ మాత్సర్యములు దావు చేసికొన్నవి. వాని మహత్త్వాకాంక్షతో నధమవృత్తి గలిగినది. నీతినిఁగూడ వాఁ డొక్కొక్కసారి లెక్కింపలేదు. శత్రువుల నెప్పుడెప్పుడు గాటు వేయవలెననియే వాని దృష్టి. ఇన్ని కళంకములతో వానిలోనున్న కొన్ని సద్గుణములు గూడ దుష్టఫలములనే యొసఁగినవి. ఇందుకే వేదవ్యాసులు వానిని "రాజకలి" యనిరి. దుర్యోధనుఁడు కలిపురుషుని యంశావతారుఁ డయ్యెను. వాఁడు స్వర్గమునే సాధించియుండవచ్చును. కాని ధర్మము, న్యాయము, సంస్కృతి వీనియొక్క శాశ్వతములైన మూల్యములను వాఁడు నాశనమొనర్చెను. అందుచేవానిని వధించుట తప్పనిసరియయ్యెను. భారతకాలమునాటికి రాజ్య సంస్థ పతనోన్ముఖమై యుండినది. ఆ స్థితికిఁ బ్రతీకముగా వ్యాసభగవానులు ధృతరాష్ట్ర దుర్యోధనులను సృష్టించెను. దుశ్శాసన శకునులు పతితమైపోయిన సచివసంస్థకుఁ బ్రతీకములు. అది యెట్లో పైనిఁ జూతముగాక.

## దుశ్శాసనుఁడు - శకుని

దుర్యోధనుఁ డన్నంతనేదుశ్శాసనుఁడు గూడ నున్నట్లే. ఈ పేరుల కంతటి యవినాభావసంబంధము. సుయోధనుని తమ్ముఁడు దుస్సేనుఁడు. దుర్యోధన దుశ్శాసనులు, శకుని కర్ణులు యీ నల్వురకును "దుష్ట చతుష్టయ" మని పేరు. వీరికున్న పరస్పర ప్రేమ యసామాన్యమైనది. ఘోషయాత్రయందు దుర్యోధనున కవమానమైనది. అతఁడు సహింపలేకపోయెను. ప్రాయోపవేశమునకుఁ దయారైనాఁడు. తాను మరణింతుననియు నికమీద, దుశ్శాసనుఁడు రాజుగ

నుండవలెననియు దుర్యోధనుఁడు దమ్ముని కానవెట్టెను. అపుడు దుస్ససేనుఁ డెంతయో బాధపడినాఁడు. అన్నలేని రాజ్యము దన కక్కఅలేదనెను. దుస్ససేనునకు సుయోధనుపైఁ గల ప్రేమ యట్టిది! వాఁడాతనిని నీడవలె ననుసరించినాఁడు. ప్రాయోపవేశమునకుఁ దయారైన యన్నతో దుస్ససేనుఁ డన్నమాటలీ క్రిందివి.

"తస్య తద్వచనం శ్రుత్వా దీనో దుశ్శాసనో ఽబ్రవీత్

..... ..... ......

పాదౌ సంస్పృశ్యమానార్తో భ్రాతు ర్జ్యేష్ఠస్య భారత!

(భా. వన. అ. 249)

దుర్యోధనుని వచనము లవి. దుస్ససేనుఁడు దీనుఁడయ్యెను. వాని కంఠమునుఁ గన్నీరు సుట్టుకొన్నది. వాఁ డన్నకు నమస్కరించెను. నమస్కరించి యిట్లు విన్నవించినాఁడు. "భూమియంతయు బీటలు వాఱినను, యాకాశము చిన్న చిన్న శకలములైనను నీవులేని రాజ్యము నాకు వలదు. సూర్యుఁడు నిస్తేజస్కుఁడగుఁ గాక! చంద్రుఁడు చల్లదనమును వదలుఁగాక! వాయువేగము స్తంభించుగాక! వహ్ని యుష్ణమునుఁ గోల్పోవుఁగాక. సముద్రము లందలి నీరెండిపోవుఁగాక! హిమాచలము కంపించుఁగాక! అన్నా! నీవులేని వైభవములు నే నంగీకరింపనేరను. నన్నుఁ గరుణింపుము. నీవే మాకధీశ్వరుఁడవై పూర్ణాయుషము రాజ్య మేలఁదగినవాఁడవు." ఈమాట లనుచు దుశ్శాసనుఁ డన్న పాదములంటి వానిని గన్నీటితోఁ దడుపుచు విలపించెను.

## బానిసతనము

దుశ్శాసనుఁ డన్ని రీతులఁ బరతంత్రుఁడు. వానికి స్వతంత్రమైన యాలోచన లేదు. అన్న చెప్పిన పనిని యంత్రమువలె నెరవేర్పవలెను. వాని యభిలాష యంతే! అన్న చెప్పిన దానికంటెను నూరింత లెక్కువ సాధింపవలెననుటయే

వాని యభిలాష. దుశ్శాసనుని పాత్రలో నడుగడుగునను నీ ప్రవృత్తియే గనుపించును. దీనికిఁ దోడు ఔద్ధత్యమొక్కటి! ఏ విషయమునుఁ గాని స్వతంత్రముగ నాలోచించుట, నిర్ణయించికొనుట యా మనుష్యునకు లేనేలేదు. చాతుర్యము సున్న. సూక్ష్మముగఁ జెప్పినచో వాఁడు కేవలమలౌకికుఁడు. కర్ణుఁడు దిగ్విజయ మొనర్చినాఁడు. దిగ్విజయానంతరము సుయోధనుఁడు విష్ణుయాగ మొనర్పఁబూనెను. అందఱు రాజుల నాహ్వానించినాఁడు. అట్లే కౌంతేయులనుఁ గూడఁ బిలువ వలెను. రాజుల నాహ్వానించు పని సుయోధనుఁడు చిట్టి తమ్మున కప్పఁజెప్పెను. దుశ్శాసనుఁ డొక దూతనుఁ బాండవుల కడకుం బెత్తెంచినాఁడు. ఆ సందర్భమును వ్యాసభగవానుఁడు యిట్లు వర్ణించెను.

"తత్ర కంచి త్ప్రయాతం తు దూతం దుర్యోధనోz బ్రవీత్ బ్రవీత్
గచ్ఛ ద్వైతవనం శీఘ్రం పాండవాన్ పాపపూరుషాన్
నిమంత్రయ యథా న్యాయం విప్రాన్ తస్మిన్ వనే తథా!

దుశ్శాసనుఁ డొక దూతను జూచి యిట్లు బలికెను. "పాండవులు ద్వైతవనమున నున్నారు. నీ వటకుఁ బొమ్ము! పోయి పాపపూరుషులైన పాండవులను యథాన్యాయముగ యాగమున కాహ్వానింపుము. తక్కిన విప్రులను గూడఁ బిలువుము."

ఈ దూతనుఁ బంపుట దుశ్శాసనుని 'బాలిశత' గాక మరేమి? పైఁగా వాఁడు పాండవులు'పాప పూరుషుల'ని యొకక్రొత్త సిద్ధాంతమును లేవదీసినాఁడు. దుర్యోధనుఁ డర్ధరాజ్యము నెట్లు సంపాదించెనో మన మెఱుంగుదుము. జూదము మొదలైనవి వాని క్రీడలు. వాస్తవ మిట్లుండగా దుశ్శాసనుఁడే పాండవులను పాపులని నిందించుట చాల చమత్కారముగదా! పాండవుల నాహ్వానించుటలో దుశ్శాసనుని మనస్సున వేఱొక దురుద్దేశము గూడ నుండెను. వారికిఁ దమ

వైభవమును జూపింపవలెనను నాశ! వానికి దుశ్శాసనునిలో నింతటి బాలిశత యున్నను నొకరీతిగఁ జూచినచో వాఁ డొక గొప్ప దురదృష్టవంతుఁడు. స్వతంత్రం మగు నాలోచనా శక్తి వానికి లేదంటిమి. ఎదుటివా రెట్లీడ్చిన నట్లుపోవును వాని చిత్తవృత్తి. వాఁడు మగవాఁడైనను వానిది లతావృత్తి. ఏదో యొక చెట్టు నాశ్రయించికొనియే బ్రదుకవలెను. వాని దుర్దైవవశమున దుర్యోధనునివంటి యన్న లభించినాఁడు. అందుచే వాని జీవితమంతయుఁ బాపపూరితమైనది. యుధిష్ఠిరునివంటి మార్గోపదేశకుఁడే దుశ్శాసనునకు దొఱకియున్నచో వాఁ డెంతయో సత్పురుషుఁడుగ మారియుండును. చరిత్రలో వాని జీవితము సువర్ణమువలె ధగధగ వెలిగిపోయెడిది. కాని యట్టి యదృష్టము వానికిఁ బట్టలేదు. కలిపురుషుని నీడ వానిని వెన్నంటెను. దుస్సేనుఁ డా పలుకుఁబడికి లొంగిపోయినాఁడు. వాని బ్రదు కయోమయమై పోయినది. తన దుర్వాసనలన్నియు దుర్యోధనుఁడు దుశ్శాసనుని మూలమున దీర్చికొన్నాఁడు. దుర్యోధనుని హృదయమున నొక నీచభావము జనించుటయే తడవు వెంటనే యది దుశ్శాసనునిచే నాచరింపఁబడుచుండెను. దుస్సేనుని యందే స్వభావసిద్ధమగు నొక బాలిశతన ముండెనంటిమి. చెడు కార్యములొనర్చుటలో వాని కొక విధమైన యానందము. ధృష్టత, లజ్జాహీనత, ఔద్ధత్యము, బాలిశత, నీచమైన మనఃప్రవృత్తి వీని నన్నిటి నొకచోట జేర్చి వ్యాసభగవానుఁడు వానికి దుశ్శాసనుఁడని పేరు పెట్టెను. అడుగడుగునను వీఁ డొనర్చిన యపచారములు వానిపైఁ బాండవుల కెంతయో రోషమునుఁ బెంచినవి. కడకు భీముఁడు వాని వక్షమును ఛేదించి రక్తపాన మొనర్చినాఁడు. అంతవఱకును భీముని కోప మాగినది గాదు. అనఁగా దుశ్శాసనుఁ డొనర్చిన యపచారము లంతటి ఘోరములన్న మాట! దుశ్శాసనుని నీచత్వము ద్రౌపదీవస్త్రాపహరణ సందర్భమున పరాకాష్ఠ నందెను. ఆ సన్నివేశము వ్యాసునిచే నిట్లు వర్ణితము.

"దుశ్శాస నైష మమ సూతపుత్రో వృకోదరా దుద్విజతే ఽల్పచేతాః

.... ........ ......

...... .....

అధూయ వేగేన విసంజ్ఞకల్పా మువాచ దాసీతి హసన్ సశబ్దం.

(భా. సభా. అ. 37)

దుర్యోధనుఁడు దుశ్శాసునితో నన్నాఁడు. "సూతపుత్రుఁడైన యీ విదురుఁడు భీముని జూచి భయపడుచున్నాఁడు. ఇతఁ డల్పచేతస్కుఁడు. నీవే పోయి బలాత్కారముగా ద్రౌపది నిటకుఁ దెమ్ము. మన దాసులైన పాండవు లేమి యొనర్తురో చూతును గాక!" అన్న యానతిని విని దుశ్శాసనుఁడు వెంటనే సభనుండి లేచినాఁడు. వాని కన్ను లెఱ్ఱవారినవి. దుశ్శాసనుఁ డంతిపురమునుఁ జేరి రాజపుత్రి యైన ద్రౌపదితో నిట్లనెను. "పాంచాలీ! నీవు నా వెంటరమ్ము! పాండవులు మాచే జయింపఁబడిరి. లజ్జను వదలి మా యన్న వైపునకుఁ జూడుము! విశాలమైన కన్నులు గలదానా! కౌరవులను సేవింపుము. మేము నిన్ను ధర్మముతోనే గెలిచితిమి. ఇక నీకు మార్గాంతరము లేదు. నా వెంట సభకు రావలెను."ఈ మాటలు విని ద్రౌపది కెంతయో మనోవేధ గలిగెను. ఆమె మొగము తెల్లవారినది. రెండు చేతులతో ద్రౌపది మొగమునుఁ గప్పికొన్నది. వయసు జెల్లిన స్త్రీలున్నయెడ కామె యటనుండి బోయెను. దుశ్శాసనుని కోపమినుమడించెను. వాఁడు గర్జించుచు ద్రౌపదివెంటఁ బడినాఁడు ఆమె కేశములు దీర్ఘనీలములు, వంకరలైనవి. దుశ్శాసనుఁ డామె వెంట్రుకలపైఁ జేయి వైచెను. రాజసూయ యజ్ఞమునందు అవభృథ స్నానముచే పవిత్రమయిన యామె శిరోజములు పట్టి వాఁ డీడ్చెను. ఈడ్వఁబడుచున్న యమె యవశయై దుశ్శాసనుని వెంట సభారంగమునకు వచ్చినది. ఆమె నాథపతి యైనను యప్పు డనాథ! ఆమె తిన్నగా ననెను. "నేను రజస్వలను. ఏకవస్త్రను. అనార్యుఁడైన దుశ్శాసనా! నేను సభలోనికి రారాదు. నన్నీడ్వకుము." ఈమాటలకు దుశ్శాసనుఁడు బకపక నవ్వెను.

నవ్వుచు నీడ్వఁజొచ్చెను. ఆమె పాండవులను, కృష్ణునిఁ దలఁచికొని యేడ్వనారంభించినది. దుశ్శాసనుఁ డామె కిట్లుత్తర మిచ్చెను. "ద్రౌపదీ! నీవు రజస్వలవైన మాకేమి? ఏకాంబరవైనను వివస్త్రవైనను మాకుఁ గాఁబట్టదు. జూదమున మిమ్ము గెలిచితిమి. నీవు మాకు దాసివి." దుశ్శాసనుఁడు ద్రౌపది నవహేళన మొనర్చెను. ఆమె పాండవుల వైపు చూచుచున్నది. ద్రౌపదికి చైతన్యమేలేనట్లున్నది. ఆ సమయమున దుశ్శాసనుఁ డామెను మాటిమాటికి "దాసి దాసి" యని యవహేళన మొనర్చెను.

కులస్త్రీ శరీరముపైఁ జేయివైచి సభ కీడ్చికొని వచ్చినాఁడు. ఇట్టి కార్యమునుఁ జేయఁబూనిన దుశ్శాసనుఁడు యికనే పాపమును ప్రపంచమునఁ జేయ వెనుకాడును? వాఁడే కార్యమునకును జంకఁడు. పాపము నొనర్చుటలో దుశ్శాసనునకుఁ గల యప్రతిహతమగు నీ పాండిత్యమునుఁ గర్ణుఁ డెఱుఁగును. అందులకే ద్రౌపది వస్త్రము లొలువవలెనని దుశ్శాసనున కాజ్ఞ వచ్చినది. ఈ ఘన కార్యము నొనర్చుటకు వాఁ డేమాత్రమును జంకలేదు. వెంటనే నిండు సభలో నామె వస్త్రము లొలువ నారంభించినాఁడు. పాండవులు దాస్యము నుండి ముక్తులైరి. ఇది దుర్యోధనునకు సమ్మతిగా లేదు. వాఁడు రెండవసారి దప్రయత్నము నొనర్చెను. ఈసారి యొడ్డిన పణము వనవాసము. ధాప్రకారము పాండవు లోడిరి. వారరణ్యములకుఁ బ్రయాణమైనారు. ఆ ందర్భమునఁ గూడ దుశ్శాసనుఁడు ద్రౌపది నవమానించినాఁడు. అసందర్భప్రలాపము ాడినాఁడు. ఇట్టి చేష్టలు వాని నీచత్వమునకు గుఱుతు. వనవాస గమనోన్ముఖియైన ద్రౌపదిని జూచి దుశ్శాసనుఁ డన్న మాట లివి.

"మహాప్రాజ్ఞః సౌమకి ర్యజ్ఞ సేనః కన్యాం పాంచాలీం పాండవేభ్యః ప్రదాయ
మధ్యే కురుణాం ధర్మనిబద్ధమార్గం గౌర్గౌరితి స్మా zzహ్వాయన్ ముక్తలజ్జః
(భా. సభా. అ. 77)

"పాంచాలరాజైన ద్రుపదుఁడు చతురుఁడే. కాని, వాఁ డొనర్చిన బుద్ధిలేనిపని యొకటి గలదు. నిర్ధనులైన పాండవులకు ద్రౌపది నొసఁగుట యజ్ఞ సేనుఁ డొనర్చిన గొప్ప యలౌకికము. ద్రౌపదీ! నీవు పాండవులతో నేమి సుఖ మనుభవింతువు. వారిని నీవు వదలివేయుము. వేఱు పతిని గోరికొమ్ము." ఈ మాట లనుచు దుశ్శాసనుఁడు కౌరవుల యెదుట "గోవులు గోవుల"ని యఱచుచు భీముని ముందట నాట్యమాడ నారంభించెను. భీమునివాఁడు చెనకుట సర్పమును ద్రొక్కుట వంటిది. ఉగ్రమైన దాని ఫలమును వాఁ డనుభవించి తీరెను. దుశ్శాసనుఁడు కర్ణుని బలమును నమ్మినాఁడు. వాఁ డుండగాఁ దన్నెవరును నేమియుఁ జేయలేరని వాని విశ్వాసము. దీని ఫల మేమైనది! కర్ణుని యెదుటనే భీముఁడు దుశ్శాసనుని ఱొమ్మునుఁ జీల్చెను. ఏచేతులతోవాఁడు ద్రౌపదీకేశములనుఁ బట్టెనో యా హస్తములను భీముఁడు ఖండించెను. వానిని భీముఁడు చిత్రచిత్రముగ వధించినాఁడు. వానినిఁ జంపి గూడ భీమునకుఁ దృప్తిగాలేదు. ఏ కంఠముతో వాఁడు ద్రౌపదిని 'దాసిదాసి' యని పిలచి మాటిమాటికి గేలి యొనర్చెనో యాకంఠనాళమును భీముఁడు చీల్చెను. అందుండి బుడబుడమని వెడలు వేడి రక్తము నాతఁడు పానమొనర్చెను. అంతవఱకును వాని రోష మాగినది గాదు. దుశ్శాసనుఁడు దుర్యోధనునకు నీడ యంటిమి. ఏ యకార్యము నొనర్చుటకును దుస్ససేనుఁడు జంకలేదు. ఔద్ధత్యము, హృదయ నైచ్యము, వాని యాకారము. వీఁడు దుర్యోధనుని సచివులలో నొకఁడు. ఈమంత్రులలో నింకొక్క డున్నాఁడు. వాఁడు శకుని. దుశ్శాసనునికంటెను శకుని ప్రమాదకరమైనవాఁడు. దుశ్శాసనుఁడు దుష్టుఁడు మాత్రమే! శకుని మహామర్మి. వాని హృదయపు లోతుల నెఱుఁగుటకు దేవాదులకు సాధ్యముగాదు. జరిగిన దుర్మార్గము లన్నిటను శకుని యున్నాఁడు. ప్రతిదాని యందును వాని సమ్మతి గలదు. కాని దనకేమియు సంబంధములేనట్లు వాఁడుండును. వాని యీ మెలకువ యసామాన్యము. ధృతరాష్ట్రుఁడు గూఢమైన

చిత్తవృత్తి గలవాఁ డంటిమి. కాని శకుని ముందు ధృతరాష్ట్రుని కాపట్యము దిగదుడుపునకైననుఁ బనికిరాదు. దుర్యోధనుని జూదమునకుఁ బ్రేరేచినవాఁడు శకుని. కాని యా వృత్తాంతము యెవ్వరికినిఁ దెలియదు. దుర్యోధనుఁడే జూదమునుఁ గోరెనని యందఱి భ్రమ. శకుని ప్రతి విషయమున నట్లే ప్రవర్తించును. వాఁడు దుర్యోధనునిఁ గూడ బరీక్షించును. ఒక యభిప్రాయముపై దుర్యోధనుఁ డెంత గట్టిగా నున్నాఁడో తనకు మొదటఁ దెలియవలెను. తెలిసిన తరువాతనే శకుని దన యభిప్రాయము నొసఁగును. దుర్యోధనుఁ డడిగిన శకుని దన యభిప్రాయమునుఁ దెలుపలేడు. పాండవులపై దుర్యోధనునకుఁ గోప మెంత గలదో తేల్చి చూచికొన్నాఁడు. దుర్యోధనుని మనస్సునిండ నదియే యున్నది. ఇఁక పరవాలేదనుకున్నాఁడు. అటుతరువాతనే జూదమాడుదమని సలహా యొసఁగెను. శకుని కందరి హృదయములనుఁ దెలియును. వాని మనస్సును గ్రహించినవాఁడు మాత్రము కౌరవులలో నొక్కఁడును లేడు. వాఁ డంతటి మర్మి.

## గాంధారరాజు శకుని

శకుని గాంధారమునకు రాజైనను జాలవఱకు దుర్యోధనుని కడనే యుండుచుండెను. గాంధారియు శకునియు నొకటే వంశమున జన్మించిరి. కుని గాంధారికిఁ దమ్ముఁడు. కాని గాంధారి గుణములు మానవజాతికే యలంకారములు. శకుని కాపట్యముల గూడు. గాంధారి జీవితము సుధామయఫలము. శకుని బ్రదుకు విషఫలము. వీఁడు జూదమాడుటలో గొప్ప నేర్పరి. భావగోపనమున వీనికి సరియైన వాఁడెవ్వఁడును లేఁడు. వీని రహస్యము దుర్యోధనునకునుఁ దెలియదు. సుయోధనుని హృదయమందున్న విషయములనన్నిటినిఁ దొలుత బయటికి రాబట్టికొనియే పిదప యేమైనను శకుని మాటాడును. సుయోధనుఁడు పాండవుల రాజసూయమునకుఁ బోయివచ్చెను. పాండవులపై వాని మాత్సర్యము

మితిమీఱినది. తన గోడునంతయు వాఁడు మామతోఁ జెప్పికొనెను. వెంటనే శకుని యేమియు బదులివ్వలేదు. వాఁడు దుర్యోధనుని చిత్తవృత్తిని గమనించుచుండెను. దుర్యోధనుని హృదయపు పోకడ యెట్లున్నది? విక్రమ ప్రదర్శనముననే పాండవులను మట్టువెట్టఁ దలఁచుచున్నాఁడా! లేక యేమార్గముననైనను వారి గర్వమును నాశనమొనర్పఁ జూచుచున్నాఁడా? ఈ విషయమును స్పష్టముగఁ దెల్పికొనవలెనని శకుని యూహ. తాను త్వరపడి "జూదమాడి పాండవులను జయింత" మని చెప్పినచో నా విషయము దుర్యోధనునకు నచ్చునో నచ్చదో? అప్పుడు వాఁడు తన యుదాత్తతనే యాశంకించినచో? ఈ సందేహములతో శకుని దుర్యోధనునే పరీక్షించుటకుఁ దివిరినాఁడు. మామ సుయోధనునితో నిట్లనెను.

"దుర్యోధన! న తే஽మర్షః కార్యః ప్రతియుధిష్ఠిరం.

......... ......... .........

......... ......... .........

ఏతై స్త్వవం సహిత స్సర్వైః జయ! కృత్స్నాం వసుంధరాం

(భా. సభా. అ. 48)

"దుర్యోధనా! నీవు ధర్మజునిపై మాత్సర్యమునుఁ గొనుట నాకంత బాగుగలేదు. పాండవులు దమ యదృష్టసంపాదితమైన రాజ్య మనుభవించుచున్నారు. నీవింతవఱకును వారిని నాశనమొనర్చుటకై యెన్నియో యుపాయము లల్లితివి. కాని యవి యన్నియు వారియెడ వమ్మైనవి. దీనికిఁ గారణము వారి యదృష్టమే. పాండవులకు ద్రౌపదివంటి భార్య లభించినది. బంధుసంఖ్య పెరిగెను. కృష్ణునివంటి క్షేమచింతకుఁడు లభించినాఁడు. వారికి రాజ్యము సహజముగనే రావలసియుండెను వచ్చినది. అర్జునున కగ్ని ప్రసన్నుఁడైనాఁడు. అతని దయతోఁ గవ్వడికి దివ్యాస్త్రములు లభించెను. గాండీవమువంటి ధనువు దొఱకినది. దాని బలమున నాతఁడు దిక్కులను జయించెను. మయుఁడు పాండవులకుఁ గట్టుబడి పోయినాఁడు.

వా రాతనికిఁ జేసిన యుపకార మట్టిది! అతఁడు గౌంతేయులకు మహాసభ నిర్మించి యిచ్చెను. ఈ రీతి నదృష్టవశమునను, స్వపరాక్రమమునను, నానాటికి వైభవశిఖరము లధిరోహించి పోవుచున్న పాండవులపై నీ వసూయఁ గొన్నచో నేమిలాభము? వా రదృష్టవంతులు. నీకుమాత్ర మేమి దక్కువైనది గనుక? సహాయసంపత్తి లేదా? నీ తమ్ములే బోలె డంతమంది! వారిలోఁ నెవ్వఁడును సామాన్యుఁడుగాఁడు. నీకు బాసటగ నున్న యశ్వత్థామ, ద్రోణుఁడు, కృపుఁడు, కర్ణుఁడు వీరిలో నెవ్వరు దక్కువ వారు? నేను గూడ నీకుఁ దోడ్పడుటకు సిద్ధముగనే యున్నాను. కనుక నిరంతరము వారిపై మాత్సర్యమునుఁ బెంచికొనుచు నీవును బాధపడి మమ్ము గూడ బాధింపక ప్రయత్నశీలుఁడవగుము! కర్మరుఁడవై విజయమును సాధింపుము."

శకుని యన్న యీ మాటలు పై కెంతో బాగుగ నున్నవి. దుర్యోధనునకు సద్బుద్ధిని నేర్పినట్లే యున్నవి. కాని - వీని వెనుక నొక గొప్ప కృత్రిమభావము నోరు దెఱచికొని యున్నది. నీతిఁజెప్పు మిషతో శకుని పాండవుల వైభవముల నన్నిటిని మఱల నొకసారి వరుసగా దుర్యోధనునకు జ్ఞాపక మెలయించి, మండుచున్న యగ్నిపై నూనెనుఁ జల్లెను. శకుని యీ మాట యన్నంతనే దుర్యోధనుఁ డిట్లు వచించెను. "మామా! నీవన్నట్లు నాకు సహాయ సంపత్తి యున్నది. కాని మఱల నేను భూమినంతయు జయింపఁబూనుటవ్యర్థప్రయత్నముగదా! ఈ యున్న రాజుల నందఱిని బాండవులు జయించిరి. కనుక యుధిష్ఠిరాదులను జయించినచో క్షత్రియుల నందఱను జయించినట్లే! సులభముగఁ బని దీరిపోవును."

ఈ మాటలకు శకుని గొంత తడవు మిన్నకుండెను. దుర్యోధనుని యభిప్రాయమును దా నంగీకరించితిననుట కది సూచన. పిదప శకుని తిన్నఁగా నారంభించినాఁడు. అతఁ డిట్లనెను.

"ధనంజయో వాసుదేవో భీమసేనో యుధిష్ఠిరః
యుధిష్ఠిరం స్వయం రాజన్ తన్నిబోధ ద్యుషస్వచ॥

దుర్యోధనా! ధనంజయుఁడు విశంకట పరాక్రముఁడు. భీముఁడు కాలరూపుఁడు. కవలలును, యుధిష్ఠిరుఁడును సామాన్యులు గారు. వాసుదేవుఁడు వారికి రక్ష. కుమారులతోఁ గూడికొన్న ద్రుపదుఁడు అవక్రపరాక్రముఁడు. వీరిని జయించుటకు దేవతలకుసాధ్యముగాదు. వీరందరును మహారథులు మహేష్వాసులు. కృతాస్త్రులు, యుద్ధ దుర్మదులు, వీరిని జయించుట యసాధ్యము. కాని యుధిష్ఠిరుని జయించుట కుపాయము నాకుఁ దోచుచున్నది. నీ వందుకు సమ్మతించినచో వచింతును." దానిపై దుర్యోధనుఁ డన్నాఁడు. "మామా! నా మిత్రమండలికి నా వైపున్న వీరులకు వినాశము గలుగకున్న యుపాయ మేమున్నను వచింపుము. సంతోషముగ విందును." దానిపై శకుని యిట్లు ప్రతివచించెను. "సుయోధనా! యుధిష్ఠిరునకు జూదమన్న ప్రాణము, కాని యా విద్యయం దాతనికి పాటవము లేదు. జూదమునకుఁ బిలిచినఁ జాలును. రెక్కలు గట్టికొని యాతఁడు వచ్చును. జూదమున నాతో సమానుఁడు లేడు. నన్ను గెలుచుట కెవ్వరికిని సాధ్యముగాదు. ఆ విద్యయందు నేనెఱిఁగిన రహస్యములు త్రిలోకములలో నెవ్వరు నెఱుఁగరు. నీ వా యుధిష్ఠిరు నాహ్వానింపుము. నీకు వారి నుండి సర్వమును నేను గెలిచి యిత్తును. జూదమాడుటకు మీ తండ్రి సమ్మతింపఁడు. ఇందుకై ధృతరాష్ట్రు నీ వర్థింపుము. నేను తప్పక గెలుతును. సందేహింపకుము!"

శకునిమాట లెంత సమర్థములుగ నున్నవి! ఎంత చతురముగ దుర్యోధనునితో సంభాషించినాఁడు? ఇంతమాత్రమే గాదు. అడుగడుగునను వాఁడు దుర్యోధనుని చిత్తవృత్తినిఁ బరీక్షించియే తన సమ్మతి నొసఁగుచుఁ

బోయినాఁడు. జరిగిన ప్రతికార్యమును దుర్యోధనుఁడే చేయించినట్లు నాటక మాడినాఁడు. కాని ప్రతి పనికిని ప్రేరకుఁడు వీఁడే! నిండు సభలో దుశ్శాసనుఁడు ద్రౌపది నవమానించినప్పుడు శకుని యెంతయో సంతోషించినాఁడు. వాఁడు దుశ్శాసనుని సమర్థతనుఁ బ్రశంసించినాఁడు గూడ.

శకునిది విచిత్రమైన ప్రకృతి. వాఁడు దుర్యోధనుని రాజ సత్తనంతయుఁ దన గుప్పిటిలోఁ బెట్టికొనెను. సుయోధనుని పరిపాలనమునకు సూత్రచాలకుఁడు వాఁడే! దుర్యోధనునకుఁ బ్రాప్తించిన ప్రతి లాభమునుఁ దన నుండియే కలిగినదని కురురాజునకు బోధపడునట్లు శకుని వర్తించెను. వీఁ డొక కృత్రిముఁడైన సచివుఁడు. వీని పద్ధతి యొక విశిష్టమైనది. పాండవులు ఘోషయాత్రలో దుర్యోధనునకు జీవదాన మొనర్చిరి. అందుకై వారి యెడ దుర్యోధనుని మనస్సునఁ గృతజ్ఞతాభావ మంకురించినదేమో! దీని వాసన గనిపెట్టవలెను. దానికి మార్గము? మరల నొకసారి శకుని నీతిబోధ యారంభించినాఁడు. పాండవులతోఁ జేరి బ్రదుకుట సుఖకరమని వాని యుపదేశము. ఆ మాటలివి.

యత్ర హర్ష స్త్వయా కార్యః సత్కర్తవ్యాశ్చ పాండవాః

..... ..... .......

పిత్ర్యం రాజ్యం ప్రయ చ్ఛైషాం, తత స్సుఖ మవాప్స్యసి

(భా. వన. ప. అ. 251)

"సుయోధనా! పాండవులను సత్కరింపవలసిన సమయమున నీవు దుఃఖించుచున్నావు. ఇది యెంత విపరీతము? నీకు వారు జీవదాన మొనర్చిరి. దానికి సంతసింపుము. వారి రాజ్యము వారి కిమ్ము! వారు నీకొక గొప్ప యుపకార మొనర్చిరి. దానికిఁ గృతజ్ఞుఁడవై వారి పిత్ర్యంశమును వారి కొసఁగినచో నీకీర్తి పెరుగును." ఇట్లుశకుని పల్కుట ధర్మముపైఁ గల యపేక్షతోఁ గాదు.

దుర్యోధనుని హృదయమును పూర్తిగఁ బయటికి లాగుటకు కురురాజా. మానసమున నేదైన నొక సద్వాసన యంటుకొన్నదేమో? అంటుకొని యున్నచో నిఁకఁ దన సలహా లేమి పనికి వచ్చును? వాఁడంతటి సమర్థుఁడైన కితవుఁడు. ఎదుటివారి జీవితములతో శకుని జూదమాఁడును. వారి మనస్సుల నంచనావేయుట వాని కొక క్రీడ. నిజముఁ జూచినచో దుర్యోధనుని ఘోషయాత్రకుఁ బ్రేరేచినవాఁడు వాఁడే. ఆ ప్రేరేపణలో నమితమైన క్షుద్రత యున్నది. ఆప్రకరణ మిది.

"ధృతరాష్ట్రస్య తద్వాక్యం నిశమ్య శకుని స్తదా

..... ...... .....

..... ...... ......

వైమనస్యం యథా దృష్ట్వా తవ భార్యాః స్వలంకృతాః

(భా. వన. అ. 237)

"ధృతారాష్ట్రుని వాక్యములు విని కర్ణసహితుఁడైన శకుని దుర్యోధనునితో నిట్లనెను. "నేడు పాండవులు ధనహీనులైనారు. వనముల నిడుమలఁ గుడుచుచున్నారు. వారు కష్టములపాలై నలఁగుచున్నప్పుడు మనము వారినిఁ జూచి పరిహసించుటలో నొక గొప్పతనమే గలదు. కనుక వా రున్నయెడకు బోవుదుము. నీ విప్పుడు రాజ్యాధిపతివి. వారా! రాజ్యభ్రష్టులు. నీవు వైభవ సంపన్నుఁడవు. వారు ధనహీనులు. నీ కోర్కెలన్నియు బూరించికొనుటకు నీ కవకాశము లున్నవి. వారు భగ్నమనోరథులు. ఇట్టి స్థితిలో నీవు వారినిఁ జూచుట మాకెంతయో యానందకరముగ నుండును. ఉత్తమ వస్త్రాభరణాదులు ధరించిన నీ యంతఃపురము కూడు గుడ్డలకు నోచికొనని ద్రౌపదిని విలోకించును గాక! వీరినిఁ జూచి తన యభాగ్యతకై ద్రౌపదిని తన్నుఁ దాను నిందించికొనును. ఆ నిమేషము మన యానందశిఖరము. అప్పటి యా ద్రౌపది మొగమును మనము చూచి తీరవలెను. సభలో మనము యాజ్ఞసేని నవమానించితిమి.

కాని వస్త్రభూషణాలంకృతలైన నీ భార్యలనుఁ జూచినప్పుడు ద్రౌపది ముఖముపై గలుగు నా మార్పులను విలోకించుట సభలో ద్రౌపది నవమానించుట కంటెను గొప్ప సిద్ధి!"

ఇంత క్షుద్రమైనది శకునిచిత్తవృత్తి! ఇట్టివాఁడు దుర్యోధనునకు మార్గ దర్శకుఁడు, ఆచార్యుఁడు. దుర్యోధనుని కాలమున సచివసంస్థ విభ్రష్టమై పోయెననుట కింతకన్నను వే రుదాహరణ మేమి గావలెను? ధృతరాష్ట్రుని నుండి యింతవఱకును వర్ణించికొనుచు వచ్చిన వ్యక్తి చిత్రములఁ బట్టి భారతకాలమున రాజ్య సంస్థయు సచివసంస్థయు, నెంత పతితములై యుండెనో స్పష్టముగఁ దెలియును. ధృతరాష్ట్రుని రాజ్యమున నెందఱో ధర్మనిష్ఠులుండిరి. వారు సమర్థులు గూడ! వారెందుకీ పరిస్థితి నరికట్ట లేదు! ఈ పరిస్థితులు వారి చేతులను గూడ మించిపోయెను? ఒకరీతిగ నంతేనేమో! ధృతరాష్ట్రుడు ...డ్డితన మనునది వాఁడు వేసికొన్న ముసుఁగు మాత్రమే. దుర్యోధనుఁడు ...ష్టుఁడు. నిర్భయుడు. వాఁడు గౌంతేయులతో గడవఱకును వైరమును ...ధించెను. పాండవుల గట్టితనము వానికిఁ దెలియదు. ఇఁక భీష్మద్రోణాదులకు దుర్యోధనుని యే చెయిదమును నిష్టము లేదు. వారు మొదటి నుండియు కౌరవుల ప్రయత్నములకు విరోధులు. శకుని దుశ్శాసనులకు దుర్యోధనుఁడే యేడుగడ. వాఁ డేమన్న నా మాటయే వారందురు. కాని విక్రమమునఁ బాండవులతో వారు సాటిరారు. ఇట్టి స్థితిలో దుర్యోధనుఁ డెవ్వరిని నమ్మి పాండవులతో వైరమును సాధించినాఁడు? శకుని దుశ్శాసనుల కింతటి పట్టుదల యెట్లు ...చ్చెను? భారత యుద్ధమన్న సామాన్యము గాదు. చారిత్రక కాలమున నంతటి సంగ్రామము మఱియొకటి జరుగలేదు. పదునెనిమిది దినములలో కొలఁది వీరులు గతించుటలన్న యాటలా? పదునెన్మిది దినములలోనే ...రతయుద్ధము ముగియుట యొకరీతిగ క్షేమకరమే కావచ్చును. పతితమైన రాజ్యసంస్థ శీఘ్రముగనే నశించిపోయినది. కాని దుర్యోధనాదు లింతటి

యాసురికమైన తాండవ మాడుటకు వారికి గుండె లెక్కడివి? వారికి వెన్నుబల మెవ్వఁడు? అతఁడే మహారథుఁడైన కర్ణుఁడు!!!

## మహారథుఁడు కర్ణుఁడు

భారతేతిహాసమునందుఁ గర్ణుఁడు నిర్వహించినపాత్ర యనన్య సామాన్యమైనది. భారతయుద్ధమునకు మూలపురుషులు గొందఱే! వారిలో శ్రీకృష్ణుఁ డొక్కఁడు. అతఁడే ముఖ్యుఁడనియుఁ జెప్పవచ్చును. పూర్ణావతారుఁడైన శ్రీకృష్ణుని యుద్ధము నెఱవేఱుటకే భారతయుద్ధ మేర్పడినది. వాసుదేవుని తరువాత నెన్నదగిన యగ్రనాయకులలోఁ గర్ణుఁడే మొదటివాడు. కౌరవులు గౌంతేయుల పైకి గాలుద్రవ్వుట కాతని వ్యక్తిత్వము ప్రబలమైన కారణము. "కర్ణ నాదలనె భారతసంహిత" నిల్చినదను నానుడి ప్రజాసామాన్యము నందునుఁ బ్రాకిపోయినది. భారతయుద్ధ మనగానేమి? అది యొకగృహకలహమే. పెరిగి పెరిగి యా కలహము భారతదేశమున కంతయు వ్యాపించినది. ఒక వంశము నందలి దాయాదులకుఁ బరస్పర మేర్పడిన రవరవలతో నీ సన్నివేశ మారంభమైనను నాటి ప్రఖ్యాత రాజ వంశము లన్నియు నీ మహాసంగ్రామమునఁ దగుల్కొనెను; ప్రాణములఁ ద్యజించెను. పదునెనిమిది దినములలో సుమారు నలువది లక్షలమంది మహావీరులు మరణించిరి. నేఁడు ప్రచారమున నున్న యుద్ధపద్ధతులతో బోల్చినను యుద్ధములలో నేఁడు జరుగుమారణహోమములను గమనించినను భారతయుద్ధ పద్ధతి మన మంతగా నాశ్చర్యపడవలసినది గాకపోవచ్చును. అనాడు జరిగిన కథలు గూడ నంత గొప్పవి గాకపొవచ్చును. కాని యా యుద్ధ మొక రాష్ట్రమునకు, నొకవంశమునకుఁ జెందినదన్న విషయము మరువరానిది. దానిని జ్ఞాపకముంచికొన్నచో నా మహాసంగ్రామము యొక్క విశ్వరూప మెంతటిదో మనకర్థమగును. పదునెనిమిది దినముల లోపల నలువది లక్షలమంది మరణము! భారతయుద్ధములో ననేక రాజవంశములు నారులేకుండ బోయినవి. సంపన్నములైన క్షత్రియుల కుటుంబములు

చాలమట్టుకు ధ్వస్తములైనవి. భారతదేశమునందు నాటి క్షత్రియ కుటుంబములలో మగపురుగే కరవై పోయినది. భారతయుద్ధము యొక్క యీ భయంకర పరిణామము నాటి సామాజిక జీవితమునే తల్లక్రిందు లొనర్చినది. ఈ ప్రళయము నాపుట కెందఱో యత్నించిరి. గురుభీష్మాదులు సంఘటితులై యీ క్షత్రసంహారమును నిల్పుటకుఁ దహతహ లాడిరి. కాని లాభము లేకపోయినది. ఆ మహాయుద్ధము జరగియే తీరెను. ఆ జరగుటకుఁ బ్రధానచోదకుఁడు రథికోత్తముఁడైన కర్ణుఁడు. మహాపురుషుఁడైన కర్ణుని వైయక్తిక ప్రభావము ముందు భీష్మాదుల మాటలన్నియు దూదిపింజలవలె నెగిరి పోయినవి. భారతయుద్ధమున కనేకు లనేక కారణములు సెప్పెదరు. అనేక వ్యక్తులను బాధ్యులనుగా నిరూపింతురు. ఇవన్నియు నొకయెత్తు కలిపురుషుని యంశభూతుడైన స్వార్థాంధుఁడైన దుర్యోధనునకును మహారథుడైన కర్ణునకును నడుమ గుదిరిన మైత్రి యొక యెత్తు. భారతయుద్ధ శ్రీకారమున కిదియే ప్రధానకారణ మనవచ్చును. కర్ణుఁడు కౌరవపక్షము నవలంబింపకున్నచో శకుని కాపట్యము, ధృతరాష్ట్రుని కౌటిల్యము, దుశ్శాసనుని యధమత్వము, దుర్యోధనుని హృదయనైచ్యము యివి యెన్ని యున్నను సంగ్రామపర్యంత మివి పెరిగియుండెడివి గావు. వానికిఁ బ్రధానమైన ప్రేరకశక్తి లేదు గనుక దుర్యోధనుని యాశలన్నియు పగటికలలే యై యుండెడివి. ఒకవేళ యుద్ధము జరగియున్నను దానికింత ప్రశస్తి వచ్చెడిది గాదు. అది గృహకలహముగనే యంతరించి యుండును. ఆ గృహకలహమునకీ విశ్వరూప మొసఁగినది కర్ణుని వ్యక్తిత్వమే. ఈ దృష్టితోఁ జూచినప్పుడు భారతము నందలి కర్ణుని పాత్ర యెంతయో మహత్తుగలది. కర్ణుని గూర్చి యనేకుల కనేకాభిప్రాయము లున్నవి. ఆతనిమృతి యత్యంతకరుణాత్మకమైనది. ...రికైన నా చావు యన్యాయ మనిపించి తీరును. భారతముఁ జదువువాఁడెవ్వడే ...వి యీ ఘట్టమును మఱచిపోలేఁడు. మరణవిషయమున నాతనికి జరగిన యన్యాయమునుబట్టి యాతనిపై గొప్ప సానుభూతి గల్గి తీరును. ఇది నిశ్చయము.

కొందఱు విమర్శకుల దృష్టిలోఁ గర్ణుఁడు సద్గుణముల ప్రోవు. మఱి కొందఱకు నేరుగా విరుద్ధము. రాధేయుని దుర్గుణములకుఁ బ్రతీకముగ నెంతురు. నాటి సమాజము కర్ణున కన్యాయమొనర్చెను. అతఁడందు కెదురు తిరిగెను. సమాజమొనర్చు నన్యాయముల నరికట్టెను. కొందరు విమర్శకు లీ దృష్టితోఁ గర్ణునిఁ జూచి యాతని ప్రతికార్యమునకును మహత్వము నాపాదింతురు. కొందరాతనిలో సద్గుణలేశమునుఁ గూడ నంగీకరింపరు. వారికి సంప్రదాయమే కొలతబద్ద. పాండవులు వారి దృష్టిలోఁ గళంకలేశము లేని ధర్మాత్ములు. 'కర్ణుఁడు పాండవులకు విరోధి. అందుచే వీనిలో గుణలేశము గూడ నుండదు.' ఇది వారి సిద్ధాంతము. కొందఱిట్లందురు: కర్ణుఁడు కవ్వడికంటెను యుద్ధ కుశలుఁడు. అతఁడెన్నియో దివ్యాయుధములను సంపాదించెను. కృష్ణుడు బాసటగ నున్నందుననే ఫల్గునుఁడు గర్ణుని గెలిచెను. పార్థుఁడు రాధేయుని గెలుచుటలో ముఖ్యసాధకము కృష్ణుని కాపట్యమే. పాండవులు సత్పురుషులే గావచ్చును. కాని కర్ణవధకు సంబంధించినంతవఱకు వారన్యాయమునే యొనర్చిరి. ఈ రీతి గర్ణునిపై ననేక భావములు; ఖండనమండనములు. కృష్ణుని తర్వాత మహాభారతమున నింతటి విమర్శకుఁ బాత్రుడైన వ్యక్తి మఱియొక్కఁడు లేడేమో? కాని యింత గందరగోళము సేయుచున్న యీ విమర్శకు లందఱును, మహాభారతకర్త కర్ణుని విషయమై యే యభిప్రాయమును మనస్సులో నుంచికొన్నాఁడో దానిని సరిగ గమనించి గౌరవింప లేదేమో? యని నాయనుమానము. కర్ణుని చిత్రమున కాతఁడొసగిన ప్రత్యేకత యేది? ఏ దృష్టితో నాతఁడు గర్ణుని సృష్టించి ప్రోది యొనర్చెను? యను విషయములను గమనించి యా దృష్టితో గర్ణుని విమర్శించుట సమంజసముగ నుండును గదా! భారతమునుఁ బట్టి చూచినచో నొక వ్యక్తియొక్క గొప్ప తనమును గాని, తక్కువతనముగాని యాతని వ్యక్తిగతములైన మంచి చెడుగుణములపైననే యాధారపడినట్లు గానరాదు. ఎవని జీవితముచే మానవులకు హితము సేకూరునో

శాశ్వతములైన నీతిమూల్యములు సంరక్షింపఁబడునో యదియే గొప్ప జీవితము. అందుకు విరుద్ధమైన బ్రదుకు వైయక్తికముగ నది యెంత గొప్ప దైనను దాని కంత వెలలేదు. ఇదియే వ్యాసుని యభిప్రాయమైనట్లున్నది. మహాపురుషుల యొక్క లోకోత్తరత్వము మానవజాతికిఁ గల్యాణకరము గావలెను. అట్లైనప్పుడే దానికి వెల. కాని, యతిమానుషమైన యాశక్తియే వైయక్తికమైన మహత్వాకాంక్షకు, స్వార్థమునకు, నంగమైనచో నది భయంకరపరిణామమునకు దారితీయును. మానవులకు కల్యాణమును గలిగించుటకుమారు, జాతినే ధ్వంస మొనర్చును. ఈ పరిణామమునకు. ప్రతీకమే కర్ణుఁడు. వ్యాసుల చిత్రణమును బట్టి యా జీవితమునకు వ్యాఖ్యాన మింతే. కర్ణుఁడు భారతసంగ్రామరూపమైన ప్రళయమునకు సూత్రధారియైనాఁడు. కర్ణుని యీ మనస్తత్వమును వ్యాసుఁడెంతయో సమర్థతతో నిర్వహించెను. ఆ రూపకల్పనములో నస్వాభావికత లేదు, ఆశ్చర్యమును గలిగించు సన్నివేశములు లేవు. కర్ణుఁడొక మానవుఁడు. మానవుఁడై దేవత్వము నందికొనదలచి శ్రమపడి సాధ్యముగాక యొక మహాప్రమథుఁడై పోయినాఁడు. వ్యాసులప్రతిభ కర్ణుని యీ మానసిక ప్రవృత్తులనెంతయో సమర్థతతో నిరూపించెను. కర్ణుని జీవితము, అది దుర్దైవ మాడిన యొక క్రీడ. "ఇది యిట్లు జరుగకున్న బాగుండెడిది," యని యొకసారి నిట్టూర్చుట దప్ప మానవులమైన మన మిందులో నేమియుఁ జేయలేము. కర్ణుఁడు, కర్ణునివంటి గొందఱు మహాపురుషులు దమలోని స్వార్థమునకు ..లియైపోయిరి. భారతదేశ చరిత్రలోగూడ నట్టివారు గొందఱు గలరు. వారెందు ..? అంతటి గొప్ప వారు దమలోనున్న యీ చాపల్యమును గుర్తింపలేదా? ఈ ..కుత్తరముఁ జెప్పుట మహాకష్టము. కష్టమేమి? యశక్యముగూడ! కర్ణునివంటి వ్యక్తులు ఆ యంతటి హృదయచాపల్యము నణచికొని యున్నచో, వారెంతయో మహానుభావులై యుందురు. యుగపురుషులై యుందురు. కృష్ణునివంటి పూర్ణావతారులని మనము వారిని బూజించియుందుము. కాని యట్లు జరుగలేదు.

జరుగుట దైవనిర్దేశము గాదేమో! అవతారపురుషులనేక శతాబ్దముల కరుదుగా బుట్టుదురు. కర్ణునివంటివారు దఱచుగా జన్మించి పోవుచుందురు. 'బహురత్నా వసుంధరా," యని గదా యార్యోక్తి! వ్యాసునకు గర్ణునిలో నున్న సద్గుణములు దెలియును. వాని దుర్గుణములును దెలియును. స్వార్థమునకు బలియైనవాని లోకోత్తరత్వము పాకమునకు రాలేదు. వాఁడుసద్గుణము లుండియు లేనివాఁడే యైనాఁడు. అందుకే వ్యాసులు, గర్ణుని దుర్యోధనుఁడనెడు క్రోధవృక్షమునకు స్కంధమువంటివా'డనెను, రాధేయునిలో నున్న ప్రధాన దుర్గుణములు మూఁడు. అహంకారము, హద్దులేని మహత్త్వాకాంక్ష, అన్నిటికిమించి 'తాను' 'తన' కనెడు భావము ఈ దోషములు కర్ణుని జీవితమున నెట్లేర్పడినవి? వీనితో నాటి నీతిమూల్యములకు, రాష్ట్రీయవచనమునకు మానవహితమునకు భంగ్గ మెట్లు కలిగినది? కడకు వీని పర్యవసానము కర్ణుని జీవితమున నాటి సామాజికజీవనమున నెట్లు ప్రతిఫలించినది? ఈ విషయములను వ్యాసుని ప్రతిభాదీపసహాయముతోఁ .జూచుట మంచిది, 'తాను' 'తనక'ను భావము గర్ణునిలో మిక్కిలిగఁ బెరిగిపోవుటకుఁ గారణమానాఁడు జరగిన యొక దుర్ఘటన. అది యాతనిపుట్టుకకు సంబంధించినది. అది యనివార్యముగ వచ్చిపడినదే. 'తాన' నెడు భావము పెరిగి పెరిగి యాతనిలోఁ బ్రచండమైన యహంకారమునకు దారి దీసినది. ఆ యహంకారమునుండి, దుర్దమ్యమైన మహత్త్వాకాంక్ష బయలుదేరినది. ఈ మూడింటి సమ్మేళనముతో రెండవ సూర్యుఁడుగ వెలుఁగఁదగిన కర్ణుని జీవితము యొక ధూమకేతువైనది. ప్రజారక్షకుఁడై శాశ్వతకీర్తి నందవలసిన కర్ణుఁడు మహాకాలస్వరూపుఁడైనాఁడు.

## అనివార్యమైన సామాజిక ఘటన, గొప్ప దురదృష్టము

కర్ణుఁడు పాండవులవలెనే దేవసంభవుఁడు. లోకచక్షువైన సూర్యుఁడాతనికి జన్మ నొసఁగిన మహనీయుఁడు. అతఁడు పాండవుల వలెనే కౌంతేయుఁడు. అనఁగా కుంతీగర్భవాసమున జన్మించిన వాఁడు. కాని లాభమేమి? అతఁడు

నాటి కులీనులైన క్షత్రియుల కందఱకును బరిహాసపాత్రుఁడయ్యెను. అది వాని గొప్ప దురదృష్టము. కౌంతేయులు పాండవులు. అనఁగాఁ గౌరవేశ్వరుఁడైన పాండురాజునకు జన్మించిరని లోకప్రతీతి. అట్లే కర్ణుఁడునుఁ బాండవేయుఁడు. ధర్మజుఁడు యమధర్మరాజునకుఁ బుత్రుఁడు .భీముఁడు వాయుసంజనితుఁడు.అర్జునుఁడు దేవేంద్రుని వరము. నకులసహదేవు లశ్వినీదేవతల కృప. అట్లే కర్ణుండునుఁ ద్రయీమూర్తియైన సూర్యభగవానుని కృపావిశేషముగ గుంతీదేవికిఁ దక్కినాఁడు గదా! యుధిష్ఠిరుఁడు పాండవులలోఁ బెద్దవాఁడు. అందుచే నాతనికి సింహాసనాధికారము సంక్రమించెను.కర్ణుఁడు ధర్మజునకన్నను బెద్దవాఁడు. కనుక నాతఁడు పాండురాజు రాజ్యమునకు వారసుఁడెట్లు గాకపోయినాఁడు? రాజనీతియొక్క సంకేతము ననుసరించి కర్ణుఁడు రాజ్యమునకు వారసుఁడు. అతఁడు ధర్మరాజాదులవలెనే కౌంతేయుఁడు, వారివలెనే పాండవేయుఁడు. ఇచ్చట నొకరీతిఁగర్ణుని జీవితము నాక్షేపింపవచ్చును. అది యిది: "ధర్మరాజాదులు గుంతీదేవికి వివాహమైన తరువాత జన్మించిరి. ఆమెకు సంతానప్రాప్తిగూడఁ బాండురాజు సమ్మతితోనే జరగినది. అందుచే వారు రాజ్యమున కుత్తరాధికారు లనుటలో న్యాయమున్నది. కర్ణుని జన్మయట్లు గాదు. అతఁడామెకుఁ గన్యాత్వమున లిగెను. అతఁడు కానీనుఁడు. అందుచేఁ గర్ణునకుఁ దాను పాండవేయుఁడనని ప్పకొనుట కధికారము లేదు."

ఆపాతముగ జూచినచో నీ ప్రశ్న బాగుగనే యున్నది. కాని భారతకాలమునాటి సామాజికనీతిని బట్టి విచారించినచో నీ యాక్షేపణకు బలములేదు. నాటి సామాజికనీతి యిది.

"కానీనశ్చ సహోఢశ్చ కన్యాయాం యశ్చ జాయతే
ఓఢారం పితరం తస్య ప్రాహు శ్శాస్త్రవిదో జనాః"

భా. ఉత్తరపర్వము అ, 140)

"వివాహానంతరమును దానికంటెనుఁ బూర్వమును స్త్రీకిఁ గలిన సంతానమంతయు మగనికిఁజెందినదే. ధర్మశాస్త్రము ననుసరించి యతఁడే వారికిఁ దండ్రి. అందుచే నా సంతానమంతయుఁ దండ్రి యొక్క యాస్తికి వారసులే! ఇది నీతికారుల మతము."

పై శ్లోకము భారతములోనిది. ఇది యెవరో సామాన్యుఁడన్నమాట గాదు. ఈ వాక్యము వ్యాసభగవానుఁడు పూర్ణావతారుఁడైన వాసుదేవునివంటివాని నోటినుండి చెప్పించెను. కనుక నాటి సామాజిక నియమ మిదియే. దీన సందేహము లేదు. ఈ శ్లోకమునకుఁ దరువాత గృష్ణుఁడు గర్ణునితో నిట్లనుచున్నాఁడు.

"సోఽసి కర్ణ! తథా జాతః పాండోః పుత్రోఽసి ధర్మతః
నిగ్రహా ద్ధర్మశాస్త్రాణా మేహి రాజా భవిష్యసి.
భా. ఉత్తర ప. అధ్యా. 140)

కర్ణా! నీ జన్మ యీరీతిగ నగుటచే నీతిశాస్త్రము ననుసరించి నీవు పాండవేయుఁడవు. నీవు నా వెంట రమ్ము. నిజముగఁ జూచినచో నీవే రాజ్యమునకు వారసుఁడవు. నృపాలుఁడవై కురుదేశమునుఁ బాలింపుము."

కాని, శాస్త్రజ్ఞుల యీ వాదము కర్ణున కప్పు డేమియు నుపయోగ పడలేదు. కారణ మేమనఁగా నా రహస్యము వారికిఁ దెలియవలసినప్పుడ తెలియలేదు. కృష్ణుఁడు మాటాడినప్పుడు తెలిసియుఁ బ్రయోజనములేదు. యుద్ధభేరులప్పుడే మ్రోయింపఁబడివి. దుర్యోధనునకుఁ గర్ణుడే యాధారస్తంభమను బ్రసిద్ధి యోర్పడినది. కర్ణుని మనస్సున దుర్యోధనునియెడఁ గృతజ్ఞతాభావములు దీవ్రముగఁబాదుకొన్నవి. రాధేయుఁ డప్పుడే ధనుస్సును సారించియుండెను. ఇప్పుడాతనికీ రహస్యము దెలిసి మాత్రము యేమిలాభము? ఒకటే లాభము! అవమానముతో వాని మనసు గుతకుత యుడికిపోవుట! అదియే యైనది.

ఈ రహస్య మింతకుముందే చాల ముందే కర్ణునకుఁ దెలుపవలసియుండెను. అప్పుడేదైనఁ బ్రయోజన ముండియుండెడిది. కాని యప్పుడైన నీపనిఁ జేయవలసిన దెవ్వరు? కుంతీదేవియే! కాని యామె కాసాహసము లేకపోయినది. కుంతి చేసిన పని యన్యాయ ముగ విమర్శకులకుఁ దోపవచ్చును. తోఁచుటలో నాశ్చర్యము లేదు. కాని కర్ణునియెదుటఁ దన్నొక హృదయహీనురాలిగఁ బ్రకటించి కొనుట కాతల్లి సమ్మతింపలేదు. ఈ రహస్యమునుఁ దాను కర్ణున కెఱిఁగించినచో వాఁడామెను రాతిగుండెదానినిగ దలఁచును. ఆ నిందను సహించు ధైర్యము కుంతి కప్పుడు లేదు. ఆమె రాతిగుండె తోనే యారహస్యమును దాచికొన్నది.

## కర్ణుని జన్మము

భారతమునందు గర్ణుని జన్మవృత్తాంత మిట్లున్నది.

"శూరోనామ యదు శ్రేష్ఠ వసుదేవ పితాzభవత్

.... .... ..... ....

.... ..... ..... .....

వసునా సహ జాతోzయం వసుషేణో భవత్వితి

(భా. ఆది. ప. అ. 111)

పాండవుల తల్లియైన కుంతి యాదవుల యాడుబిడ్డ. ఆమె వసుదేవునకుఁ జెల్లెలు. శూరుఁడను వాని తనయ. కనుక కృష్ణభగవానునకు మేనయత్త. కుంతీదేవిరూప మప్రతిమానమైనది. శూరునకు పైతృష్వస్రీయుఁ డొకఁ డుండెను. అతని పేరు గుంతిభోజుఁడు. అతఁడనపత్యుఁడు. అతని దుఃఖమునుఁ జూచి శూరుఁడు దనకుఁ గలిగెడు మొదటి సంతానమునుఁ గుంతిభోజున కిత్తు నన్నాడు. పలికిన మాట ప్రకారము శూరుఁడు కుంతీదేవినిఁ గుంతిభోజున కొసఁగెను. కుంతీదేవి కుంతిభోజునకుఁ బెంపుడు బిడ్డయైనది. ఆమె నాతఁడు దనయింట

బ్రాహ్మణాతిథి పూజకై నియోగించెను. కుంతి యా కార్యమును భక్తి శ్రద్ధలతో నిర్వర్తించుచుండినది. ఒకనాఁడు దూర్వాసుఁడటకు వచ్చెను. ఆమె యాతనిని భక్తితో సేవించెను . అతఁడు సంతసించి కుంతి కాపద్ధర్మముగ నొక మంత్ర మొసఁగెను. ఆ మంత్రము అభిచారాభి సంయుక్తమైనది. "ఈ మంత్రబలమున నీ వే దేవత నాహ్వానింతువో యా దేవతాప్రభావమున నీకుఁ గుమారుఁడు గలుగు" నని యాతఁడు పలికినాఁడు. ఆమెకు బాల్యము. బాల్యచాపల్యమున నామె సూర్యునాహ్వానించినది. అతఁడామె పిలుపునకుఁ దిగివచ్చెను. అతని రాక కామె యాశ్చర్యపడినది. వచ్చిన సూర్యుఁ "డేమి కావలె" నని యామె నడిగినాఁడు. కుంతికి భయమైనది. ఆమె బదులొసఁగెను. "స్వామీ! దూర్వాసుఁడు నాకీ మంత్ర ముపదేశించెను. దీనిశక్తిని బరీక్షించుటకై నేను నీపైఁ బ్రయోగించితిని. ఇది నా బాల్యచాపల్యము. దీనిని మన్నింపుము. ఆమాటలకు సూర్యుఁడిట్లు బదులిచ్చెను. "కుంతీ! నీకు మంత్రము ప్రాప్తించిన విధమంతయు నాకుఁ దెలియును. నా దర్శన మమోఘము అదెన్నటికిని వ్యర్థముగాదు. నన్నూరకఁ బిలచి వెనుక కంపిన మహోఘము నిన్ను జుట్టి వేధించును".

కుంతీదేవి కెట్లునుఁ బాలుపోలేదు. ఆమె దాను కన్యననియుఁ దన్ను మన్నింపవలెననియు బహువిధముల వేడికొన్నది. బంధువులకుఁ దెలిసిన నేమి మూడునో యని భయపడినది. సిగ్గుతోఁ జితికిపోయినది. సూర్యుఁడామె కిట్లనెను. "కుంతీ! నా ప్రభావము వలన నీ కన్యాత్వము నశింపదు. భయపడకుము". సూర్య భగవానుని కరుణచే నామెకు గర్భోత్పత్తియై సుతుఁడు జన్మించినాడు. అతఁడు సద్యోజాతుఁడు, ఆముక్తకవచుఁడు, శ్రీశోభితుఁడు. అతని కవచము సహజమైనది. కుండలములను జన్మతోవచ్చినవే! వానికి సూర్యభగవానుఁడు గర్ణుఁడని పేరు వెట్టెను. ద్వాదశాత్ముఁడు దివమున కరిగినాఁడు. ఆకుమారునిఁ గాంచి కుంతి భయపడినది. బాంధవులలోఁ దన కవమానము ఘటిల్లును. ఈ యపచారము నామె

దాచికొన యత్నించెను. కుంతీదేవి కర్ణుని జలములో వదలిపెట్టినది. రాధాదేవి భర్తయైన సూతుఁడా శిశువునుఁ గాంచెను. సూతుఁ డాతనినిఁ బుత్రుఁడుగ భావించి రాధ కొసగెను. వసుసహితుఁడుగఁ గర్ణుఁడు దనకుఁ బ్రాప్తించుటచే నాతనికి "వసుషేణుఁ" డని సూతుఁడు పేరుపెట్టెను. నాటినుండి కర్ణుడు రాధేయుఁడు.

## కుంతీ దేవిది దోషమా?

భారతమునుఁ జదువువా రందరును సాధారణముగ నీ విషయమునఁ గుంతీదేవినిఁ దప్పు పట్టెదరు. కర్ణుడు గూడ నామెను నిందించెను. "నీ కీర్తికొఱకై నా గళమును ఛేదించితివి. నీవు మహాపాపి"వని, కర్ణుఁడామెనుఁ దిట్టిపోసినాఁడు. రాధేయుఁడామె నట్లనుట సహజమే! కాని కుంతీదేవి గర్ణుని వదలుట యామె దోషమేనా?" ఈ విషయము మనము కొంత శాంతముగ విచారింపవలెను. కుంతి యొక సామాన్య మానవస్త్రీ అగుటచే నామెకు సామాన్యుల కున్న లజ్జ, భీతి, సంకోచము యీ గుణములన్నియు నుండకుండునా? తప్పక యుండును. కర్ణుని జన్మము బయటఁబడినచోఁ దన యింటితనము పాడైపోవునని యామె భయపడియుండును. తన భవిష్యత్తు సర్వశూన్యమగునని యామెకు దిగులుండెను. దీనికిఁ దోడు బాల్యమునకు సహజమైన యజ్ఞానము, తొందరయీ గుణము లన్నియు నామె కున్నవి. ఆమె జీవితమున నొక చిత్రమైన సంఘటన జరిగినది. ఆ జరగుట గొప్ప దురదృష్టమే. జరగిన తప్పిదమును సరిపెట్టుకొనుట కా వయస్సున నున్న కుంతి కుమారుని వదలుకొనుట దప్ప మరేమి యొనర్చును? సమాజమున కెదురొడ్డి పోరాడునా? మరి యిందులో నామె దోష మేమున్నది? పైఁగా నామె నివసించుచున్నది పెంపుడుతండ్రి యింట. కన్న తండ్రి యెన్నఁడో తన్ను వదలెను. శూరుని యింటనే దానున్నచో, నీ సన్నివేశమున గుంతి యేమి చేసియుండెడిదో? వచ్చిన బాధను దప్పించికొనుటకై దాత్కాలికముగ

నామె యీ పనికిఁ బూనుకొని యున్నను నా బాధ యామె మనస్సున మఱఁగిపోలేదు. శూరుఁడు దన కొనర్చిన యన్యాయమే, యీ బాధల కన్నిటికిఁ గారణమని కుంతీదేవి తీర్మానించికొన్నది. కృష్ణుడు దౌత్యమునకై కౌరవుల కడకే వచ్చినపుడు మేనయత్తనుఁ జూచుటకు వెళ్ళినాఁడు. అప్పుడామె యాతనితో నీ యభిప్రాయమునే జెప్పినది. ఆఘట్టమిది:

"పితరం త్వేవ గర్హేయం నాత్మానం న సుయోధనం
.... ..... ...... ..... ........ ....
ఆదత్తు కుంతిభోజాయ సఖా-సఖ్యే మహాత్మనే॥
(భా. ఉద్యో. ఆ. 105)

కృష్ణా! నే నీ విషయమున దుర్యోధనుని నిందింపను. నన్ను గూడ నిందించికొనుట లేదు. ఈ సిలుగుల కన్నిటికిని నా తండ్రి యగు శూరుఁడే కారణము. అతఁడు నన్ను బాల్యమున నొకానొక ప్రాణములేని పదార్థమునువలెఁ దన మిత్రున కొసఁగెను. అప్పుడు నాకేమియుఁ దెలియదు. కందుక క్రీడ యొనర్చికొను ప్రాయము. ఆ వయసున నా తండ్రి నాయెడఁ జూపిన నిర్దయయే యన్ని కష్టములకుఁ గారణమైనది".

పై శ్లోకములఁబట్టి కుంతిభోజునియింట నామె స్థితి యెట్లుండెనో మ మూహించికొనవచ్చును. ఇట్టి పరిస్థితులలో నొకానొక సామాన్య ౖ లోకాచరవిరుద్ధముగఁ బుట్టిన కొడుకును వదలి పెట్టుటకంటె మఱియేమి సేయును? కుంతి యీ రహస్యమును శాశ్వతముగఁ దన హృదయమున దాచికొనలేక పోయెను. ఆమెయొకసారి తన బాధను గర్ణునకుఁ దెలుపనే తెలిపినది.అప్పుడు వాని పరితాపమునకు మేరలేదు. అతఁడిట్లన్నాడు. "లోకాచారవిరుద్ధముగ నన్నుఁ గంటివి. మంత్రమునుఁ బరీక్షింపఁ బూనుట నీ మొదటి యపరాధము. కన్న కొడుకును వదలుకొనుట రెండవ హృదయహీనత.

పుట్టినప్పుడే నా గొంతు నులిమివేయఁగూడదా! ఇంతమాత్ర ముపకారమైన నొనర్పక నన్నేలఁ బరిత్యజించితివి? ఆనాఁడీ యింతపాటి యుపకారమును నీవు సేసియున్నచో నేఁడు సమాజమున నా కీ దుర్దశ పట్టియుండదు." నిజమే! పుట్టిన వెంటనే యామె కర్ణుని వధింపలేదు. దీనికి గారణము? తల్లికిఁదన సంతానముపైనున్న సహజమైన దయ, దైవము పైనున్న యొక విశ్వాసము, తానొక పాపమొనర్చినది. చాలనిదానికి శిశుహత్య గూడ నొనర్చుట కామె సిద్ధపడలేదు. పైగాఁ గర్ణుఁడింతవఱకుఁ బెరిగి తన కడుపునకే చిచ్చువెట్ట సంకల్పించుకొనునని యామెకుఁ బ్రశ్నతెలియునా యేమి? కుంతీదేవి యొక మానవ స్త్రీ యని ముందే సెప్పితిమి. అందుచే నామె జీవితము గూడ గుణదోష సమ్మిశ్రితమైనది. కుంతీదేవిది దోషములేనట్లే యీ విషయమున రాధేయుని దోషముమాత్ర మేమున్నది? అట్టి జన్మమును వాఁడు గోరుకొనలేదు. దైవమకారణముగ నాతనిపై నీ యత్యాచార మొనర్చినది. అతని జీవితమునుఁ గూర్చి యెంత యాలోచించినను మనకు గలుగు లాభ మొక్క పరితాపమే! కర్ణుని జీవితము నియతి యొనర్చిన యొక భయంకర క్రీడ. అతఁడు సూర్యపుత్రుడు. దేవసంభవుఁడు. కౌంతేయుఁడు. పాండవేయుఁడు. కాని దైవము దన దుర్విలాసము నాతని యెడఁ బూర్తిగ నెఱపెను. అతఁడు సూతపుత్రుఁడై నాఁడు. అర్ధరథుఁడయ్యెను. రాధేయుఁడని జగమాతనిఁ బరిహసించినది. న్మతో నాతఁడు సంపాదించికొన్న పావిత్ర్యమునంతయు నాతనికిఁ బట్టిన శని ల్లవెట్టినది.ఇది సృష్టిలోని యొక వైచిత్రి. దీనికిఁ దర్కము లేదు. ఈసందర్భమున మరియొక ప్రశ్నకుఁ గూడ నవకాశము గలదు. అది యిది. "బాల్యమునందుఁ గుంతి కర్ణుని యుపేక్షించినది. కొంతకాలమున కామెకు వాఁడు దన సుతుఁడని దెలిసినది. వెంటనే యామె రాధేయునితో నీ విషయము నేల బ్రస్తావింపలేదు.?"

కర్ణుడు దన సుతుఁడని కుంతీదేవికిఁ దెలియునాటికే వారి జీవితములు విభిన్నములై పోయినవి. చాల కాల మీ విషయమామెకుఁ దెలియనేలేదు. పుట్టినప్పుడే

యామె కర్ణుని గంగలో వదలెను. ఆ సుతుఁడు జీవించి యింతవాఁడై యుండునని యామె యెట్లు నమ్మును? పైగా నొకవేళ జీవించియున్నను వాఁడు కురుదేశసీమలయందే శుక్లపక్ష చంద్రునివలెఁ బెరుగుచున్నాఁడని కుంతీదేవి యెట్లూహించికొనఁగలదు! కర్ణు నామె వదలిన తర్వాత నీ విషయము లామె బలవంతముగ మఱచిపోఁ జొచ్చినది. ఈ భావములనుఁ జంపివేసికొన్నది. అటుపిమ్మట నామెకు స్వయంవరము జరగినది. పాండురాజామెనుఁ జేపట్టినాఁడు. కౌరవసింహాసనమున కామె పట్టమహిషియయ్యెను. పిమ్మట మృగయావ్యాపారమును, హృదయద్రావకమైన పాండురాజు మరణమును ఘటిల్లినవి.నేఁడామె యనాథయైనవిధవ. తండ్రిలేని కొడుకులతో నామెధృతరాష్ట్రునియింట జీవించుచున్నది. హస్తినావతియందెక్కడఁ జూచినను నామెకు విరుద్ధమైన వాతావరణమే! ఈ దుఃఖముతోఁ గుంతీదేవి పొట్టు పొరలగుచున్నది.

నాఁడు కర్ణుఁడు జేగీయమానుఁడై వెలుగుచుండెను. వానినామె గమనించునాటికే చాల కాలము గడచినది. పాండురాజు బ్రదికి యున్నప్పుడే కుంతీదేవికిఁ గర్ణునిఁ గూర్చి తెలిసియున్నచో మహాభారతముయొక్క రూపురేకలే మాఱి యుండెడివి. వ్యాసమహర్షి యొక్క ప్రతిభా సమున్మేషమైన మహభారతరచన కవకాశమే యుండెడిదిగాదు. అది యట్లుండె.

రాధేయుడు దన సుతుఁడని యామె గ్రహించినది. కాని లాభమేమి? అప్పటికే దుర్యోధనున కాతఁడభిన్న మిత్రుఁడు!వారి పన్నాగము లన్నిటను గర్ణుఁడు చేయి గలుఁజేసికొను చుండెను. దుర్యోధనుని మైత్రితో వాని జీవనము వైభవోపేతముగ నున్నది, ఇట్టి స్థితిలోఁ గర్ణునకు వాని జన్మ వృత్తాంత మెఱిఁగించి వానిని సిలుగులలోఁ దోయు టెందులకు? కన్నతల్లియైన కుంతీదేవి హృదయ

నుండెనేమో? కర్ణుఁడు ధార్తరాష్ట్రులభిన్నుఁడు.వాడు జీవనమునకై వారి నాశ్రయించెను.. వారితోఁ జేరి పాండవుల నాశమొనర్చుటకై యత్నించుచున్నాఁడు? అట్టివానికిఁ దన రహస్యము నెఱింగించి వాని యెదుట నిరంతరాపరాధినిగ నిలుచు సాహస మామెకు లేకపోయినది. తన కీర్తికళంకము నామె తనలోనే దాచికొన్నది.

ఈ రితిగ నే పరిస్థితియుఁ గుంతికిఁ గాని కర్ణునకు గాని యనుకూలముగ లేకపోయినది. తెలియవలసి నప్పుడు వాని జన్మప్రకారము కర్ణునకుఁ దెలియనే లేదు. ఏ యూహతోనైన నేమి? కుంతీదేవి యీ రహస్యమును వానికిఁ దెలుప సిద్ధపడలేదు. ఇందులో నెవ్వరి దోషమును లేదు. ఇది యంతయు నియతి నిర్దయగ నాడిన యొక భయంకర క్రీడ. కర్ణుఁడు మరణించినాఁడు. నారద మహర్షి కర్ణుడు పాండవుల కన్న యని యుధిష్ఠిరునితోఁ దెలిపెను. అప్పుడు ధర్మరాజునకుఁ గలిగిన దుఃఖమునకు మేరలేదు. నారదుఁడు యుధిష్ఠిరుని నిట్లోదార్చినాఁడు. "ధర్మరాజా! యీ విషయమున నెవ్వరిని నిందించుట కవకాశము లేదు. తలఁపున కందిన తర్కముతో "వీఁడుదోషి - వాఁడుదోషి" యనుకొనుట వారిపై నిప్పులు నూరుట మన యజ్ఞానము మాత్రమే! నీ యన్నయైన కర్ణుఁడు దైవోపహతుఁడు. దురదృష్టవంతుఁడు. నియతి చేతిలో నాతని జీవితమంతయు నొక వికృతక్రీడ యైనది. "కుంతిదేవిలోఁ గలిగిన యీ కన్యాగర్భము భారత సంగ్రామమునకు మూలబీజమై క్షత్రకులములనన్నిటిని భస్మ మొనర్చుగాక?' యని దేవతలే యుద్దేశించిరి. ఆ యుద్దేశ్యమును సాధించు టకే కర్ణుఁడు జన్మించెను. వానికి దివ్యాస్త్రములు ప్రాప్తించుటయుఁ గూడ నందుకే! క్షత్రియులకు శస్త్రపూతమైన మరణములేనిది యుత్తమ లోకములు సిద్ధింపవు. మహాసంగ్రామమే లేనిది దుష్టు లెల్ల రొక్కుమ్మడి నాశనము గారు. కనుక దేవకార్యమును సాధించుటకై నియతి కర్ణుని జీవితమును గ్రసించి యింతలేసి కార్యము లొనర్చెను. దానికై నీవు దుఃఖింపకుము. దుర్దమమైన కర్ణుని జీవితమునందు దేవతల యాకాంక్షయుఁ

బనిచేసినది! దుర్దైవము గూడ నప్రతిహతమగు శక్తితోఁదన కౌశల్యమునుఁ గనబఱచినది. కర్ణుఁడొక్కఁడు లేకున్నచో భారతసంగ్రామ మంతటి యసామాన్యమైన పరిణామము నందియుండెడిది గాదు. అతఁడే యందుకుఁ బ్రేరేపకుఁడు. దానికిఁ గారణము వాని జన్మలోనే కలదు. కర్ణుని జీవితమంతయు లోకోత్తరములైన సద్గుణ దుర్గుణముల సమావేశము. వాని తుములసంగ్రామమే వాని జీవితము. కర్ణుని సద్గుణము లసామాన్యములు, లోకోత్తరములు. వాని యవగుణములు విలక్షణములు భయంకరములు. ఇట్టివ్యక్తి దప్ప మఱియొక్కఁడు మహాభారత సంగ్రామమునుఁ బ్రేరేపించి యుండలేడు.

## కర్ణుని యసామాన్య శౌర్యము

చిన్నతనమునుండి కర్ణునకు ధనుర్విద్యలో మెలకువ గద్దు. అతఁడు గ్రమ క్రమముగా నా విద్యలో నందరిని మీరెను. తన్నాశ్రయించిన వారి జీవితముల రసమయములుగ నొనర్చి పరిపుష్టములు గావించు గుణ మాతనికిఁ దండ్రియగు సూర్యుని నుండి సంక్రమించినది. అట్లే తనకుఁ గావారినిఁదన తేజస్సుతోఁ జుట్టుముట్టి దహించి వేయు గుణమునుఁ గూడఁ దండ్రియైన సూర్యభగవానుఁడే గర్ణునకుఁబ్రసాదించెను. బుద్ధి కుశలత, సౌందర్యము, తేజస్సు, మహానుభావత్వము పరాక్రమము, కర్తృత్వము మొదలగు గుణములు గుంతీదేవిలో సహజముగ నున్నవి. అవి యన్నియు, దల్లినుండి కర్ణునకు వచ్చినవి. అతఁడు మహాస్త్రసంపన్నుడు. సహజములైన కవచకుండలములు గలవాఁడు. క్షత్రియాంతకుఁడైన పరశురాముఁడాతని గురువు. భార్గవ రాముఁడే యాతని కనర్ఘమైన హరశరాసన మొసఁగెను. ఈ సాధనసంపత్తిలోఁ గర్ణుడు దుర్ధర్షుఁడు. నవధ్యుఁడు గూడ నైనాఁడు. ఒకానొక సారి 'రాజర్షి' యైన భీష్ముఁడు 'గర్ణుఁడర్ధరథుఁడ'ని పరిహాసమొనర్చెను. అతఁడే తరువాతఁ గర్ణుని దాను నొప్పించినందులకుఁ బశ్చాత్తాపపడినాఁడు. భీష్ముడు

శరశయ్యపై నున్నప్పుడు రాధేయుఁడాతనిఁ జూడబోయెను. అప్పుడు భీష్ముడు గర్ణునిలోని మంచిగుణముల నిట్లుముక్తకంఠముతోఁ బొగడెను.

"జానామి సమరే వీర్యం శత్రుభి ర్దుస్సహం భువి

...... ..... ........ .......

దైవం పురుషకారేణ నశక్య మతివర్తితం"

(భా. భీష్మ. అ. 122)

కర్ణా! శత్రుదుస్సహమైన నీ వీర్యము నెఱుఁగుదును. నీ యలౌకిక నిష్ఠయు నాకుఁ గ్రొత్తది గాదు. నీ పరాక్రమ మసామాన్యము. నీ తేజస్సు దుస్సహము. నీ దానశౌండిమ మితరు లెవ్వరికిని సాధ్యము గానిది. నీకు సరియైన మానవుఁడు లేడు. నీవు దేవ తుల్యుడవు. మనుష్యలోకమున నీవంటి ప్రభావశాలిని నేను చూడలేదు. నీ విట్టివాఁడవై యున్నను నిన్నపుడపుడు కఠోరవచనములతో మందలించితిని. దీనికిఁ గారణము కురుపాండవులలోని కులభేదమునకు నీవు గారణమగుటయే. శరసంధానము, అస్త్రపాండిత్యము, శస్త్రలాఘవము మొదలగు గుణములలో నీవు కృష్ణార్జునులకు సమానుఁడవు. కౌరవరాజు స్వయంవరార్థమై వారాణసికి వెళ్ళినాఁడు. కాశీరాజ దుహితను వివాహ మొనర్చికొనుటకై ప్రసిద్ధులైన రాజులందఱునటకు వచ్చిరి. నీ వొక్కడవే ధనుర్మాత్ర సహాయుండవై యా రాజుల నందఱను వెనకుఁదన్నితివి. ఒక్కుమ్మడిగ నీ చేనఁబడిన రాజులెల్లరు నీ శరసంధాన పాండిత్యమునకు భయపడి పరువెత్తి పోయిరి. రణప్రియా! సార్వభౌముఁడైన జరాసంధుని గూడ నీవోడించితివి. నీపరాక్రమము నే నెంతని వర్ణింతును. వత్సా! నీవు నిష్ఠావంతుడవైన యోధుఁడవు. దేవగర్భసముఁడవు. నీపై నాకుండిన కోపమీనాటికిఁ దీరిపోయినది. దైవమును పురుషకారము చేత జయించు టెవ్వరికిని సాధ్యము గాదు."

యుధిష్ఠిరుఁడును శాంతిపర్వమున గర్ణుని ప్రభావమునుఁ గూర్చి యిట్లు తలపోసినాఁడు.

"యస్స నాగాయుతబలో లోకే ऽప్రతిరథో రణే
కారణం నాధిగచ్ఛామి కథంచి దపి చింతయన్ ॥
(భా. శాంతి. అ. 1)

కర్ణుడు నాగాయుత బలుఁడు. అప్రతిరథుఁడు. సింహఖేలగతి ధీమంతుఁడు. దృఢనిశ్చయుఁడు. ధైర్యము గలవాఁడు. దానశూరుడు. అతని మాత్సర్యమున కడ్డులేదు. నిత్యోత్సాహమాతని సొత్తు. ప్రతి యుద్ధమునందును మమ్మాతఁడు జయించెను. వింట బాణమునుఁ దొడగుటలో నాతని వేగ మితరుల కనుసరింపరానిది. చిత్రయుద్ధ మాతని చాతుర్యము. నాఁడు కౌరవుల సభలో మే మవమానపడితిమి. ధార్తరాష్ట్రులు మమ్మెంతయో నొప్పించిరి. వారి మాటలకు మాకుఁదీవ్రమైన గోపము గలిగినది. ఇక నెన్నిసారులో వారిపై నాకు గోపము వచ్చినది. కాని నా కోపమంతయుఁ గర్ణుని మొగముఁ జూచుటతోనే చల్లగా నయ్యెడిది. జూదమునందు మే మోడినప్పుడు గౌరవసభలోఁ గర్ణుండు మమ్ము లాఘవముగఁబలికెను. కాని యాతని పాదములు జూచిన వెంటనే నా దోషమంతయు మాయమైనది. ఆతని యంఘ్రులు గుంతీదేవి పాదముల వలెనే యుండెడివి. ఈ పోలికకుం గారణమేమని నాలో నేను పలుమారులు చర్చించికొనెడివాఁడను ఎంతయాలోచించినను నాకుత్తరము దొరికెడిది గాదు."

ధర్మరాజునకుఁ గర్ణుఁడన్నఁ బెద్ద దిగులు. అంత భయము మరెవ్వరి జూచినను ధర్మరాజునకు లేదు. యుద్ధమునఁ గర్ణుని జయించుటెట్లనియే యాతని నిరంతర చింత. పదుమూఁడు సంవత్సరము లీ వంత ధర్మజుని హృదయము రోగమై బాధించినది. కడకెట్లయిననేమి కవ్వడి కర్ణుని జయించినాఁడు. ధర్మరాజు రాధేయుని శవమును కండ్లారఁ జూచెను. అప్పుడాతనికి మనస్సమాధానమ గలిగినది. ఈ సన్నివేశము భారతమున నిట్లున్నది.

"హతో వైకర్తనో రాజన్ z సూతపుత్రో మహారథః
స్వప్స్యామో z ద్య సుఖం రాత్రౌ త్వత్ప్రసాదా న్మహాభుజ!
(భా. ,కర్ణ. అ. 96)

భగవంతుఁడైన శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ననెను. "రాజా! విఖ్యాత పరాక్రముఁడును, మహారథుఁడును నైన రాధేయుఁడు రణమున నీల్గెను, నీకు జయమగుగాక! నీవదృష్టవంతుఁడవు." కృష్ణుఁడన్న యీ మాటలు విని ధర్మజుఁడానందమున నుప్పొంగిపోయెను. వైకర్తనుఁ డీల్గెనన్నచో నిఁకఁ గౌరవపక్షమందలి సకలయోధులును మరణించినట్లే.

ధర్మరాజు సంతోషము మిక్కుటమైనది. అతఁడు హేమ విభూషితమైన రథము నెక్కెను. ఆ రథమునకు మనోజవములైన నల్లని తోకలు గలిగి శ్వేతవర్ణముగల హయములు పూన్పఁబడి యుండెను. స్వబలములతో ధర్మరాజు రణభూమికి వచ్చినాఁడు. కృష్ణార్జునుల నాతఁడెంతయో శ్లాఘించెను. యుద్ధభూమియందుఁ బడిన కర్ణుని దేహము నాతఁడు వీక్షించినాడు. సర్వతః కేసరావృతమైన కరంబకుసుమువలె విగతప్రాణుఁడై రాధేయుఁడు పడియుండెను. ఆతని యొడలినిండ బాణములే! గంధతైలావసిక్తములైన దీపముల సాహాయ్యముతో యుధిష్ఠిరుఁ డా శవమునుఁ దిలకించెను. కర్ణుని కవచము భిన్నభిన్నమైనది. ఆతని సుతుఁడు గూడ సమీపముననే చచ్చి పడి యుండెను. ఇప్పటికి కర్ణుఁడు సచ్చెవని యుధిష్ఠిరుండు నమ్మినాఁడు. అతఁడు కృష్ణార్జునుల నిట్లు ప్రశ్నించెను. "గోవిందా! నేటికి రాజ్యము నిజముగ నాకుఁ దక్కినది, నా తమ్ములతోఁగూడ సుఖముగ సింహాసన మధిష్ఠింపగల భాగ్యమును విద్వాంసుఁడవును, వీరుఁడవును నైన నీవే నా కనుగ్రహించితివి. అమితాభిమాని యైన కర్ణుఁడు మరణించుట చేత నిఁక దుర్యోధనునకుఁ గోరలూడిపోయినట్లే. రాజ్యమునుఁ బ్రాణములును నీ దయతో నేటికి మాకు దక్కినవి. కృష్ణా! నీకు జయమగుగాక! అర్జునుడు

గూడ నుత్సాహముతో వెలుఁగొందుగాక! కర్ణుఁడు సచ్చుటతో మాకింక జయము హస్తగతమైనట్లే. కర్ణుని జయించు టెట్లన్న యాలోచనతోఁ బదుమూఁడు వర్షములు మేము కంటినిండ నిద్రింపనే లేదు. నీకృపతో నేఁడు కర్ణుడు సచ్చెను. ఇక సుఖముగ నిద్రింతుము."

కృష్ణపరమాత్మునకుఁ గర్ణుని యోగ్యతలు దెలియును. అతనికిఁ గూడఁబార్థుఁడు రాధేయు నెట్లు జయించు నన్న భయమే. కృష్ణుఁడు కర్ణార్జునుల యుద్ధమును ఋగ్వేదమున జరగిన యింద్ర వృత్రాసురుల యుద్ధముతో బోల్చెను. రణభూమియందుఁ గర్ణుఁడు పడిన పిదప పార్థునిఁ బొగడుచుఁగృష్ణుడన్నమాటలివి:

"ధనంజయా! ఇంద్రుఁడు వృత్రాసురుని గెలిచెను. నీవు కర్ణుని జయించుటలో నట్టి పరాక్రమమునే చూపితివి. కర్ణ వృత్రాసురుల మరణము లోక మెన్నటికిని మఱువఁబోదు. ఇంద్రుడు వృత్రుని జయించుట కై వజ్రమను నొక యాయుధమునుఁ గ్రొత్తగ సంపాదించి కొనెను. నీవు నీకున్న బాణములతోనే గర్ణునిఁ గెలిచితివి. ఇంద్రుని విక్రమము కంటెను నీవు జూపిన తెగువ గొప్పది."

కృష్ణుఁడన్న యీ మాటలతోఁ గర్ణుని ప్రభావ మెంతటిదో స్పష్టము దెలియును. శత్రు మిత్రులపై నాతని వ్యక్తిత్వము విలక్షణముఁగ బడినది. కాలమునఁ బ్రసిద్ధులైన రాజుల నందఱినిఁ గర్ణుఁడు జయించి వదలె వారందరాతని విక్రమమునకు మోకరిల్లిరి. ఈ సన్నివేశములు రాధేయుని దిగ్విజ యాత్రలో జరిగెను. అప్పుడు జరాసంధుఁడు గర్ణు నెదిర్చినాఁడు. జరాసంధు గృష్ణునకును మిక్కిలివాఁడు. మాగధుఁడు మల్లయుద్ధ విశారదుఁడు. కర్ణుఁడా మల్లయుద్ధమందే గెలిచెను. రణక్రీడలో నాతనికిఁ దెలియని శాఖలేదు. విధములైన యుద్ధములలోఁ గూడ నాతడప్రతిహతుఁడు. భారతమునఁ గ పరాక్రమ మిట్లువర్ణింపబడినది.

"తతః కదాచి ద్రాజానః సమాజగ్ము స్స్వయంవరే.

... ...... ....... .......

ఏవం శస్త్రప్రతా పేవ ప్రథితః సోऽభవత్క్షితౌ॥

(భా.శాంతి. అ. 5)

ఆ కాలమునఁ గళింగదేశమందుఁ జిత్రాంగదుఁడను రాజుండెను. అతని కొక వివాహయోగ్యయైన కన్య యుండెను. చిత్రాంగదుఁ డామెకు స్వయంవరము నేర్పాటొనర్చెను. స్వయంవరమున కాహూతులైన రాజులు గళింగరాజధానియైన "రాజపురము"న కరుగుదెంచిరి. దుర్యోధనునకుఁ గూడ నీ వృత్తాంతము దెలిసినది. అతఁడు గర్ణసహితుఁడై యా స్వయంవరమునకుఁ బోయెను.ప్రసిద్ధులైన రాజులంద రక్కడఁ జేరిరి. శిశుపాలుఁ డక్కడకు వచ్చెను. జరాసంధుఁడరుదెంచెను. భీష్మకుఁ డేతెంచెను. కపోతరోముఁడును వచ్చినాఁడు. దృఢ విక్రముడైన రుక్మియేతెంచెను. శృగాల, వక్ర, నీలాదులేతెంచిరి. స్త్రీరాజ్యాధిపతియు వచ్చెను. అశోక, శతధన్వ భోజవీరాదు లేతెంచిరి. ఇంకను దాక్షిణాత్యరాజు లెందరో యా సభకు వచ్చినారు. మ్లేచ్ఛాచార్య లరుదెంచిరి. ప్రాచ్యోదీచ్యులైన నరనాయకులు గూడ వచ్చినారు. అందరును స్వయంవర మండపమున నాసీనులైరి. దాస్త్రీ పరివృతయై యా కన్య సభామంటపమునుఁ బ్రవేశించినది. పుంవత్ప్రగల్భయైన యొక ధాత్రి రాజుల నామెకు వర్ణించుచుఁ బోవుచుండెను. కళింగరాజ కన్య దుర్యోధనున దాటి పోయినది. ధార్తరాష్ట్రుడామెను వారించెను. భీష్మద్రోణసమన్వితుఁడైన దుర్యోధనుఁడు వీర్యమదమత్తుఁడై యా కన్యను బలవంతముగ రథముపైఁ గూర్చుండఁ బెట్టికొని ప్రయాణమైనాడు. రథియు, ఖడ్గియు, బద్ధగోధాంగుళిత్రుఁడును నగు కర్ణుఁడు ధార్తరాష్ట్రుని వెన్నంటి కాపుగా నడచెను. ఈ సాహసమునుఁ జూచి రాజులలోఁ గలకలము సెలరేగినది. అవమానితులైన రాజులు కర్ణదుర్యోధనుల నడ్డగించిరి. వా రొక్కుమ్మడి శరవర్షము నారంభించినారు. కర్ణుఁడు విజృంభించెను. ఒక్కొక్క

బాణముతోను యాతఁ డా వీరవరులబాణముల నన్నిటి నడ్డగించినాఁడు. వారి ధనుస్సు లాతఁడు గ్రిందఁ గూల్చెను. ధనుస్సులు విరిగిన పరిపంథు లాతనిపై ననేకాయుధములతోఁ బడిరి. రాధేయుఁడు వారి నెవ్వరిని లెక్కపెట్టలేదు. చేరిన రాజుల నందరి నాతఁడు నిర్వీర్యుల నొనర్చెను. వారి తలలు దూదిపింజలవలె నెగిరి పోయినవి. మిగిలిన రాజులు "రక్షింపుమని" గర్ణునిఁ బ్రార్థించిరి. శత్రువులందరును రణముఖము నుండి వెనుదిరిగిరి. కర్ణునిచే రక్షితుఁడైన దుర్యోధనుఁడు గన్యతో హస్తినావతికి వచ్చెను.

కర్ణుడు రాజుల జయించిన వృత్తాంతము జరాసంధుఁడు విన్నాఁడు. అతఁడు రోషముతోఁ గర్ణు నెదిర్చెను. యుద్ధమున కాహ్వానించెను. ఇరువురును దివ్యాస్త్రవిదులు. కర్ణజరాసంధుల పోరుభయంకరమై భాసించెను. ఒకరికొకరు దీసిపోకుండిరి. వారి బాణములు ముగిసినవి. ధనుస్సులు దునిగినవి. ఖడ్గములు భగ్నములైనవి. ఇక నేమి సేయుదురు? ఇరువురును క్రిందికి దిగి మల్లయుద్ధమునకుఁ దొరకొన్నారు. జరాసంధునకు వయసు చెల్లినది. కర్ణుఁడాతనిని బాహుప్రహారములతో నొప్పించెను. జరాసంధుఁడు కర్ణుని పరాక్రమమునకుఁ గ్రిందైనాఁడు. అతఁడు గర్ణుని గట్టితనమున కెంతయో సంతోషించెను. మగధరాజు గర్ణునితో సంధి యొనర్చికొని మాలినీ నగరమును గాన్కవెట్టెను. కర్ణుఁడంగరాజై శత్రుభీకరుఁ వెలిగినాడు. అతడు 'చంపా' నగరమునుఁ బాలించెను. దుర్యోధనున కాతఁ వెన్నుబలము. స్వయంవరసమయమున జరాసంధుఁడు గర్ణుని జయించుట ప్రాసంగికము. ఇది రెండవసారి. దిగ్విజయ సందర్భమునఁ గూడ జరాసంధునిత నాతఁడు దగుల్కొన వలసివచ్చెను. అప్పుడును జరాసంధుఁ డోడిపోయినాఁడు ఆ యీర్ష్యయే యీ రెండవ యుద్ధమునకుఁ గారణము. కర్ణుఁడు సూపిన పరాక్రమముతో దుర్యోధనునకుఁ జక్రవర్తి పదవి శాశ్వతముగ దక్కినది. కౌరవరాజ్య సింహాసనమునకుఁ గర్ణునిబలమే రక్ష. ఈ విషయము దుర్యోధనునకుఁ దెలియును.

ప్రజలకునుఁ దెలియును. వనపర్వమున కర్ణుని దిగ్విజయ మిట్లు వర్ణింపబడినది.

"అనుజానీహి మాం రాజన్సభృత్యబలవాహనం

...... ...... ...

జానతే నిర్జితాన్ పార్థాన్కర్ణేన యుధి భారత!"

(భా. వనప, అ. 254)

కర్ణుఁడు దుర్యోధనునితో నిట్లనెను. రాజా! దిగ్విజయమునకై నా కానతి యొసఁగుము. ఇదే బలములతోఁ బోవుచున్నాను. సశైలవన కాననమైన భూమినంతయు జయించి నీ కొసగెదను. పాండవులలో భీమాదులు నల్వురుగూడి భూమిని జయించిరి. దానినంతయు నే నొక్కఁడనే జయించి నీ కొసఁగెదను. ?ష్మ్ఁడు నా పరాక్రమమునుఁ జూచును గాక!" "ఈ మాటలకు దుర్యోధనుఁడు ?ంతసించెను. "కర్ణా! నే నీనాఁడు ధన్యుఁడ నైనాను.అనుగృహీతుఁడ నైతిని. ?వంటి మిత్రుడు లభించుటచే నా జన్మము సార్థకమైనది. నీ కనుకూలమైన సమయమున సేనావారమునుఁ గైకొని ప్రయాణింపుమని" పలికెను. శుభదైవతమైన దినమందుఁ జక్కని నక్షత్రయోగము భావిఫలమును సూచించుచుండగా సముచితమైన మూహూర్తమున రాధేయుఁడు సైన్యములతోఁ గదలెను. ఆతని రథఘోషతో జరాచరాత్మకమైన త్రైలోక్యము చలించినది.

బలహితుఁడైన కర్ణుఁడు తొట్టతొలుత ద్రుపదరాజు నగరముపైఁబడెను. తుములమైన యుద్ధ మేర్పడినది. పాంచాలుఁడు గర్ణున కోడెను. ద్రుపదుఁడు సువర్ణము, రజతము, వివిధములైన రత్నములు గాన్కవెట్టెను. ద్రుపదు నొక్కనినే గాక నాతనితో నున్న యితర వీరులనుఁ గూడ రాధేయుఁడు జయించినాఁడు. ?ారందఱునుఁ గప్పము లొసఁగిరి. అటనుండి కర్ణుఁడుత్తరమునకు మఱలి ?నపడిన రాజుల నందఱ నిర్జించెను. భగదత్తుని గెల్చి, సూతపుత్రుడు శత్రువుల ?ఱచుచు, హిమశైలము నధిరోహించెను. హిమాచలారణ్యములలో నున్న యాటవికు

ప్రజలకునుఁ దెలియును. వనపర్వమున కర్ణుని దిగ్విజయ మిట్లు వర్ణింపబడినది.

"అనుజానీహి మాం రాజన్సభృత్యబలవాహనం

...... ...... ...

జానతే నిర్జితాన్ పార్థాన్కర్ణేన యుధి భారత!"

(భా. వనప, అ. 254)

కర్ణుఁడు దుర్యోధనునితో నిట్లనెను. రాజా! దిగ్విజయమునకై నా కానతి యొసఁగుము. ఇదే బలములతోఁ బోవుచున్నాను. సశైలవన కాననమైన భూమినంతయు జయించి నీ కొసగెదను. పాండవులలో భీమాదులు నల్వురుగూడి భూమిని జయించిరి. దానినంతయు నే నొక్కఁడనే జయించి నీ కొసఁగెదను. ?ష్మఁడు నా పరాక్రమమునుఁ జూచును గాక!" "ఈ మాటలకు దుర్యోధనుఁడు ?ంతసించెను. "కర్ణా! నే నీనాఁడు ధన్యుఁడ నైనాను.అనుగృహీతుఁడ నైతిని. ?వంటి మిత్రుడు లభించుటచే నా జన్మము సార్థకమైనది. నీ కనుకూలమైన సమయమున సేనావారమునుఁ గైకొని ప్రయాణింపుమని" పలికెను. శుభదైవతమైన దినమందుఁ జక్కని నక్షత్రయోగము భావిఫలమును సూచించుచుండగా సముచితమైన మూహూర్తమున రాధేయుఁడు సైన్యములతోఁ గదలెను. ఆతని రథఘోషతో జరాచరాత్మకమైన త్రైలోక్యము చలించినది.

బలహితుఁడైన కర్ణుఁడు తొట్టతొలుత ద్రుపదరాజు నగరముపైఁబడెను. తుములమైన యుద్ధ మేర్పడినది. పాంచాలుఁడు గర్ణున కోడెను. ద్రుపదుఁడు సువర్ణము, రజతము, వివిధములైన రత్నములు గాన్కవెట్టెను. ద్రుపదు నొక్కనినే గాక నాతనితో నున్న యితర వీరులనుఁ గూడ రాధేయుఁడు జయించినాఁడు. ?రరందఱునుఁ గప్పము లొసఁగిరి. అటనుండి కర్ణుఁడుత్తరమునకు మఱలి ?నపడిన రాజుల నందఱ నిర్జించెను. భగదత్తుని గెల్చి, సూతపుత్రుడు శత్రువుల ?ణచుచు, హిమశైలము నధిరోహించెను. హిమాచలారణ్యములలో నున్న యాటవికు

నీ విప్పుడే పోయి యశస్వినియైన గాంధారి దేవిని "జయవంతుఁడైన దేవేంద్రుఁడదితీదేవిని" వలె దర్శింపుము.

ఇంతలోఁ గలకల మారంభమైనది. కొందరు కర్ణుని స్తుతించిరి. కొందరాతని విక్రమమున కసూయపడిరి. కర్ణుఁడు గాంధారిని దరిసి యామెపాదముల కడఁ దలవంచెను. ధృతరాష్ట్రుఁడాతనిని హృదయమునకు హత్తికొని కౌగిలించికొన్నాడు. నాటనుండి కర్ణుఁడు పాండవులను జయించినట్లే శకునిదుర్యోధనులు నిశ్చయించికొనిరి.

కురుపాండవ యుద్ధమందును సూతసుతుఁడు దేదీప్యమానుఁడైన మహాపురుషుడుగనే వెలిగెను. అతని విక్రమమున కడ్డు నిల్చినవాఁ డొక్కఁడును లేడు. ఘటోత్కచునివంటి మహావీరులు రాధేయుని పరాక్రమమునకుఁ జిక్కిమడిసిరి. "యుధిష్ఠిరుని గళమునకు ధనస్సు దగిలించి యీడ్చికొనివత్తు"నని ద్రోణులు బ్రతిజ్ఞనొనర్చిరి. కాని యాచార్యులా ప్రతిజ్ఞను నెఱవేర్చుకొనలేక పోయిరి. కర్ణుఁడా పనిని జేసి చూపించెను. కర్ణుడు సేనాపతిగనుండి పోరినప్పుడొక్క యర్జునుఁడు దక్క పాండవులందరాతనికిఁ జిక్కిరి. వారి నాతఁడు క్షమించి వదలెను. "అర్జునుని దప్ప తక్కిన వారిని వధింపనని యీతడు గుంతీదేవికిఁ బ్రతిజ్ఞ యొనర్చినాఁడు. ఆ మాట నాతఁడు నిలిపికొనెను. కృష్ణార్జునులు గూడ నాతని విక్రమమునకు జడిసిరి. వారి కాతఁడు "బట్ట బగ లింటిసూర్యుని" పగిది నగుపడెను. ఇంతటి పరాక్రమవంతుడైనను రాధేయుఁడు హృదయహీనుఁడైన రాక్షసుఁడు గాఁడు. అతని సద్గుణములు లోకోత్తరములు. అభిజాత్య మద్వితీయము. కర్ణుఁ డెంతటి శూరుఁడో యంతటి దాత. అంతటి తపస్వి. అంతటి బ్రాహ్మణభక్తుడు. ఆది ...ర్వమున నాతని తపస్సును గురించిన విషయము వచ్చును. కర్ణుని వ్రతనిష్ఠ ...ట్టిది.

"ఆపృష్ఠ తాపాదిత్య ముపతిష్ఠత వీర్యవాన్
తస్మిన్ కాలే తు జపత స్తస్య వీరస్య ధీమత:
నాదేయం బ్రాహ్మణే ష్వాసీత్ కించి ద్వస్తు మహీతలే,
(భా. ఆది. ప. అ. 111)

"వీర్యవంతుఁడైన కర్ణుఁడు ప్రతిదినమును నదీతీరమున నిలచి సూర్యుని వైపు జూచుచు నుపాసన నారంభించును. ఆతఁడొంటీ కాలిపై నిలుచుండి జపము నారంభించును. పృష్ఠభాగము బాగుగ తాపితమగువఱ కాతని యుపాసన సాఁగును. ఆ సమయమున బ్రాహ్మణుఁ డెవ్వఁడేది యడిగినను గర్ణుఁడు గాదనఁడు. అతని నియమ మట్టిది.

కర్ణుఁడు వధింపఁబడిన మీదట గూడ నాతని గుణ వర్ణనము వచ్చును. ఆ భాగ మిది.

"హతో వైకర్త: కర్ణ: సపుత్ర స్సహవాహన:
..... ....... ......
సవై పార్థాస్త్రనిర్దగ్ధో గతం పరమికాం గతిం,
(బార. కర్ణ ప. అ. 94)

పార్థుఁడు గర్ణుని బంధుసహితముగ దునిమెను. కర్ణుఁడు మరణించుటతో యాచకులపాలి కల్పవృక్షమే పడిపోయినది. కర్ణుఁడు యాచకులపట్ల "యిత్తు" నను మాట మాత్రమే యెఱుఁగును. "లేద"ను పలు కాతనికిఁ దెలియదు. అతఁడు సత్పురుషులలో సత్పురుషుఁడు. అట్టివాడు నేడీల్గెను. కర్ణుని విత్తమంతయు బ్రాహ్మణులదే. కేవల ధనము మాత్రమేమి? అతని జీవితము గూడ బ్రాహ్మణులదే. కర్ణుని బ్రాహ్మణభక్తి యట్టిది! స్త్రీల కాతఁడు ప్రియుఁడు. దాన మాతనికిఁ బ్రాణము. శ్రేష్ఠుడైన మహారథుఁడు. అట్టివాఁడు నేఁడర్జున మహాస్త్ర నిర్దగ్ధుఁడై రణభూమియందుఁ

బడిపోయెను.

కృష్ణునకుఁ గర్ణుఁ డన్నచో నమితగౌరవము. రాధేయుని యాత్మజ్ఞానమున కాతఁడెంతయో సంతోషించెడువాఁడు. కర్ణుని "విచక్షణత" యన్నను వాసుదేవునకు మెప్పే. కృష్ణుఁడు సూతపుత్రునితో నేరుగా నన్నమాటలివి.

ఉపాసితా స్తే రాధేయ బ్రాహ్మణా వేదపారగాః
తత్వార్థం పరిపృష్టా శ్చ నియతే నానసూయకాః
త్వ మేవ కర్ణ! జానాసి వేదవాదాన్ సనాతనాన్
త్వమేవ ధర్మ శాస్త్రేషు సూక్ష్మేషు పరినిష్ఠితః ॥

"రాధేయా! నీచే వేదపారగులైన బ్రాహ్మణులు చక్కఁగా నుపాసింపఁబడిరి. వారిని మనసార సేవ లొనర్చి వారినుండి తత్త్వ విజ్ఞానము నేర్చితివి. సనాతనములైన వేదవాదములఁ గూలంకషముగ నెఱిఁగిన వాఁడవు నీవే ! కృష్ణునివంటివాఁడు గూడ నింతగాఁ బొగడిన కర్ణుఁడు లోకొత్తరపురుషుఁ డనుటలో సందేహమేమున్నది? రాధేయునిలో ననేకసద్గుణము లున్నవంటిమి. వానిలో మకుటాయమానమైన దాతని దానశూరత!!

## అలౌకిక దాన శూరత్వము

కర్ణుఁడు దాతలలో గొప్పవాఁడు. దీని కర్థమేమి? అతఁడిచ్చినంతటి ధనము నేనాఁడును,నే దాతయు నెవ్వనికిని నీ లేదనియా? అది కాదు. ఒకానొక మనుష్యుఁ డొక విశిష్టగుణమునందు గొప్ప వాఁడన్నచో నతఁడా గుణమునుఁ ణమువలెఁ బ్రేమించెనని యర్థము. దాని కొఱకై యుసురులను గూడ ్ంపక వెచ్చించుట కైనను వెనుదీయడని భావము. కర్ణుని దానశూరతయు దే. అతఁడా సద్గుణమునుఁ దన ప్రాణములకంటె నెక్కువగఁ బ్రేమించెను. ప్రేమను జీవితాంతము వఱకు నిలిపికొనెను. కాళిదాసు రఘువంశ కావ్యమున

ముత్యమువంటి యొకమాట యన్నాఁడు. "సువర్ణ మగ్నితప్తమైనప్పుడే దానిరంగు బయటపడునట! దానిది శుద్ధియో మాలిన్యమో బయలుపడునప్పుడే. మహాపురుషుల సద్గుణములకుఁ గూడ నిట్టివే పరీక్షలు." అదను దొరకువఱకు నందరు యోగులే! అని వేమన్న యన్నాఁడు. అట్లే బాధలు లేనంతవఱకును బ్రతియొక్కడును ధర్మప్రాణియే. ఎందుకు కాఁడు? ఒక కష్ట మేర్పడినంతనే మన పట్టుదల సికతాముష్టివలెఁ జెప్పకనే జారిపోవును. మహాపురుషు లట్లుగాదు. ఎన్ని యాపత్తులు సంఘటిల్లినను వారుఁదమ యుద్దేశ్యమును మానరు. పట్టుదలను వదలరు. కర్ణుని జీవితమున నాతని దానశూరత యెన్నియో విషమ ఘట్టములనెదుర్కొనవలసి వచ్చెను. లెక్కలేనన్ని పరీక్షలు జరిగినవి. దేని ధాటికిని నాతఁడు జంకలేదు. అన్నిటి నెదిరి నిలిచి తన దాతృత్వమును నిలిపికొనెను. అందుకే యతఁడా గుణమునకు లోకప్రసిద్ధుఁడై నాఁడు. కర్ణునకుఁ గలిగిన పరీక్షలు సామాన్యములు గావు. దేవతలే యాతనిపైఁ గసిబూనిరి. అట్టివానిలోఁ గూడ నత్యాశ్చర్యకరమైన ఘట్టమీ క్రిందిది.

అర్జునుడు దేవేంద్రుని సుతుఁడు. కరార్జునులకు బ్రబల విరోధము. కర్ణుని నర్జునుడు సులభముగ జయింపలేడని దేవేంద్రుఁడెఱుగును. కనుక నెటులైనఁ గుమారుని రక్షించుకొనవలెనని సురరాజు కోరిక. అందుచే నాతఁడ కర్ణునిలోని దానగుణము నాధారముగ దీసికొని యాతని వంచింపఁ బూనుకొన్నాఁడు కర్ణునకు జన్మసిద్ధమైన కవచ మొక్కటి గలదు. కుండలములు గూడ నట్టివే ఈ రెండును దమ తేజస్సుతో లోకమును మిఱుమిట్లు గొల్పుచుండెను. అవి శరీరమున నున్నంతవఱకు నతనిపై దేవాసురులొక్కుమ్మడి గవిసినఁ జయింపఁజాలరు. కారణమేమనఁగా నా కవచకుండలము లమృత సంభూతములు అందుచేఁ గర్ణుఁడవి ధరించి యున్నంతవఱకును నాతనికి మరణము సున్న వాని నెట్టైనను సంగ్రహింపవలెనని దేవేంద్రుండెత్తువేసెను. కర్ణునినుండి వానిని

గ్రహించుటకు మార్గ మొక్కటే. బ్రాహ్మణవేషమున రాధేయునిదరియుట, దానమడుగుట, సూర్యోపాసనా సమయమున విప్రులేమియడిగిన నాతఁడు గాదనఁడు. ఆ వేళలో నాతని సమీపించుటకే యింద్రుఁడు నిశ్చయించికొన్నాఁడు. తన మనస్సులోని యీ యూహ యెవ్వరికినిఁ దెలియకుండుటకై దేవేంద్రుఁ డెంతయో జాగ్రత్త పడెను. కాని యీ రహస్యము సూర్యునకుఁ దెలియనే తెలిసినది. తన కుమారుని రక్షించికొనుటకై దేవతాసార్వభౌముఁడు గర్ణుని సర్వనాశన మొనర్పఁ నిశ్చయించికొన్నాఁడు. ఈ విషయమునుఁ దలచినంతనే సూర్యుఁడు తహతహలాడెను. ఇంద్రుఁడుద్దేశించిన యీ తలపును గానీనునకు ముందే తెలుపవలెనని సూర్యుఁడు సంకల్పించెను. ఇంద్రుఁడు వచ్చునాటికి పూర్వరాత్రి కర్ణునకు బ్రాహ్మణుని వేషముతో స్వప్నమున సూర్యనారాయణ మూర్తి దర్శన మొసగినాడు. అతఁడు దేవేంద్రుని కాపట్యమునుఁ గర్ణునకిట్లు తెలుపబూనెను.

"కర్ణ! మద్వచనం తాత! శృణు సత్యభృతాం వర!

...... ..... .......

తస్మా ద్రక్ష్య త్వయా కర్ణ! జీవితంచే త్ప్రియం తవ.

(భా. వన. అ. 300)

"కర్ణా! నా వాక్యమును వినుము. నీయందలి సౌహృదముచే హితము నుపదేశింపఁదలఁచి వచ్చితిని. రేపు దేవేంద్రుఁడు బ్రాహ్మణవేషమున నిన్ను సమీపించును. అతఁడు కపటి. నీ కుండలములు హరించి పాండవులకు క్షేమమునుఁ గలిగించుట యింద్రుని యుద్దేశ్యము. దాన విషయమున నీ పూన్కినింద్రుఁడెఱుఁగును. యాచకులేది యర్థించినను నీవు గాదనవు. నీ యీ సద్గుణము నవకాశముగఁ గొని నిన్నాతఁడు వంచించును. ఈ విషయమును జ్ఞాపకమున నుంచికొని నాతనికిఁ గవచకుండలము లివ్వకుము. కావలసినచో నితరపదార్థము లెన్నియైనఁ

గోరుకొమ్మనుము. రత్నము లిమ్ము. స్త్రీల నొసఁగుము బహుధనములు దానమిమ్ము. అనేక గోవుల నర్పింపుము. అంతేకాని కవచకుండలముల నొసఁగరాదు సుమా! వాని నొసగిన నీకు మృత్యువు దప్పదు. వాని బలముననే నీ వవధ్యుఁడవై యున్నావు. కారణమేమనగా నవి యమృతమునుండి యుత్పన్నములైనవి. ఎటులైన నీవు వానిని రక్షించికొమ్ము". కర్ణుఁడీ మాటలు విని యాశ్చర్యపడెను. "నా విషయమున నీతని కింతటి యనురాగ మెట్లు కలిగెను? ఇది రాధేయునకు మనసులోఁ గలిగిన ప్రశ్న. సూర్యభగవానుఁ డీ విషయము నెఱిఁగెను. బ్రాహ్మణవేషమున నున్న యాతఁడిట్లు బదులొసగినాఁడు. "కర్ణా! నాకు నీపై నింతటి యనుగ్రహ మేల గలిగినదని నీ మనస్సులో నున్న ప్రశ్న. నేన బ్రాహ్మణవేషమున నున్న సూర్యుఁడను. నీకును నాకును గల యీ సన్నిహిత సంబంధమున కీశ్వరేచ్ఛయే కారణము. మన యిర్వురి సంబంధ మెట్టిదన విషయము దేవ రహస్యము. దానిని నేను నీకుఁ దెలుపరాదు. నీపై నాక స్వాభావికమైన ప్రేమయున్నది. నీ క్షేమమును గుఱించియే నిరంతరము జింతింతును. నీ కే బాధ గలిగినను నాకు గల్గునది శోకమే"! సూర్యభగవానుని యీ మాటలు గర్ణుని చెవులలోఁ బడి నంతనే యాతఁడు ద్వాదశాత్మునకు సాష్టాంగ నమస్కార మొనర్చినాఁడు. చేతులు రెండును జోడించి రాధేయుఁడిట్లు మనవిజేసినాఁడు.

"శ్రేయమేవ మ మాత్యంతం యస్య మే గోపతిః ప్రభుః

..... ...... ......

బ్రాహ్మణచ్ఛద్మనే దేవా లోకే గంతా పరాం గతిం.

(భా. వనప. అ. 300)

"స్వామీ! సర్వచరాచర నియంతయైన నీవు నా హితమునుఁ గోరుట నా భాగ్యము . నాకు క్షేమము నుపదేశించుటకై యింతదూర మఱుదెంచితివి. ఇంతకన్నను నాకు వేరేమి సంతోషముగలదు? కాని నీవుపదేశించిన ప్రకారము నేనొనర్పలేనని పలుకుటకుఁ జింతిల్లుచున్నాను. నన్ను నీవు క్షమింపవలెను. ఎవరేమి యడిగినను దానమొసఁగుట నా వ్రతము. ఇది లోక ప్రసిద్ధము. అందువను విప్రుఁడర్థించినచో నా ప్రాణములనైనను దానమొసఁగుటకు జంకను. నన్ను మోసగింప వచ్చునది దేవేంద్రుఁడే గావచ్చును. నా కవచకుండలముల దానము మరణమునే సూచింపవచ్చును. అతఁడు వచ్చునది పాండవ హితార్థమునుఁ గావచ్చును. కాని స్వామీ! యాతఁడు బ్రాహ్మణవేషముతో నఱుదెంచుచున్నాఁడు. విప్రుఁడు నాకు భగవంతుఁడు. నా ప్రాణములు గతించిన నాకు నష్టము లేదు. కీర్తి నశించిన గొప్పనష్టము. కనుక దేవేంద్రుఁడు నా కవచకుండలము లడిగినచోఁ దప్పక యొసఁగె దను. దానితో నాకు శాశ్వతమైన కీర్తి లభించును. ఇంతకన్నను నింకేమి గావలెను. కీర్తి నశించి జీవించుటకంటెను, సత్కీర్తికై నేను మరణించుటయే నాకు సమ్మతము. యశోవంతునకు స్వర్గలోకములు లభించును. యశస్వి గానివాఁడు నశించును. ఉత్తమకీర్తి మనుష్యులకుఁ దల్లివంటిది. అది వానిని సర్వకాలములందును రక్షించును. అపకీర్తి మానవునని నాశనమొనర్చును. యశశ్శాలి గానివాఁడు జీవచ్ఛవము. మానవునకు సమాఖ్యయే నిజమైన యాయుస్సు. రలోకమున నది సుఖశాంతుల నొసఁగును. ఇహమున నాయువునుఁ బెంచును. ౦ కవచకుండలములతో గొప్పకీర్తి నాకుఁగలుగబోవుచున్నది. ఆ యవకాశమును ను వదలుదునా? అందునను బ్రాహ్మణాకారమున దేవేంద్రుఁడు వచ్చిన నాతని కను భంగపఱుతునా?

నేను మరణింతునంటివి. మరణ మన్నచో నాకేమి భయము? ద్ధరంగమున జిచ్చుఱపిడుగువలె దూకుదును. ఎవ్వరు నేనాఁడునుఁ జూపని

విక్రమమునుఁ జూపుదును. శత్రువులకు భయంకరుడనై కాన్పింతును. యుద్ధమున భీరువుల కభయమొసఁగెదను. జీవింపఁగోరుచున్నవారినిఁ జంపను. వృద్ధులను, బాలురను, బ్రాహ్మణులనుఁ గష్టములనుండి రక్షింతును. వారికి క్షేమమ మొనర్తును. పోరిపోరి యశశ్శరీరుఁడనై మరణింతునా, స్వర్గమున శాశ్వతముగ జీవింతును. ప్రాణముల కంటెను నాకు యశమే యభిమతము. దేవేంద్రునకు దానము తప్పక యిత్తును. మరణము వచ్చినను నాకు దుఃఖము లేదు. దేవేంద్రునకుఁ గూడ దాన మొసఁగిన యశస్వి యన్న కీర్తియే చాలును. ఈ యవకాశమును నేను జాఱవిడువను."

కర్ణుని యీ హఠవాదమును జూచి సూర్యునకుఁగొంత కనుల జేగురించినవి. అతఁడీతని నహంకారిగాఁ దలచెను. కాని హృదయమున నున్న ప్రేమ యూరకుండనిచ్చునా? సూర్యుఁడు మరలనిట్లన్నాఁడు:

"మా హితం కర్ణ కార్షీ స్త్వ మాత్మన స్సుహృదాం తథా

... .... ....

సంగ్రామే యది నిర్జేతుం కర్ణ కామయసేzర్జునం॥

(భా. వనప. అ. 301)

కర్ణా! దానాభిమానమున నీవు గష్టములలోఁ దగుల్కొందువు. నీ మిత్రులనుఁ బుత్రులనుఁ, దల్లిదండ్రులను శోకసాగరమునముంతువు. తన్నుమాలిన ధర్మము లేదు. శరీరమును రక్షించికొనుచు మానవుడు గీర్తి నార్జింపవలెను. అంతేగాని తన జీవితమునే యుపేక్షింపరాదు. యశము శాశ్వత మనుచున్నావు. నిజమే గావచ్చును. కాని నీవు గతించిన వెనుక దానితో నీకు లాభమేమున్నది? బ్రదుకునకుఁ గీర్తి తోడుపడవలెను. యశోవంతు నంద రాశ్రయింతురు. పౌరుషవంతుండని శ్లాఘింతురు. భస్మీభూతమైన దేహమునకు గీర్తిచేఁ

బ్రయోజనమేమున్నది? చచ్చిన మనుష్యుఁడు దన యశోగానమునుఁ దాను వినలేఁడుగదా! జీవించియున్నప్పుడే కీర్తితో నుపయోగము. చచ్చిన తరువాత నేమి లాభము? శవమున కలంకార మొనర్చినచో నెవరికి సంతోషము? నీవు నాకు భక్తుఁడవు. అందుచే నీహితము నా కవసరము. భక్తికి వశుఁడనై నే నింతదూర మరుగుదెంచితిని. నా వచనము ననుసరింపుము. నీ నా సంబంధమున నొక రహస్యమిమిడియున్నదంటిని. అందుకే నీపై నాకింత యక్కఱ. ఆ సంబంధమును గూర్చి నీకు నేను దెలుపరాదు. కాలాంతరమున నీవే సముచితముగ ెలియఁగగలవు. చెప్పినమాటనే మఱలఁ జెప్పుచున్నాను. కవచకుండలము లివ్వకుము. ుచిరములైన యా కుండలములతో నీముఖ మెంతగా శోభించుచున్నది? విశాఖ క్షత్రముల మధ్యనున్న చంద్రమండలమువలె నానందకరమై యున్నది. నీ ుణ్యామగును. ఎట్టైనను దేవరాజును వెనుకకంపుము. ఆతఁడు కపటి. అతని ుయత్నము సాఁగనివ్వకుము. దేవరాజంతటివాఁడే నిన్ను మోసగింపఁ బూను ొన్నప్పుడు నీవు మాత్ర మతని నేల గౌరవింపవలెను? మహేంద్రుఁడు మాటలలో చమత్కారి. అతఁడు నిన్ను దన వాక్యజాలముతో సమ్మతింపఁజూచును. కాని నీవుగూడ నాతనికంటెనుఁ జతురుఁడవై యాతని జాలమునఁ దగుల్కొనకుము. కర్ణా! స్పష్టముగఁ జెప్పుచున్నాను వినుము. నీ కర్జునునితో ద్వేషమున్నది. ఆతనిని జయింతునని బ్రతిజ్ఞయునొనర్చితివి. నేటరేపట భయంకరమైన కురుపాండవ సంగ్రామము జరుగఁబోవును. దానిలో మీ యిర్వురకును ద్వంద్వయుద్ధము దప్పదు. ఈ కవచకుండలములు నీ కడ నున్నచో నర్జునుఁడేమి, దేవేంద్రుఁడు ాడ నిన్ను జయింపలేరు. పార్థునిచేత నిన్ను జిక్కించుటకే దేవేంద్రుఁడీ ్నాగమునుఁబన్నెను. కిరీటి దేవేంద్రుని కుమారుఁడనుట నీ వెఱుఁగని విషయము ుదు. పుత్రప్రేమచే నింద్రుఁడీ యకార్యము నొనర్పఁబోవుచున్నాఁడు. కేవలము ునగుణమను నభిమానముతో నీ ప్రతిజ్ఞను మంటగలిపికొని వ్యర్థుడవై

మరణించుట నీవంటివానికి దగదు. ఫల్గునుని జయింపవలెనను నిచ్చ నీ కున్నచో దేవేంద్రుని వెన్క కంపుము,"

రాధేయుఁడీ మాటల నన్నిటిని శ్రద్ధతో విన్నాఁడు. అతండు సూర్యభగవానునకు సాష్టాంగ నమస్కార మొనర్చెను. సూతపుత్రుఁడు సూర్యున కిట్లుత్తర మొసఁగెను,

"భగవంత మహం భక్తో యథా మాం వేత్థ గోపతే!

...... ...... .......

భిక్షతే వజ్రిణే దద్యా మపి జీవిత మాత్మనః

(భా. వనప. అ. 302)

"భగవన్! నాక్షేమమునకై నీవెంత శ్రమపడితివి? ఈ యుపకారమునకు నీకు నేనేమి యొనర్తుఁ? నీ భక్తియే నాకుఁ బ్రియమైనది. నా దారపుత్రాదుల కంటెను, మిత్రులకంటెను, నా ప్రాణముల కంటెను, నీ పాదములనే నే నెక్కువగఁ బ్రేమింతును. దేవతలుదమ్ము గొలుచువారి యెడ నత్యంతానురక్తులై యుందురు. ఇది లోక విదితమైన విషయమే! నా దృష్టిలో నీకన్నను దైవము లేడు. అందుచే నన్ను రక్షింపదలచి వచ్చితివి. గోపతీ! నీకు నమస్కారము. నీ హితబోధ కెంతయుఁ గృతజ్ఞుఁడను. కాని యొక్క విషయమున నీవు నన్ను క్షమింపవలెను. అందునను విప్రుని కోర్కెనుఁ గాదనుట నా శక్తికి మించిన పని. వారు యాచించినచోఁ నా ప్రాణముల నైనను నవ్వుచు నొసగెదను. సృష్టిలో వారంతటి మహనీయులు, భూతహితైకరతులు. వారు నా యంతఃపురమునుఁగోరినను దానమిచ్చుటకు జంకను. వారి హృదయమునఁ గాలకూట విషమే యూఱునుగాక! నా ప్రతిజ్ఞను నేను దప్పను. దేవేంద్రుఁడు దేవేంద్ర రూపమున వచ్చిన నది వేఱుకథ. అతఁడు బ్రాహ్మణ వేషమున వచ్చుచున్నాడు. బ్రాహ్మణవేషధారియైన యింద్రుడు నా జీవములే యడుగునుఁగాక ఇత్తును. కవచకుండలము లొసఁగినచోఁ గిరీటి నన్ను

యుద్ధమున జయించునని యంటిరి. ఈ విషయమున నా కంత నమ్మకము లేదు. వీనిపై నాధారపడి ఫల్గును నే నెదురింపలేదు. నా విక్రమమును నమ్మి పార్థునితో నేను పగగట్టితిని. నా దివ్యాస్త్రబలము సామాన్యము గాదని మీకుఁ దెలియును. లోకభయంకరుఁడైన పరుశురాముఁడు నా గురువు. ద్రోణులనుండి నే ననేక దివ్యాస్త్రముల గ్రహించితిని. ఈ యస్త్రాగ్నిలో నర్జునుఁ డొక శలభమువలె భస్మమైతీరును. కాని ప్రభూ! నా దాన వ్రతమును వదలలేను. యాచకుఁడైన దేవేంద్రున కవశ్యము దానమొసఁగెదను."

ఈ మాటలతో సూర్యభగవానున కెంతయో కష్టము గల్గినది. అతఁడు ర్గ్నమనస్కుఁడైనాఁడు. చివరిమాటగా దివాకరుఁడు గర్ణున కిట్లు బోధించెను: కర్ణా! నీ వెట్లును నా మాటలు వినవు. ఇక నేమి సేయదును? కాని నీ ంకొక మార్గ ముపదేశింతును. దానినైన నొనర్పుము. దేవేంద్రునకు దాన మ్ము. కాదనను. కాని యాతని నుండి వేఱొక పదార్థమును నీవు గ్రహింపుము. అనఁగా వినిమయరూపమున దాన మిమ్మని నా యభిప్రాయము. మరియొకమారు స్పష్టముగ జెప్పుచున్నాను వినుము. ఇంద్రుడు నీకడ కరుదెంచుటలో సద్భావము లేదు. అతఁడు నిన్ను సర్వనాశనమొనర్పనే వచ్చుచున్నాఁడు. కవచకుండలములు ారించి నిన్నర్జునునిచే జంపింపవలెనని యాతని యిచ్ఛ. కనుక సాధ్యమైనంత అకు నాతని వెన్కకుఁ బంపుటకే యత్నింపుము. ఎట్లును సాధ్యముగాకున్నచో వేంద్రుని కడ శక్తి యను నొక దివ్యాయుధ మున్నది. కవచకుండలములకు దులుగా దాని నర్థింపుము. అది యమోఘమైనది. దాని ధాటి కెవ్వరు నాగలేరు. నిలో మరియొక విచిత్రగుణ మున్నది. శత్రువులపై దానిని బ్రయోగించినపుడు రి నది హతమార్చును. అంతటితో నా యాయుధబల మాగదు. మరల దివ్యాస్త్రము పురందరుని కడకు వచ్చును. ఎన్నిసారులు బ్రయోగించిన న్నిసారు లది వైరుల నాశన మొనర్చి తిరిగి వచ్చుచుండును. అది నీకడ

నుండెనా అర్జునుని జయించినట్లే. ఈ విషయము మఱవకుము".

ఈ రీతి నుపదేశించి సూర్యభగవానుఁడు గనుమఱగయ్యెను. మఱుదినము దెల్లవారినది. నియమబద్ధుఁడై కర్ణుఁడు నదీతీరమున నిలుచుండి సూర్యభగవాను నర్చించుచున్నాఁడు. రాత్రి జరగిన స్వప్నవృత్తాంతము 'నిజమగునా కాదా! యని, కర్ణుఁడాలోచించుచుండెను. ఇంతలో సూర్యమండలము నుండి "తప్ప" దన్న వాక్యములు వినవచ్చినవి. ఆ పల్కులు విని దేవేంద్రునకై యెదురు సూచుచున్నాఁడు. ఈ సన్నివేశమును వ్యాసభగవానుఁ డెంతయో సుందరముగ వర్ణించెను. ఆ వర్ణన మిది:

వై శంపాయన ఉవాచ:-
"దేవరాజ మనుప్రాప్తం బ్రాహ్మణచ్ఛద్మనావృతం
..... ...... .........
..... ....... ........
తథాకృత్య ప్రదదౌ కుండలేతే కర్ణాత్తస్మాత్ కర్మణా తేన కర్ణః"
(భా. వనప. అ. 310)

కొంతసేపటికి బ్రాహ్మణ యాచకుఁడొక్కఁడు గర్ణుని కడకు వచ్చెను. అతఁడు మహాతేజస్వి. కర్ణున కాతఁడు దేవేంద్రుఁడని తెలియును, కాని యింద్రున రాధేయున కీ రహస్యము దెలియునని తెలియదు. కర్ణుఁడీవిషయము నేమాత్ర నెఱుఁగనట్లు నటించెను. నియమమునననుసరించి బ్రాహ్మణు నాతఁడు వినయ నాహ్వానించినాఁడు. అతఁడు బ్రాహ్మణు నిట్లు ప్రశ్నించెను. "తమరేవి వచ్చితిరి? శంఖమువంటి కంఠములు గలిగి సువర్ణాలంకృతలైన స్త్రీల వచ్చితిరా? యిత్తును. గోవులు గావలెనా? ఒసఁగెదను."

ఈ మాటలు విని దేవేంద్రుఁ డెలనవ్వు నవ్వెను. "కర్ణా! ం యభీష్టము నెఱవేర్చుట నీ వ్రతము, ఇది నే నెఱుఁగుదును.

విఖ్యాతుఁడైనను నీ వంటి వానికడ కరుదెంచినప్పుడిట్టి చిన్ని కోరికలతో నెవడైనను వచ్చునా? నేనొక యనర్ఘమైన వస్తువు నడుగుట కై వచ్చితిని, నా కోర్కెను విని, నీ హృదయము కంపించునేమో? నీ కీర్తి భయపడునేమో? నీవు సత్యవ్రతుఁడవు. అడిగిన దిచ్చెదనంటివి. ఆడినమాట దప్పరాదు. సహజములైన కవచకుండలము లొలిచి నాకిమ్ము?"

కర్ణుఁడనెను "బ్రాహ్మణా! భూమినిత్తును. త్రిభువన సుందరులైన సుదతుల నొసఁగుదును. గోవుల నిత్తును. కవచకుండలముల దప్ప యేది గోరినను దప్పక యొసగెదను."

కర్ణుఁడెన్ని మాటలు జెప్పినను దేవేంద్రేఁడు సమ్మతింపలేదు. రాధేయుఁడు సాంత్వనవచనము లెన్నియో పల్కెను. ఎన్ని రీతులనో యాతనిఁ బూజించెను. దేవరాజుఁడు చలింపలేదు. అపుడు రాధేయుఁడు మందహాసముతో నన్నాఁడు. విప్రవర్యా! ఈ కవచకుండలము లమృతోద్భవములు, వీని ప్రభావముచే నే నవధ్యుఁడను. ఇట్టివానిని నేను వదలలేను. వీనినిఁ దప్ప యేదియైనఁ గోరుము. కుండల రహితుఁడనైన నేను వైరులకు జిక్కెదను. నా శరీరము నుపేక్షించుట న్యాయముగాదు". ఈ మాటలకు దేనికిని దేవేంద్రుఁడు సమ్మతింపలేదు. అతని పదలను జూచి కర్ణుడు ఫక్కుమని నవ్వినాఁడు. "దేవరాజా నీవు వత్తువని నీవు వచ్చుటకుముందే నాకుఁ దెలియును. అన్యాయ మొనర్చుటకు నీకు దగదు. సమస్త భూతములకు క్షేమంకరుఁడవు గావలెను గాని నీవంటివాఁడు కపటియగుట న్యాయమా? ఈ కవచకుండలములలో నా యమృతత్వ మున్నది.వీనినే యొసఁగుమని పట్టితివి. సరే! కానిమ్ము! కాని వీనికి మారు నీవు మరియొక పదార్థమును కొసఁగవలెను,"

ఇంద్రుఁడు కొంతసే పాలోచించెను. తన రహస్యము గర్ణున కెట్లు

తెలిసినది? సూర్యుఁడు గర్ణున కెఱిగించె నన్న సత్యము దేవేంద్రుని హృదయమున భాసించెను అతఁడు దల పంకించినాఁడు. పంకించి కర్ణునితో నన్నాఁడు. "రాధేయా! అట్లేగానిమ్ము. నా వజ్రాయుధమును దప్ప నీ వేది గోరినను నొసఁగెదను." కర్ణుఁడా మాటలకు సమ్మతించెను. అతఁడు వినయమున దేవేంద్రునకు నమస్కరించి, యిట్లు బలికెను. "దేవరాజా! మంచిది. నీ యమోఘమైన శక్తిని నా కొసఁగుము. నా కవచకుండలముల నిత్తును."

దేవేంద్రుఁడు క్షణకాల మాలోచించెను. కర్ణునకు శక్తి నొసఁగుటయుఁదన సంకల్పమునకు బాధకమే. అతఁడు సూతసుతునితో నిట్లనెను. రాధేయా! నీవు గోరినట్లే. ఇందులో నొక నియమమునకు నీ వంగీకరింపవలెను. ఈశక్తి విచిత్రమైనది. నేను దీనిని శత్రువులపైఁ బ్రయోగించినప్పుడు వారిని దునిమియిది నీ కడకు మరల వచ్చుచుండును. నీ విషయమున నట్లు పనిచేయదు."

కర్ణుఁడనెను. "దేవేంద్రా! నాకున్న శత్రువొక్కఁడే? అతని జయించినచోఁ జాలును".

ఈ మాటలకు దేవేంద్రుఁ డలతిగా నవ్వెను. అతఁడిట్లువచించెను "కర్ణా! నీ యభిప్రాయము నాకుఁ దెలియును. దీనినర్జునునిపైఁ బ్రయోగిం నెంచుచున్నావు. వానిని జయించుటకు నీ చేతనగునా? వానికి రక్షకుఁడు నారాయణుఁడు. కృష్ణుఁడన్నచో నెవఁడనుకొంటివి? అతఁడపరాజితుఁడు. ఎట్లైనను గానిమ్ము. ఈ శక్తిని నీ వొక్కమారే వాడవలెను. ఎవరిపైన నీవువాడెదవో యతని నవశ్యము జంపును. కాని, మఱల నీ కడ కిది రాదు." కర్ణున వాక్యము లన్నియు సమ్మతములే యైనవి. "ఇదిగో! శక్తిని గ్రహించి కవచకుండలమ లిమ్మని" దేవేంద్రుఁడడిగెను. అప్పుడు కర్ణుఁడన్నాడు! దేవరాజా! యి కవచకుండలము లొలిచి యిచ్చినచో నా దేహము వికారమైపోవును. నా కాంత

పరాస్తమగును. నా సౌందర్యమునకు హాని గలుగును. అట్లు గాకుండ నీవు వరము దయసేయుము!"

దేవేంద్రుఁడిట్లనెను: "కర్ణా! కవచకుండలము లొలుచుటచే నీ కేమాత్రమునుఁ దేజోహాని గలుగదు. వ్రణరేఖలు గూడ నుండవు. ఇది నా వరము. ఉదాత్తమైన నీ మనస్తత్త్వమునకు నేను జాల సంతసించితిని. కవచకుండలములు పోయినను దేహము సూర్యకాంతి గలిగి వెలుగుచుండును. దీన సందేహము లేదు. కర్ణా! నే నొసఁగిన శక్తి విషయమై మరియొక్క సంగతి నీకుఁ దెలుపవలసి యున్నది. నీ సర్వాయుధములు వ్యర్థము లైనప్పుడే దీనినిఁ బ్రయోగింపవలెను. అట్లుగాక ఇతరాయుధములు సమర్థములై యున్నను త్వరపడి దీనినిఁ బ్రయోగించితివా! శక్తి నీకే యపకారమొనర్చును. మఱియొక విషయమునుఁగూడ జాగ్రత్తగ ము. ఈ శక్తిని సర్వవిధముల నీకన్న గొప్పవాఁడైన శత్రువుమీదనే యోగింపవలెను. వివేచనదక్కి నీకన్న దుర్బలునిపై నుపయోగించితివా? ఇది ఎదిరిగి నిన్నే నాశన మొనర్చును. ఇది దివ్యాయుధము. ఈ రెండు నియమముల ల్లంఘించుట దీని నవమానపరచుట!"

"సరియైన వివేచనతోనే దీని నుపయోగింతు" ననియు "నధికులపైననే ాగింతు"ననియు రాధేయుఁడు మాటయొసఁగెను. దేవేంద్రుఁడు యుధమునుఁ గర్ణున కందించినాఁడు. వెంటనే కర్ణుఁడొక తీక్ష్ణ శస్త్రమును ు తన శరీరమును ఛేదింప మొదలువెట్టెను. అప్పుడాతని కసహ్యమైన ు గలిగినది. కాని యావదనముపై గాసంత వికారముగూడఁ గలుగలేదు. త్తరమైన కర్ణుని యీ దానశీలతను జూచి గంధర్వాదులైన దేవతలు సంతోషపడి జయాకారము లొనర్చిరి. దేవలోకమున దుందుభులు మ్రోగినవి. కర్ణునిపైఁ వృక్షమును సుమములు రాల్చెను. లోకోత్తర త్యాగధనుఁడైన కర్ణుఁడు

రక్తభరితమైన కవచమును దేవేంద్రున కందించినాఁడు. కర్ణములనుండి కవచములను ఛేదించియొసఁగెను. ఈ త్యాగముచే నాతఁడు గర్ణుఁడైనాఁడు. దేవేంద్రునకుఁ బార్థుని గురించి యున్న మనశ్శల్యము దొలగెను. వ్యావహారికదృష్టితోఁ బురందరుఁడు గర్ణునకు మోసమునే యొనర్చెను. కాని వివేచనాదృష్టితో నీ కార్యము లోకక్షేమకరమైనది. ఈ పని యొనర్చుటలో దేవేంద్రుఁడొకసారి రాధేయుని కీర్తిదుందుభిని మ్రోయించిన సేవకుఁడే యయ్యెను.

## కర్ణుని సహనశీలత

ఆతని దానశూరతవలెనే సహిష్ణుతయును లోకోత్తరమైనది. పరశురాముని కడ నీతఁడు విద్య నభ్యసించుచుండెను. అపుడాతనిసహనశీలతకు ఘోరమైన పరీక్ష సంఘటిల్లినది. ఈ విషయము భారతమున నిట్లు వర్ణింపఁబడెను

"తత: కదాచి ద్రామస్తు చరన్నాశ్రమ మంతికం

..... ..... ......

..... ...... ......,

రోమభి స్సన్నిరుద్ధాంగ మలర్కం నామ నామత:

(భా. శాంతి. అ. 3)

పరుశురామునికడఁ గర్ణుఁడు విద్య నభ్యసించుచు నంతేవాసియై యుండెను. పరుశురాముఁ డుపవాస కర్శితుఁడు. కర్ణుఁడు గూడనంతే. రాధేయునిపై జామదగ్న్యున కమితప్రేమ. ఒకానొకనాఁడు శిష్యుని తొడపై శిరస్సునుంచి పరశురాముఁడు నిద్రించెను. ఇంతలోనే యొక పురుగటకు వచ్చినది. దాః కాహారము శ్లేష్మ మేదో మాంస శోణితములు, ఆ క్రిమియొక్క రూపవే భయంకరముగనుండెను. దాని స్పర్శదారుణము! ఆ క్రిమి కర్ణునియొక్క తొడనెక్కి తొలువ నారంభించెను. రాధేయున కా బాధ దుస్సహముగ నుండెను. కాని

యాతఁ డూరువునుఁ గదలింపలేదు. గురువునకు నిద్రాభంగ మగునని యాతని భయము. ధైర్యహేమాచలుఁడై సూతపుత్రుఁడా బాధను సహించెను. పురుగు వేగముగఁదొడనుఁ దొలిచినది. కొంతసేపటికి కర్ణుని యూరువునుండి దొఱఁగిన యుష్ణరక్తము పరుశురాముని శరీరమునకు దగిలెను. అతనికి మెలకువ యైనది. రక్తధారతోఁ దడిసి దయనీయావస్థలో నున్న రాధేయుని విలోకించి పరుశురాముఁ డిట్లన్నాఁడు! "వత్సా! రక్తస్పర్శతో నే నశుద్ధుఁడనైతిని. ఈ సన్నివేశ మెట్లు జరిగినదో చెప్పుము."

కర్ణుఁడాతనికి జరగిన దంతయుఁ జెప్పెను. తెలిపి యా కీటమునుఁ జూపినాఁడు. అది సూకరాకృతితో నున్నది. అష్టపాదము. తీక్ష్ణ దంష్ట్రము. దాని రోమములు సూదులవలె నున్నవి. ఒడలినిండ రోమములే. దాని పేరలర్కము.

## కర్ణుని సమయజ్ఞత

రాధేయుని సహనశీలతను జూచి పరుశురాముఁ డాశ్చర్యపడెను. దీనితోఁగడకుఁ గర్ణునకుఁ గలిగిన లాభమేమి? గురువొసఁగిన శాపము! దాని ాతఁడు "మహాప్రసాద" మని స్వీకరించెను. అతఁడు దన సమయజ్ఞతను ుతమున ముఖ్యముగ మూఁడుసారులు ప్రదర్శించెను. మొదటిసారి యాతని ుయజ్ఞత భాసించినది పాండవులు రాజసూయయాగ మొనర్చిన సమయమున. ుడు కౌంతేయులు దిగ్విజయమునకు నడచిరి. భీముఁడు గర్ణుని పై కెత్తి ్చెను. కర్ణుఁడాతని నెదిర్చి ముష్కరముగ బోరాడలేదు. మహాభిమానియైన డు పాండవులకు "మాండలికుఁడ" నౌదునని సమ్మతించెను. రాధేయుఁ ు యొనర్చెను? భీముడు గర్ణుని కొలఁదికి మీరినవాఁడు గాఁడు. కాని ుప్పట్టి పరిస్థితులను మనము కొంత గమనించినచో సూతపుత్రుఁ డొనర్చిన ూ పనియందెంతయో యౌచిత్యమున్నదని తోచును. ద్రౌపదీ స్వయంవరానంతరము

పాండవులు మునుపటివారు గారు. వారి కెంతయో బంధుబల మేర్పడినది. కర్ణుఁడు గృష్ణుని బాగుగ గమనించినాఁడు. అతఁడొక యద్వితీయమగు దైవవిభూతియని రాధేయునకు స్పష్టముగఁ దెలియును. కౌంతేయులు గృష్ణున కాశ్రితులగుటచే యాదవులందరును వారి పరమైనారు. యాదవ గణరాజ్యము లాకాలమున మహా పటిష్ఠములు. ఈ సాధన సంపత్తులతోఁ బాండవులు చాల ప్రబలులైరి. ధృతరాష్ట్రుని యాజ్ఞచే వా రింద్రప్రస్థమునుఁ జేరిరి. నేఁడు వారి దొక స్వతంత్రరాజ్యము. కృష్ణుని సాయముతోఁ బాండవులు మహాసామ్రాజ్య నిర్మాణము గావింప నిశ్చయించికొన్నారు. దానికై చేసిన యత్నమే రాజసూయము, రాజులనందఱను గెలువనిది రాజసూయ మొనర్చుటకు వీలులేదు. రాజసూయ యజ్ఞకరణమనగా సామ్రాజ్య నిర్మాణమనియే యర్థము. పాండవుల దిగ్విజయమునక ముఖ్యముగ నడ్డు దగిలినవాఁడు జరాసంధుఁడు. ఆతని సైన్య సంపత్తి, బలసంప యద్భుతావహమైనది. సమకాలికు లెవ్వరు నాతనివైపు దేరిచూడ వెఱచుచుండి కృష్ణుఁడు మగధేశ్వరు నోడించుట కొక క్రొత్త పన్నాగమునుఁ బన్నెను. కృష్ణభీముఁ బ్రాహ్మణవేషముతో మాహిష్మతీ పురమునుఁ బ్రవేశించిరి. బ్రాహ్మణ యాచనః జరాసంధుఁడు "గానిమ్మ"న్నాఁడు. అప్పుడాతనికి వీరెవ్వరో తెలిసినది. కృష్ణునిత బోరుట దన విక్రమము నవమానించుటయే యని జరాసంధుఁడెంచె వాసుదేవుఁడంతకుముం దెన్నియో సారులు మగధరాజునకు మొగము దప్పిం పారినాఁడు. అందుచే జరాసంధుఁడు భీము నాహ్వానించెను. వారిర్వురకు మల్లయుః మారంభమైనది. దానిలో భీముఁడు జరాసంధుని జీల్చివేసెను. ఈ వార్త విన్నంతనే యంతకుముందుఁ బాండవుల నెదిరింపఁదలంచిన రాజుల గుండెలు దద్దరిల్లినః పాండవుల కీర్తిపరిమళము దిగంతములకు వ్యాపించినది. ఈ యవకాశమును జక్కగా వినియోగించికొని యుధిష్ఠిరుఁడు దక్కిన రాజులను భయపెట్టి సామంతులుగఁ జేసికొన్నాఁడు. జరాసంధుని మృత్యు వార్త గర్ణున కాశ్చర్యమునే

గలిగించెను. ఇంతేగాదు. యాదవులు పాండవులకు వత్తాసి. దేశములోని రాజులందఱు నేఁడు పాండవులకు సామంతులు. తా నిపుడు కౌంతేయు నెదిర్చి నిల్చినచో యాదవులును, భూమండలములందలి రాజకులములును, సంఘటితములై తనపైఁ బడును. ఈ విషయము లన్నిటి నాలోచించికొని కర్ణుఁడు దన పట్టుదలను సడలించికొనెను. ఇది యాతని గొప్ప సమయజ్ఞత.

ఇట్టి సన్నివేశమే మఱియొకటి కర్ణుని దిగ్విజయమునఁ గూడ జరగినది కర్ణుఁడప్పుడు రాజులనందఱను జయించినాఁడు. యాదవులజోలికి బోలేదు. సాంత్వనములాడి వారిలో మైత్రి యొనర్చికొనెను. అతఁడప్పుడేమాత్రము యాదవులపై విక్రమించినను వారందఱొక్కుమ్మడి కర్ణునిపై గవిసియుందురు. పాండవుల వనవాసమును గూర్చి యాదవుల కప్పటికే కౌరవులపై గసియుండెను. కనుక కర్ణుని వారు సులభముగ దాటి పోనివ్వరు. వీని నన్నిటిని గమనించిన రాధేయుఁడు యాదవులతో ఢీకొననే లేదు.

అన్నిటికన్న నాతఁడు ప్రదర్శించిన గొప్ప యౌచిత్యము ద్రోణపర్వమున. భీష్ముఁడు యుద్ధమున నోడినాఁడు. భీష్మపతనావధి రాధేయుఁ డస్త్రసన్యాస మొనర్చెను. గాంగేయుఁడు పడుటయే తడవు కర్ణుఁడు రణరంగమునకు నడచునని సైనికులకు స్పష్టముగఁ దెలియును. భీష్ముని తరువాత రాధేయుఁడే సేనాధిపత్యమునకుఁ దగినవాఁడని సైనికుల విశ్వాసము. వారి కాతనిపై నున్న ప్రేమగౌరవములకు మితిలేదు. సైనికులు వెంటనే సూతపుత్రునుద్దేశించి జయకారములుగొట్ట నారంభించిరి. దుర్యోధనునకుఁ గూడ రాధాసుతునే సేనాపతిగ నొనర్పవలెనను తలఁపు. భీష్ముఁడు శరతల్పగతుఁడైనంతనే రాధేయుఁడు ధనస్సునుఁ గదలించినాఁడు. ఆతఁడు ఖడ్గమును ఝుళిపించెను. దుర్యోధనుఁడు మొదలుకొని సైనికులందఱు దన యాధిపత్యమునే కోరుచున్నారని కర్ణుఁడెఱుఁగును. కానియతఁ డాలోచించినాఁడు. "కురు సైన్యమున దనకంటెఁ బెద్దలెందరో గలరు. వారిని నిరాదరించి కురురాజు

నాదరముఁ బురస్కరించుకొని దాను సేనాపతియగుట నీతిజ్ఞత గాదు. అపుడావరిష్ఠుల కందఱకునుఁ దనపై మచ్చరము గలుగును. మాత్సర్యదష్టులైనవారు కురురాజు క్షేమమునకై మనసారఁ బోరాడక పోవచ్చును." ఈ విషయములన్నియు నాలోచించి అయత్న సిద్ధమైన యధికారమునుఁ గూడ కురురాజు క్షేమమునకై కర్ణుఁడు గాలఁదన్నెను. ఇంతమాత్రమే గాదు, అతఁడింతకన్న నొక గొప్పపని యొనర్చినాఁడు. "ఎవరిని సేనాధిపతి నొనర్చినచోఁ గురువీరులు మాత్సర్యము దొఱఁగి యాతని యధికారమును మన్నింతు" రని రాధేయుఁడు దీవ్రముగ నాలోచించినాఁడు. ఆతని బుద్ధిలో మెదలాడిన వారు ద్రోణాచార్యులు. కాని ద్రోణు లెప్పుడునుఁ గర్ణునసహ్యించికొన్న వారే! ఒకసారియైన నాతఁడు రాధేయుని "మంచి' ' యనలేదు. ధార్తరాష్ట్రుల క్షేమమునకై సూతపుత్రుఁడు వైయక్తికమైన ద్వేషమును హృదయమునఁ దొలఁగించికొని తాను ముఖ్యముగ నిలచి ద్రోణాచార్యులకు సేనాధిపత్యమునకు సన్నాహము లొనర్పఁజేసెను. ద్రోణుఁడే సేనాధిపతి గావలెనను నిర్ణయమునకు దానెందుకు వచ్చెనో కర్ణుఁడే యిట్లు దెలిపినాఁడు:

కర్ణ ఉవాచ:-

సర్వ ఏవ మహాత్మాన ఇమే పురుషసత్తమా:

..... ...... .......

..... ...... ......

జిగీషంతో z సురాన్ సంఖ్యే కార్తికేయ మివామరా:

(భా. ద్రోణప అ. 5)

కురురాజా! ఇటఁ జేరిన వీరులంద ఱసామాన్యులే! ప్రతి యొక్కరు గూడ సేనాధిపత్యమునకుఁ దగినవారే! అందరును కుల సంహనన జ్ఞానయుక్తులు. బల విక్రమ సంపన్నులు. శ్రుతిజ్ఞులు. ధీమంతులు. అపరాజితులు. కాని యంద

రొకటేసారి సేనాధిపతులగుట సంభవింపదు గదా! విశిష్టగుణములు గల యెవఁడో యొకఁడధికారియై తక్కినవారిని నడుపవలెను. ద్రోణులు దప్ప యెవ్వరధికారియైననుఁ గురువీరులలో మాత్సర్యములు రేగును. అపుడు వారు ప్రాణములకుఁ దెగించి పోరాడరు. అది నీకు నష్టము. ద్రోణులు సర్వుల కాచార్యుఁడు. వయోऽధికుఁడు. అఖండ విక్రముఁడు. అతఁడు నేతయైనచో మరియొక్కఁడా పదవి కాసింపఁడు. శుక్రాంగారకులతో సమానుఁడైన ద్రోణులనుఁ బోలువాఁడెవ్వడున్నాఁడు? అతఁడు బుద్ధిమంతులలో బుద్ధిమంతుఁడు. విశేషించి మన కందఱకును గురువు. అతని నధిపతిగ నొనర్పుము. కార్తి కేయు ననుసరించి నడచు దేవసైన్యమువలె మనము ద్రోణచార్యులనుఁ బరివేష్టించి కౌంతేయులపై కెత్తుదము.

## కర్ణుని నిర్మలాంతరంగము - గుణ గ్రాహకత్వము

రాధేయుఁడు పైకెంత ధూర్తుఁడుగ గనపడునో హృదయమున నంత గుణగ్రాహి. ఇతరులలోని సద్గుణముల నన్నిటి నాతఁడు చక్కగా గమనించును. అవకాశము గలిగినపుడు వానిని వచించి తీరును. కర్ణార్జునుల వైరము లోకప్రసిద్ధము. "అర్జునుని వధింతు" నని రాధేయుడు మాటి మాటికిఁ బలుకుచుండెను. ఇంత యున్నను పార్థుని గొప్పతనము నాతఁడు గ్రహింపకపోలేదు. పాండవుల సద్గుణములు గర్ణునికిఁ దెలిసినంత మరెవ్వరికినిఁ దెలియదు. ఇంత మాత్రమే గాదు. అవకాశము వచ్చినపుడంతయుఁ దనకు వారిపై నున్న గౌరవమునుఁ గర్ణుఁడు ముక్తకంఠమున వెల్లడించినాఁడు. శల్యునియెదుట రాధేయుఁడు గిరీటి నెంతయో బొగడెను. "యుధిష్ఠిరునివంటి ధర్మాత్ముఁడు లే"డని శ్రీకృష్ణునితో స్పష్టముగఁ జెప్పినాఁడు. భీష్ముఁడు బ్రదికి యున్నంతకాలము కర్ణున కాతనితో నెప్పుడుఁ బగయే. "కురుకులాధముఁ"డని గాంగేయు నాతఁడెన్నియోసారు లధిక్షేపించెను. కాని, శాంతనవుఁడు శరతల్పగతుఁడైనంతనే కర్ణుని ద్వేషమంతయు

మాయమయ్యెను. అతఁడాతని నెంతయో గౌరవింప మొదలిడెను. మృత్యువునకున్న విలక్షణ శక్తియే యది. బ్రదికినప్పు డొక్కనిని మన మెంత ద్వేషించినను జచ్చినవెంటనే వాని సద్గుణములను లెక్కింప నారంభింతుము. రాజర్షియగు భీష్ముడును, దాన వీరుఁడగు కర్ణుఁడునుఁ బరస్పరమెన్నియోసారులు దూలనాఁడికొన్నారు, వారి యధిక్షేపములు వాడి ములుకులకంటెను వేడియైనవి. కాని యీ యధిక్షేపముల వెనుక వారికి బరస్పర మెంతయో గౌరవముండినది. కర్ణుఁడు గాంగేయుని ప్రభావము నెంత గమనించెనో యంతగానే భీష్ముఁడు గూడ కర్ణుని గొప్పతనమును గ్రహించెను. ఈ సత్యము గాంగేయ శరతల్ప పతనావసరమున వ్యక్తమైనట్లు మఱియొండు తావున వ్యక్తముగాలేదు. జీవనము సంకులమైనది. దానిలోఁ బ్రముఖముగఁ నిలుచునవి వైయక్తికములైన లాభాలాభములు. వానియొక్క కల్పనలు, తత్కృతములైన పరిణామములు. కనుక యెంత గొప్ప వాఁడైనను వానికి జీవనముతో సంబంధ మున్నంతవఱకు, రాగద్వేషములఁ దొలగి నిలచుట యసాధ్యము. అట్టిచో వాని భావములు వికారహీనములై యుండు టసంభవము. కాని మృత్యు వెంతయో గొప్పది. సత్య మప్పుఁ గడ్డకు వచ్చును. జగత్తునుండి శాశ్వతముగ మానవుఁడు సెలవు దీసికొ పోవునప్పుడు వానికి వైయక్తికములైన లాభానష్టములతో సంబంధమేమున్న అపుడు దత్కృతములైన కల్పనలు, పరిణామములు, వానికి దూరములు. సమయమున నావ్యక్తి స్వచ్ఛముగ నాత్మస్వరూపుఁడై ప్రకాశించును. స్వరూపము రాగద్వేషహీనమై వికారహీనమై నలుగురకునుఁ బ్రత్యక్షమ ఆర్య సంస్కృతి యీ యుపదేశమునే యొనర్చును. ఒకానొకఁడు మరణి తరువాత గూడ వానిపై బగ సాధించునృశంసవృత్తిని భారతీయ సంస్కౄ క్షమింపదు. ఆర్యజాతి కట్టి మనోవృత్తియే దూరము. అనార్యులు, అస రాక్షసులు, మ్లేచ్ఛులు యీ చిత్తవృత్తిని బ్రేమింతురు. తనువు త్యజించిన !

రావణునివంటి యపకారినిఁ గూడ రామచంద్రుఁడు ద్వేషింపలేదు. వాని ప్రతాపము, వానిగొప్పతనమే యాతని నేత్రముల యెదుట భాసించెను. భీష్మ కర్ణు లిర్వురును మహామనస్కులైన యార్యయోధులు. వారికి క్షుద్రభావము లెట్లుండును?

భీష్ముని పతనమును విన్నతోడనే కౌరవసైనికులలో హాహాకారములు సెలరేగినవి. వారెంతయో దురపిల్లిరి. అట్లు దురపిల్లిన వారిలో రాధేయుఁడే ముఖ్యుఁడు. గాంగేయుని వంటి యుగపురుషుఁడు మరణశయ్యపై నున్నపుడు దర్శించుకొని వచ్చుట దన విధ్యుక్తధర్మమని యతఁడు భావించెను. కర్ణుఁడు వెంటనే రణరంగమునకు వచ్చినాఁడు. భీష్ముని పాదములకు మ్రొక్కి 'తన్ను క్షమింపు' మని వేడికొనెను. గాంగేయునితో సెలవుగైకొని మరలునప్పుడు సూతపుత్రుని ముఖమంతయు బాష్పసిక్తమై పోయినది, వేడినిట్టూర్పులు వెడలెను. గాంగేయుడు తపోమూర్తి. అవతారమెత్తిన ధర్మము, ఆజన్మబ్రహ్మచారి. ఇచ్ఛామరణము గలవాఁడు. అజేయుఁడు. అట్టివానికిఁ గూడ మృత్యువు దప్పలేదు. ఇఁక నీ లోకమున నెవరిది శాశ్వత మను భావము రాధేయుని హృదయమున నిండికొన్నది. భీష్మపతనముతో దుర్యోధనాదుల జయాశయుఁబతనమైన ట్లాతనికిఁ దోచెను. భీష్ముఁడు పడినవెంటనే కౌంతేయ సేనావారములోఁ గలకలములు బయలుదేరినవి. వారు కౌరవుల నవహేళన మొనర్చిరి. కర్ణుఁడు వీనినంతయుఁ బ్రత్యక్షముగఁ జూచెను. "ఇక మిగిలినవాఁడు గర్ణుఁడే! వానినిఁ గూడఁ బొరిగొందు" మని యాసైనికు లఱచుచుండిరి. ఈ మాటలు వినియు వినిపించికొనక రాధేయుఁడు దన శిబిరమునకుఁ బోయెను. మఱుదినమున నాతఁడు రథమును, ధనుర్బాణములను సిద్ధ మొనర్చికొని యుద్ధోద్యతుఁడైనాఁడు.

మఱల నొకసారి భీష్ములను దర్శించి యాతని యాశీర్వాదములనుఁ బొందవలెనని రాధేయునకు బుద్ధి పుట్టినది. శాంతనవుఁడు శరతల్పగతుఁడై యున్నయెడకుఁ గర్ణుఁడు వచ్చెను. అతఁడు రథముదిగి వినయమున భీష్ముని

పాదములకు నమస్కరించినాఁడు. అపుడాతఁడు వెక్కి వెక్కి యేడ్చెను. కడకుఁ గర్ణుఁడు భీష్ముల కిట్లుమనవి యొనర్చెను.

"అభివాద్యాంజలిం బద్ధ్వా వందమానోऽ భ్యభాషత

...... ..... .....

క్షత్రియాంతకరో ఘోరో దేవదానవదర్పహా.

(భా. ద్రోణ ప. అ. 3)

భారత పితామహా! వీఁడు గర్ణుఁడు. నీకు క్షేమమగుగాక! కన్నులెత్తి నావైపుఁ జూడుము. ఉదారముగ భాషింపుము. నీవంటివాఁడు గూడ రణమునందుఁ బడుట! ఇకఁ బ్రపంచమునఁ బుణ్యాత్ముఁడైనవాఁడు దన సుకృతమునకు ఫలము నందుననుటలో సత్యమేదీ! మహాత్మా! కోశసంచయనమందును, మంత్రవ్యూహవ లందునుఁ బ్రహరణలములందును నీవంటివాఁడు మఱి లేఁడు. రణమంద శత్రువుల ననేకుల వధించి నిశ్చింతగఁ బితృలోకములకుఁ బయనించుచున్న మహాత్మా! నీకు నమస్కారము".

"నేటినుండి పాండవులు జింకలపైకి వ్యాఘ్రములవలె విజృంభింతురు కురుకులక్షయము తప్పదు. నేటినుండి ఫల్గునుని గాండీవఘోషము కౌరవుల హృదయము లగలించును. దేవేంద్రున కసురులవలె వీరందరాతనికి భయపడి పరువెత్తుదురు. గాండీవమునుండి పిడుగులు రాలి కౌరవసేనావారమును నాశన మొనర్చును. సమిద్ధమగు నగ్నిలో ద్రుమములవలె నర్జునుని బాణాగ్నిజ్వాలలకు వీరులు దహించుకొని పోవుదురు. వాయువుతోఁ జేరిన యగ్నివలెఁ బార్థుఁడు విక్రమించును. అర్జునుఁ డగ్నివంటివాఁడు. సందేహములేదు. వాయువువలె వాసుదేవుఁ డాతనికిఁ దోడయ్యెను. కృష్ణుని పాంచజన్య నినాదమునకునుఁ బార్థుని గాండీవారావమునకునుఁ గౌరవ సైన్యములు కలగుండువడి తీరును. అర్జునుని

రథముపై నుండి లేచి దుముకుచున్న హనుమంతుని విక్రమము ధార్తరాష్ట్రులకు దుస్సహమగును. కపిధ్వజ నినాదము మా గుండె లగలించును. నీవు వోయిన వెనుకఁ గిరీటి నెదిరించువా రెవరున్నారు? అతఁడు దేవసన్నిభుఁడు. సంగ్రామమున ఫాలాక్షుని గూడ నోడించినవాఁడు. ఈశ్వరునిచే వరములు సంపాదించికొన్నవాఁడు. నీకే యాతని గెలుచుట డెప్పర మయ్యెను. పరుశురాముని గెలిచిన బాహుబలశాలివైన నీకుఁ గూడ లోబడని యర్జునుఁ డిఁక నెవ్వరికోడును?"

ఈ విలాపములు గర్ణునకు భీష్మునిపైగల గౌరవము నెంతయో స్పష్టపఱచుచున్నవి. అంతమాత్రమే కాదు. అర్జునునిపై రాధేయున కెట్టి భావము త్యముగ నుండెనో యీ కథాభాగము దెల్పును. ప్రతిపక్షియైన పార్థుని ుణములనింతగా గుర్తించుట గర్ణుని సౌజన్యమే. హృదయవైశాల్యమే. ఇందులో ందేహములేదు. భీష్ముని పతనానంతరము సైనికుల చూపులన్నియు రాధేయుని ునే పడినవి. ఈ విషయము గూడ నాతని గొప్పతనమునే సూచించును. ఈ సన్నివేశమున వేదవ్యాసులిట్లు బలికిరి:

"ఏవం తేస్మహి రాధేయం సూతపుత్రం తనుత్యజం.

...... ...... ......

త్రిదశానివ గోవిందః సతతం సుమహాభయాత్॥

(భా. ద్రోణ ప. అ. 1)

ఈ రీతిఁ గర్ణునిలో ననేకములైన లోకోత్తర సద్గుణములుండెను. కాని ాభమేమి? ఇంతటి యుదాత్తుఁడు గూడ జగత్తున కపకారకుఁడుగఁ బరిణమించెను. ఒకానొక గొప్ప రాష్ట్రక్షేమమును నిర్మూలించుట కుద్యుక్తుఁడైనాఁడు. స్వార్థము, అహంకారము యీ రెండునుఁ బెరిగి యతని సర్వసద్గుణములను మ్రింగివేసినవి. అతనిలో నింతటి స్వార్థబుద్ధి యెందుకుఁ బెరిగెను? అది దైవికము. అతని

యితర గుణములను లెక్కింపక లోకము రాధేయుఁడని యవమానించెను. ఆ యవమానమే కర్ణునిలో స్వాతిశయమును స్వార్థమునుఁ బెంచెను.

## స్వార్థము - లేక - స్వాతిశయము

కౌరవ పాండవు లిరువురకును ద్రోణుఁడు ధనురాచార్యుఁడు. వారంద ఱాతనికడఁ జిన్నతనమున శస్త్రవిద్యాభ్యాస మొనర్పుచుండిరి. వీరు మాత్రమే గాదు, మఱికొందరు క్షత్రియ కుమారులు గూడ ద్రోణులకడ నుండిరి. కర్ణుఁడును ద్రోణుల దరిసినాఁడు. అతఁడును ధనుర్విద్యాలయమున నొక విద్యార్థి. ఆ కాలముననే విద్యార్థులలో రెండు జట్టులేర్పడియుండెను. ఒకటి పాండవులది. మఱియొకటి కౌరవులది. ఈ రెండును ద్రోణులేర్పరచినవి గావు. విద్యార్థులే దమతమ శీలమునకుఁ దగినట్టు లేదో యొక గుంపులోఁ జేరెడువారు. వీనిలో నొకదానిపై మరియొక దానికి ద్వేషభావములు లేకున్నను నసూయాస్పర్ధలుమాత్ర ముండెడివి. ద్రోణుల విద్యాలయమునఁ బాండవులు దమ తేజోవిశేషముః నక్షత్రములవలెఁ బ్రకాశించుచుండిరి. యుధిష్ఠిరుని బుద్ధి, సమయజ్ఞత, గాంభీర్యమ చూపఱుల నెల్ల నాకర్షించుచుండెను. భీమున కమానుషసామర్థ్యముండెను. పార్థుని ధనుర్విద్యా ప్రభావము నలుగురి నోటఁదాండవింపఁ జొచ్చినది. నకులుని సౌంద వినయములు, సహదేవుని ఖడ్గవిద్యాచాతుర్యము, శాలీనత యందఱి మెప్పుఁ దగి యుండెను. తమ్ములందఱన్నమాటను గౌరవించుచుండిరి. వీరిలోని యి సద్గుణ పరిమళములు విద్యాలయమునందంతయు వాసించినవి. అచ్చటికి వచ్చిన పెద్దలందఱు పాండవుల సుగుణము లెంతయో మెచ్చుకొనుచుండిరి. అందునన ఫల్గునుని విద్యాచాతుర్య మందరినాశ్చర్యచకితులఁ గావించెడిది. ద్రోణులకుఁ బ్రధానశిష్యుఁ డాతఁడే! ఆచార్యులాతని బుత్రునికంటె నెక్కువగఁ బ్రేమించుచుండిరి. అగుటచే వారతనిపై ధనుర్విద్యా రహస్యములను వర్షించెడివారు. ఈ రీతిఁబార్థు

డందరినేత్రముల నాకర్షించుచుండుటచే విద్యార్థులెందఱో యాతని బరిచయమునకై దహతహలాడుచుండిరి. కలసిమెలసి తిరుగుచుండిరి. పార్థునిపైఁ గొందఱికి కసూయయుండెడిది. ఇది రెండు తెఱఁగులుగ నుండెను. కొందఱెట్లు చూచిననుఁ బార్థునిఁ బోలలేని వారు. వారి యసూయ యసామర్థ్యము చేతఁ గలిగినది. మఱికొందఱుండిరి. వారస్త్రవిద్యలో నర్జునుని కన్ననుఁగొంత క్రిందివారు. కాని వారి యహంభావము మాత్రము వచ్చిన విద్యకంటె నూఱుమడుఁగు లెచ్చు. వారు గవ్వడి యాధిక్యమునకు పమ్మతించెడివారుగారు. వారి కాతనిపై నసూయయు, గుప్తద్వేషమును. ఇట్టి వారిలో నగ్రనాయకుడు దుర్యోధనుఁడు. అతనికిఁ బాండవులపైఁ గ్రోధమాత్సర్యము లుండెను. తాను వారికంటె నధికుఁడను ˘హంభావము గూడ. పాండవులపై నట్టి యభిప్రాయము గల క్షత్రియకుమారు ˌదఱును దుర్యోధనునితోఁ జేరిరి. సరిగా నీ తరుణముననే కర్ణుఁడా ᵒవిద్యాలయమునఁ బ్రవేశించెను. కర్ణుఁడెల్ల విధముల సమర్థుఁడు. కాని ˚తని జన్మ హీనమైనది. అందుచేఁదనకు క్షత్రియకుమారులలో సమానమైన రవము లభింపదని కర్ణునకు గూఢమైన పరితాపము. ఈ భావమాతనికిఁ చిన్ననాడే కలిగెను. అడుగడుగున నీ తాపమాతని హృదయమును ంచుచుండెను. ఈ భావ మాతనిలో స్వాతిశయమునకు లేక స్వార్థమునకు ౨ తీసినది. ఇతరులకువలెనే తనకు సామర్థ్యమున్నది. ఇంక నొక మాత్ర ుక్కువయే గద్దు. ఇట్టిచో సమాజము దన్నేల యవమానింపవలెను? తన ్మమునుఁ బట్టియా? అందులకుఁ దా నెట్లు బాధ్యుఁడు? ఈ విషయము ˚తని నెల్లపుడు కలఁచినవి. సంఘము దనపై నొనర్చెడి యత్యాచారముల ,రికట్టవలెనను ప్రతీకారబుద్ధి యొకటి రాధేయుని హృదయమున రూఢమయ్యెను. ఎన్ని శక్తులలోఁ దక్కిన వారికంటె నగ్రేసరుఁడు గావలెను. ఇది యొక్కటే ఎన యస్తిత్వమును నిరూపించికొనుటకు మార్గము. ఈ భావములతో నాతఁడు

విద్యాలయమునఁ బ్రవేశించినాఁడు. విద్యాలయమునఁ బ్రవేశించినంతనే పాండవుల కీర్తి యాతనిచెవులఁ బడెను. పార్థుని ధనుర్విద్యాలాఘవ మాతని భావమునకుఁ దెబ్బగొట్టెను. ధనుర్విద్యయందుఁ గిరీటిని మించనిది తన గౌరవము నిలువదని రాధేయుఁడు నిశ్చయించికొన్నాఁడు. ఈ భావమును హృదయమందే యతఁడు దాచికొనెను. ద్రోణుల విద్యాలయములో నీతనిని గౌరవించిన వారును లేరైరి. కారణ మేమనఁగాఁ దాను సూతపుత్రుఁడు. ఈ యవమాన మతనినిఁ బ్రతిపదమునను దహించినది. ఎటులైనను ఫల్గునుని గెలువవలెనని కర్ణుఁడాకాంక్షించుచుండెను. దుర్యోధనానుయాయులకుఁ బాండవులపై ద్వేష మేర్పడి యుండెనంటిమి. అతఁడు వారితోఁ జేరెను. ఈ కథ భారతమున నిట్లు గలదు-

"సూతపుత్రశ్చ రాధేయో గురుం ద్రోణ మియత్తయా

...... ........ .....

సర్వేషా మేవ శిష్యాణాం బభూ వాభ్యధికో ऽర్జునః
(బా. ఆది. అ. 132)

సబాల స్తేజసా యుక్తః సూతపుత్రత్వ మాగతః

....... ....... .......

యుష్మాభి ర్నిత్యసద్విష్టో దైవాచ్చాపి స్వభావతః
(భా. శాంతి ప. అ. 2)

పైశ్లోకముల యర్థ మిది. "సూతపుత్రుఁడైన కర్ణుఁడు విద్యాభ్యాసమునకై ద్రోణుల దరిసెను. అతనికిఁ బార్థునిపై స్పర్థ. అందుచేఁ గర్ణుఁడు గౌరవులతోఁ జేరి పాండవులను లాఘవమొనర్చెను. అర్జునుఁడు ద్రోణశిష్యులలో ముఖ్యుఁడు అస్త్రవిద్యానురాగముతో నాతఁడు విశిష్టుఁడయ్యెను. అతనికిఁ జెప్పినంత విద్య

యితరులకుఁ గూడ ద్రోణుఁడు నేర్పెను. ఇతరులు వాడు సామాన్యబాణములనే పృథాపుత్రుఁడును వాడుచుండెను. కాని లాఘవ సౌష్ఠవములలో నాతని కెవ్వరును సమానులు గాకుండిరి.

కర్ణుఁడు తేజోయుక్తుఁడు. దైవదుర్విపాకముచే నాతఁడు సూతపుత్రుఁడై నాఁడు. పరుశురాముని కడ నా మహావీరుఁడు విద్య లభ్యసించెను. భీముని బాహుబలము, ఫల్గుని లాఘవము, నకుల సహదేవుల వినయము గర్ణున కసూయాకారణము లైనవి. "యుధిష్ఠిరా! నీ బుద్ధిబలము నాతఁడు ద్వేషించెను. మీకు వాసుదేవునితోఁ గల మైత్రి రాధేయు నుద్వేగపఱచినది. నీపైఁ బ్రజలకు గల యనురాగమాతని వికలునిగా నొనర్చెను. అన్నిటికన్నను కర్ణుని వేధించిన ర్జునుని యస్త్ర విద్యాప్రభావమే! అతనికి మీపై దెగని మాత్సర్యమేర్పడినది. ందుచేఁగర్ణుఁడు సుయోధనునితోఁ జేరెను. అన్ని రీతుల నాతఁడు సమర్థుఁడు ని దైవదష్టుఁడు."

చిన్నతనమున దుర్యోధనుఁడు గర్ణునిలోని ప్రత్యేకతను గుర్తింపలేదు. ని సామర్థ్యమును గూడ గమనింపలేదు. ఇంతలో నొక చిత్రమైన సన్నివేశము గినది. దానితో రాధేయుఁడు నల్గురి దృష్టి నాకర్షించినాఁడు. అప్పుడే ర్ణదుర్యోధనుల మైత్రియను కాలకూటము జన్మించినది.

## దుర్యోధనునితోడి చెలిమి

శిష్యులు గొంతకాలము విద్య నేర్చిరి. వారి ధనుర్విద్యాకౌశలము నల్వురకునుఁ గనుపఱుపవలెనని ద్రోణచార్యులకు బుద్ధిపొడమినది. దీనిలో రెండు ప్రయోజనములు గలవు. తాను శిష్యుల కింతవఱ కెట్లు బోధించెనను విషయము నలువురకునుఁ దెలియును. బహిరంగప్రదర్శన మేర్పాటు సేసినప్పుడు శిష్యుల కిది యొకయుత్సాహకారణ మగును. ఒకనికన్న మఱియొకఁడు చాతుర్యమునుఁ

ప్రదర్శించినపుడు వాని నందరు ప్రశంసింతురు. అప్పుడు సోమరులైన శిష్యులకు "వానివలెఁ దాను గావలె"నను కోర్కెజనించును. స్పర్ధచేతనే గదా విద్య యభివృద్ధి యగును!

ద్రోణు లొనర్చిన బహిరంగప్రదర్శనములో భీష్ములు పరీక్షకులుగ నుండిరి. ఆనాఁడు కవ్వడి యెంతయో సామర్థ్యమునుఁ బ్రదర్శించినాఁడు. వాని కౌశల్యమున కక్కడఁ జేరిన వారందరాశ్చర్యపడిరి. ప్రేక్షకులెల్లరు ముక్తకంఠముతోఁ బార్థునిఁ బొగడ నారంభించినారు. అర్జునునకు వచ్చిన యీ కీర్తి గర్జున కసహ్యమయ్యెను. వానికంటెనుఁ దాను గొప్పవాఁ డనిపించికొనవలెనని యతని మనస్సు దహతహ లాడుచుండినది. ఈ సమయముననే కవ్వడి నధిక్షేపింపవలెను. ఈ యవకాశమును జారవిడిచినచో మఱియొకటి దొరకు టెన్నాళ్లకో?" ఈ యూహలతోఁ గర్ణుఁడు లేచి నిలిచి ద్వారప్రదేశమునుండి భీకరముగ భుజాస్ఫాలన మొనర్చెను. ఈ కథను వ్యాసుఁడిట్లు వర్ణించినాఁడు.

"తతస్సమాప్తభూయిష్ఠే తస్మి న్కర్మణి భారత!

...... ....... .....

........ ....... .......

ద్వారం చాభిముఖా స్సర్వే బభూవుః ప్రేక్షకా స్తథా॥

(భా. ఆది. ప. అ. 133)

పౌరులంద రర్జునునిఁ బ్రశంసించిరి. అతని యుత్కృష్టత స్థాపింపఁబడినది. జనసమాజమంతయు నిశ్శబ్దముగ నుండెను. వాదిత్రములు నిలచినవి. ఇంతలో ద్వారదేశమునుండి భుజాస్ఫాలనధ్వని వినవచ్చెను. మాహాత్మ్య బలసూచకమైన యా నినాదము వజ్రనిర్ఘోష సదృశము. ఆ సవ్వడికిఁ బర్వతములు భేదిల్లినట్లయ్యెను. భూమి పగిలినట్లయ్యెను. ఆకాశమంతయుఁ బ్రావృషేణ్య ఘనాఘనములతో

నిండినట్లయ్యెను. జనులందఱును ద్వారాభిముఖముగఁ జూపులు త్రిప్పి వీరుఁడెవ్వఁడో యని చూడసాగిరి. జను లొత్తిగిల్లి కర్ణునకు మార్గమొసగినారు. రాధేయుఁడు నేరుగా వచ్చి ద్రోణులకు నమస్కరించి తన యస్త్రవిద్యనుఁ బ్రదర్శించుటకై యనుమతిని వేడి యర్జును నధిక్షేపించసాఁగెను.

"స నిరీక్ష్య మహాబాహు స్సర్వతో రంగమండలం

...... .... ......

కరిష్యే పశ్యతాం నృణా మాత్మనా విస్మయం గమః ॥

(భా. ఆది. అ. 136)

మహాబాహుఁడైన సూతపుత్రుఁడు రంగమండల మంతయు బరికించెను. ప్రతిదినము నొనర్చినట్లే యాతఁడు ద్రోణ కృపులకు నమస్కరించినాఁడు. జనసమాజము నిశ్చలమైనది. వారందరు చూపుల నాతనిపై నిలిపి "వీఁడెవఁడా?" యని యాలోచింపఁసాగిరి. సావిత్రుఁడైన రాధేయుఁడు మేఘగంభీరస్వరముతోఁ బాకశాసని నిట్లదల్చెను. "అర్జునా! నీ విపుడు జూపిన లాఘవ ప్రక్రియల నన్నిటిని నేను గూడఁ గావింపగలను. అంతకంటెను గొప్ప కౌశలమునుఁ బ్రదర్శింపగలను".

కర్ణుఁడర్జును నదలించుట ద్రోణుల కిష్టములేదు. "అధిక్షేపములు మాని శాంతముగ విద్యను బ్రదర్శింపు"మని వారు రాధేయుని గోరిరి. అర్జునుఁడు జూపిన విద్యల నన్నిటిని రాధేయుఁడు చేసిచూపెను. అంతమాత్రముతో వానికి తృప్తిలేదు. తా నర్జునుని జయింపవలెను. కేవలము సమానుఁ డనిపించికొన్నంత మాత్రమున లాభమేమి? ఈ యూహతోఁ గర్ణుఁడు గవ్వడిని ద్వంద్వయుద్ధమున నాహ్వానించినాఁడు ఈ సందర్భమున భారతకారుల వర్ణన మిది.

ద్వంద్వయుద్ధం చ పార్థేన కర్తు మిచ్ఛా మ్యహం ప్రభో!

..... ........ .........

గురో స్సమక్షం యావత్తే హరా మ్యద్య శిరశ్శరైః
(భా. ఆది. అ. 136)

ఇంతటి జనమునెదుట నెవఁడో యొకఁ డప్రసిద్ధుఁడు దన్ను ద్వంద్వయుద్ధమున కాహ్వానించునని కవ్వడి కలలోనైనను దలఁపలేదు. వాఁడట్లు పిలుచుటాతనికి రుచించినది గాదు. అందుచేఁ దొల్త నాతఁడు వాని యాహ్వానమును నిరాదరించినాఁడు. కాని కర్ణుఁడాగలేదు. మాటి మాటి కధిక్షేపింప సాఁగెను. కడ కర్జునుఁడిట్లన్నాఁడు. "ఓయీ! అనాహలాతులై, సభలకు బలిమిని జని వేడి బలుకు పాపభాగుల లోకములకుఁ బోఁగోరియే నీ విట్లుమితిమీరి భాషించుచున్నావు. నీవు గోరినట్ల ద్వంద్వయుద్ధ మగుగాక!" కర్ణుఁడిట్లు ధట్టించెను. "అర్జునా! యీ రంగస్థలము సర్వసామాన్యము, వీరుఁడైన వానికెల్ల నిందుఁ బ్రవేశము గలదు. ఈ ప్రదేశము నీ యొక్కనిదే గాదు. నేను వీరుఁడను గనుకఁ బ్రవేశించితిని. దీన నీ యాక్షేపణ యేమి? మాటలతో వృథా కాలహరణ మొనర్చుట మంచిది గాదు. చేతనైన శరములతో భాషింపుము. ద్రోణుల కట్టెదుటనే నీ శిరస్సును భూమిపైఁ గూల్తును."

కర్ణుని మచ్చరమెంతవఱకుఁ బెరిగినదో చూపుట కిది యొకయుదాహరణమ అర్జనుఁడీ మాటల కుద్రిక్తుఁడయ్యెను. అతఁడు ధనుర్బాణములను సవరించికొ ద్వంద్వయుద్ధమునకుఁ దయారైనాఁడు. ఈ సన్నివేశము దుర్యోధనునకెంతయో కౌతూహల కారణమయ్యెను. పాండవుల శౌర్యము నధిక్షేపించు వాఁడొకఁడున్నాఁడన్న విషయము దుర్యోధనునఁ డీనాఁడే తెలిసికొన్నది. తనవలెనే కౌంతేయుల గాఢముగ ద్వేషించువ్యక్తి మఱియొక్కఁడు గలఁడని తెలిసికొన్నపుడు కురురాజునకుఁ గలిగిన యానందమునకు మేర లేకపోయినది. అతనికిఁ గర్ణునిపైఁ బ్రగాఢమైన పక్షపాత మేర్పడెను. కర్ణార్జును లిరువురును ద్వంద్వయుద్ధమునకుఁ దలపడినారు. ఈ విషయమున కొక నియమ మున్నది, ద్వంద్వయుద్ధమునఁ బోరు వీరు లిర్వురును సమాన గుణశీలములు గలవారు గావలెను. ఈ సంగతి కృపాచార్యులకు

జ్ఞాపకమునకు వచ్చెను. వారు వెంటనే రాధేయు నిట్లు ప్రశ్నించిరి.

"తా వుద్యత మహాచాపౌ కృప శ్శారద్వతోऽ బ్రవీత్

....... .......... ......

వృథాకులసమాచారై ర్నయుధ్యంతే నృపాత్మజాః
(బా. ఆది. అ. 136)

ఓయీ! అర్జునుడు పాండురాజునకుఁ దృతీయపుత్రుండు. ప్రసిద్ధమైన వంశమున నితఁడు జనించెను. కుంతీదేవి యితని తల్లి. ఇతడు నీతో ద్వంద్వయుద్ధమునకు సిద్ధపడినాఁడు. అర్జునుఁడు ప్రసిద్ధ రాజవంశోత్పన్నుఁడగుట నీకును విదితమే గదా! ద్వంద్వయుద్ధ మెప్పుడును సమానస్కంధులకే జరగును. నీ కులగోత్రములు మే మెఱుఁగము. నీ తల్లిదండ్రుల నామధేయము లేవో వివరింపుము. ఏ రాజవంశమున నీవు జన్మించితివో స్పష్టముగ వచింపుము. అటు తరువాత నీ కర్జునునితో ద్వంద్వయుద్ధ మొనర్చునధికారము గలదో లేదో మేము నిర్ణయింతుము."

ఈ మాట కృపాచార్యులు సహజముగ వేసిన ప్రశ్న. నాటిసామాజిక నియమ మిది. కాని యీ ప్రశ్న విషలిప్తమై కర్ణుని హృదయమునఁ గ్రుచ్చుకొనెను. అతని మొగము సిగ్గుతో వెలవెలఁబోయెను. చిన్ననాట నుండి పాండవులను నాశన మొనర్చుటకే కాచికొన్నవాఁడు దుర్యోధనుఁడు. ఇంతవఱకాతనికిఁ బాండవుల నెదుర్చు వీర్యవంతుడు గనుపింపలేదు. నేఁడా శక్తి రాధేయునిలో నగుపడినది.

దుర్యోధనుని యాశలు జిగిర్చినవి. రాధేయుని ధైర్యమున కతఁడబ్బురపడినాఁడు. అతని యస్త్రవిద్యా కౌశల్య మనన్యసామాన్య మనిపించినది. కర్ణునండగాఁ గొని భీమపార్థుల విక్రమములను విదళింపవలె ననుట దుర్యోధనుని కాక్షణముననే కలిగిన యూహ. దీని కేమి సేయవలెను? కర్ణునిఁ శాశ్వతముగ నంకితు నొనర్చి కొనవలెను. అట్లైననే పాండవులయెడఁ దనకుఁ గల యసూయ

ఫలించును. కర్ణుని హృదయమును లోఁబఱుచుకొనుటకు మార్గము ఈ తరుణమే! వెంటనే దుర్యోధనుఁడు లేచినాఁడు. కర్ణుని కులమునుఁ బ్రశ్నించిన కృపాచార్యుల సమక్షమందే యాతఁడు రాధేయున కంగరాజ్య మొసఁగుదనని మాట యిచ్చెను. దీనితో నధఃపతితుఁడైన కర్ణుఁడు మంత్రము వేసినట్లు మరుక్షణముననే క్షత్రియుఁడై భాసించెను. రాధేయుఁడు సూతపుత్త్రుఁడని ద్రోణకృపులకుఁ దెలియును. అందుచే నీ సమయమునఁ గర్ణుని కులమునుఁ బ్రశ్నించినచో ద్వంద్వయుద్ధ మాగిపోవునని వారి యాశ! కాని, దుర్యోధనుఁడా భావమున కడ్డువేసెను. ఇపుడు కర్ణుఁడంగరాజు! అంగరాజున కర్జునునితోఁ బోరుట కే యాక్షేపణయు లేదు! ఇంతవఱకుఁ గర్ణుఁడెవ్వఁడో యెవ్వరికిని దెలియదు. ఆతని జన్మమును దుర్దైవము కాటువేసెను. అట్లే యాతని కదృష్టము గూడ హఠాత్తుగఁ బట్టినది. తర్వాత నేమి జరగినది? వ్యాసు లిట్లు వర్ణించిరి.

"తతస్రస్తోత్తర పటః సప్రస్వేద స్సవేపధుః

..... ..... ......

శ్వాహలాతాశ సమీపస్థం పురోడాశ మివాధ్వరే!

(భా. ఆ. ప. అ. 137)

కర్ణుని తండ్రి యతిరథుఁడు . కుమారునకుఁ బట్టిన యీ యదృష్టమున కాతని కెంతయో యానందమైనది. అతఁడు బిరబిర జారిపోవుచున్న యంగవస్త్రమునుఁ గూడ గమనింపక రంగమంటపములోనికి వచ్చెను. తండ్రినిఁ జూచినవెంటనే ధనుస్సును విడచి కర్ణుఁడభిషేకార్ద్రమైన శిరస్సు వంచి నమస్కరించినాఁ కర్ణుని కేశపాశము తండ్రి ప్రేమాశ్రువులచే మఱలఁ దడిసెను.

అపుడు కర్ణుఁడు సూతపుత్త్రుఁడని భీమునకుఁ దెలిసినది. భీముఁడిట్ల పహాసము జేసెను. "ఓయి సూతపుత్రా! అర్జునునిచే ఖండింపఁబడుటకు నీవుదగవు. నీ కులమునకుఁ దగిన పని రథములనుఁదోలుటయే! ధనుస్సును విడచి చెలకోలఁ గైకొమ్ము! నీ పాలిటి కొక యంగరాజ్యమా! కుక్కకు పురోడాశ మిచ్చినట్లున్నది."

భీముని యధిక్షేపములతో దుర్యోధనుని కోపము మితిమీరి పోయినది. ఆతఁడు దనవెంట కర్ణునీడ్చికొనిపోయెను. రాధేయుని క్షత్రియులలో మాణిక్యముగ నొనర్తునని దుర్యోధనుఁడు పట్టుపట్టినాఁడు. అపుడే కురురా జాతని రాజసింహాసనముపైఁ గూర్చుండబెట్టి భవ్యమైన సామాజిక ప్రతిష్ఠను సంపాదించి యిచ్చినాఁడు! ఈ మార్పుతోఁ గర్ణుని హృదయమున నొక విలక్షణ పరిణామ మేర్పడినది. ఇందుకుఁ బ్రతిఫలముగ దుర్యోధనుఁడేమి గోరినాఁడు! ఏమియును లేదు. ఆతఁడు గోరినది తన చెలిమిని మాత్రమే! కురురాజెంతటి యుపకారశాలి! ఈ భావములతోఁ గర్ణుఁడు దుర్యోధనునకు శాశ్వతముగ నంకితమైనాఁడు. నాఁటనుండి కర్ణసుయోధనుల కభేద్యమగు మైత్రి యేర్పడినది. కృష్ణుఁడుగూడ దానినిఁ గదలింపలేక పోయెను. కృష్ణార్జునుల మైత్రివలెనే కర్ణదుర్యోధనుల మైత్రియుఁ గడవఱకు సాగినది. కర్ణుఁడంగరాజైన వెంటనే ద్వంద్వయుద్ధము తప్పనిసరి యయ్యెను. ద్రోణశిష్యులలో నిది "యా" నని కొందఱు "కా" దని కొందఱు. వారంద రాయుధపాణులై పరస్పరము కంఠము లుత్తరించికొనుటకుఁ దయారైనారు. ఇంతలో నదృష్టవశమున సూర్యుఁడస్తమించెను. ఇది యొకరీతిగఁగర్ణుని యదృష్టము! దేశముయొక్క దురదృష్టము! అర్జునుని కానాటికే బ్రహ్మాస్త్రము దెలియును. కర్ణున కప్పటికది తెలియదు. నాఁడు ద్వంద్వయుద్ధమే జరగినచో కర్ణుఁడర్జునుని చేతిలో మరణించియుండును. దానితో దుర్యోధనుని యాశ లెల్ల నస్తమించియుండెడివి. పాండవులపై నెంత యసూయయున్నను వారి నెదుర్చుబలము లేమిచేఁగురురా జట్లే క్రుంగి, కృశించి, చచ్చియుండును. దేశక్షోభకరమైన మహాయుద్ధము రాకయుండెడిది. కాని దైవమన్యధా తలఁచెను. స్వాతిశయభావముతో రాధేయున ర్జునునిపై నకారణమగు మాత్సర్యము చెలరేగినది. ఎట్లైననుఁ గిరీటిని వధింపవలెనని యాతని యాశ! ఈ దురాశ యాతని సద్గుణముల నన్నిటిని మ్రింగివేసెను. కర్ణుఁడు మహాతపస్వి. గొప్ప సంయమము గలవాఁడు! తొందరపడక

యున్నచో బ్రహ్మాస్త్రాది విద్యలన్నియు నాతనికి సహజముగనే సంక్రమించియుండును. కాని యాతని దురాశ యొకచోట నిలుకడగ నుండనివ్వలేదు. అర్జునుని కన్న ముందే సమస్తవిద్యలు సాధించి, వానిని వధింపవలెనని కర్ణుని తీవ్రమగు నిచ్ఛ! దీనితో నతఁడక్కడక్కడికిఁ బరువులు దీసెను. విద్యలు సంపాదించెను. లాభమేమి? అవి యన్నియు శాపదష్టములు.

## శపిత విద్యాదానము

అర్జునుఁడు దనకన్న నస్త్రవిద్యలో గొప్పవాఁడు. ఆతనికడ బ్రహ్మాస్త్ర మున్నది. తన కది లేదు. ఈ రహస్యము గర్ణునకు దెలియును. ఆతఁడేకాంతమున ద్రోణులను దరిసి బ్రహ్మాస్త్రమునుఁ బ్రయోగోపసంహారములతోఁ దన కుపదేశింపవలసినదని ప్రార్థించినాఁడు! కర్ణుఁడంతటితోఁ దన సంభాషణ నిలిపియుండిన బాగుండెడిది. కాని యర్జునునిపైఁ దనకుగల మచ్చరమును రాధేయుఁడు దాచికొనలేకపోయెను. బ్రహ్మాస్త్రము నర్థించుటలోఁ గల కారణము కవ్వడిని ద్వంద్వయుద్ధమున జయించుటయేనని స్పష్టముగఁ జెప్పినాఁడు. కర్ణుఁడిట్లనెను. "మీకు శిష్యులందఱు సమానులే! వారిలో నొకనిపై నెక్కువప్రేమయు మఱియొకనిపైఁ దక్కువ ప్రేమయునుండరాదు. నేనుగూడ నర్జునుని వలెనే తమకు శిష్యుఁడను. ద్రోణుల శిష్యులకు బ్రహ్మాస్త్రరహస్యము దెలియదనుటలో నపవాదు నాకు మాత్రమే గాదు మీకుగూడ!"

ద్రోణులు కర్ణుని యభ్యర్థనమును సాంతముగ వినిరి. రాధేయునకు కర్జునునిపై నున్న యకారణమాత్సర్యము వారికి రుచింపలేదు. పైగా వా రర్జునుని యశ్వత్థామకంటె నెక్కువగఁ బ్రేమించుచుండిరి. అందుచేఁ గర్ణునికి బ్రహ్మాస్త్రము నుపదేశించుట వారి కిష్టములేదు. కాని యీ విషయము నెట్లు సూతపుత్త్రునితో స్పష్టముగఁ జెప్పుట? ఏదో యొక సాకుతో రాధేయుని యభ్యర్థనమును ద్రోణులు త్రోసివేయఁదలచినారు. అందుకై వారిట్లనిరి.

"బ్రహ్మాస్త్రం వేత్తు మిచ్ఛామి సరహస్యనివర్తనం

......... ....... .....

క్షత్రియో వా తపస్వీయో నా ఽన్యో విద్యాత్ కథంచన!

(భా. శాం. ప. అ. 2)

"కర్ణా! నీవు బ్రహ్మాస్త్రమునుఁ గోరుట సంతోషము! కాని యా యస్త్రమును గ్రహించుట కొక నియమ మున్నది. దానికి బ్రహ్మక్షత్రియులే యధికారులు! వారుగూడ సామాన్యులు సాలరు. బ్రాహ్మణుఁడు చరితవ్రతుఁడు గావలెను. క్షత్రియుఁడు దపస్విగావలెను. నీ విందులో నెవ్వఁడును గావు. కనుక బ్రహ్మాస్త్రము నొసఁగలేను." ద్రోణులన్న యీ మాటతో రాధేయుని హృదయము గుతకుత యుడికెను. తాను హీనకులుఁడని గదా ద్రోణుల యాక్షేపణము! అస్త్రాచార్యులన్న యామాటలు రాధేయుని మనస్సులో గాఢముగఁ గ్రుచ్చికొన్నవి. ఆచార్యులపైనఁగూడ ్వష మాతని కారంభమయ్యెను. నాఁటనుండి సమయము వచ్చినపు డంతయుఁ ంభజాల నాతఁడెత్తిపొడిచెను. అవసరము వచ్చినఁ జాలును. కాటువేయుచుండెను. ఎట్లైనను బ్రహ్మాస్త్రమును సంపాదింపవలెనని కర్ణుని పూనిక! ద్రోణులు గాదనిరి. ద్రోణునకు విద్య నేర్పిన పరుశురామునినుండి రాధేయుఁడద్దాని సంపాదింపఁదలచినాఁడు! జామదగ్ని మహేంద్రపర్వతమునందుండెను. కర్ణుఁడాతని దర్శించినాఁడు! తాను హీనకులుఁడని భార్గవుఁ డెఱిఁగినచో నస్త్రవిద్య నుపదేశింపఁడు! ఏమి సేయవలెను? కర్ణుఁడసత్యమునుఁ బలికెను. ఆతఁడు పరుశురామునితో నిట్లన్నాఁడు! నాది భార్గవగోత్రము! బ్రాహ్మణుఁడను. ధనుర్విద్య నభ్యసించుటకై తమకడ కరుఁగుదెంచితిని." ఈ మాటలనుఁ బరశురాముఁడు నమ్మి కర్ణున కాశ్రయ మొసఁగినాఁడు! నాటనుండి రాధేయుని యంతే వాసిత్వము సాగెను. పరుశురాముని దర్శనమునకై యరుగుదెంచు ననేకబ్రహ్మావిష్ణులతోఁ గర్ణునకు మైత్రి యేర్పడెను. రాధేయుఁడు సేవానిష్ఠతో గురువును సంతోషపెట్టినాఁడు!

అస్త్రవిద్యోపదేశము సాగుచుండెను. ఇంతలో ఘోరమైన దురదృష్ట మొకటి సూతపుత్రుని వెక్కిరించినది. భారతమున నా ఘట్ట మిట్లు వర్ణింపఁబడినది.

"స కదాచి త్సముద్రాంతే విచర న్నాశ్రమాంతికే

...... ...... ....

రామ మభ్యగమ ద్భీత స్తదేవ మనసా స్మరన్

**(భా. శాంతి. అ.2)**

"కర్ణుడు సముద్రతీరమున నొకనాఁడు ధనుర్విద్య నభ్యసించుచుండెను. సమీపముననే యొక మునియాశ్రమ ముండెను. ఆయాశ్రమమున బ్రహ్మణ్యుఁడైన బ్రహ్మవాది యొకఁ డుండెను. కర్ణుఁడజ్ఞానవశమున నతని హోమధేనువును వధించినాఁడు! రాధేయుఁడీయకార్యమున కెంతయో దురపిల్లి, యా బ్రహ్మవాదిఁ దరిసి, యిట్లు విన్నవించెను. స్వామీ! ఈ దోష మబుద్ధిపూర్వకముగ జరిగినది నా శరప్రయోగముచేఁ దమ హోమధేనువు మరణించినది. ఈ దోషమునకు నన్ను మీరు మన్నింపవలెను."

ఈ బ్రాహ్మణుఁడగ్నిహోత్రునివలె మండెను. అతఁడన్నాడు? "మద మత్తుఁడవై కన్నుగానక నా ధేనువును సంహరించితివి. దీనికిఁ దగినఫల నీవు తప్పకఁబొందెదవు. నీ వొకానొక వీరుని మనస్సున నుంచికొని, వ జయించుటకై రేపగలు బాధపడుచున్నావు. వానితో నీకు భయంకరయుద్ధ సంఘటిల్లినపుడు, నీ రథచక్రము భూమిలోఁ గ్రుంగిపోవును లెమ్ము! ఇదే నీ కార్యమునకుఁ దగినఫలము. అపుఁడు శత్రువు నీ తలను ఖండించును. నీవు బ్రమత్తుఁడవై నా హోమధేనువును ఖండించితివి. ప్రమత్తుఁడవైన నీ శిరమును శత్రువు దఱుఁగుగాక!" కర్ణుఁడా ద్విజు నెంతయో ప్రార్థించెను. రత్నములను, గోవులను, భూమిని వినిమయముగా నిత్తుననెను. కాని విప్రుఁడు శాంతింపలేదు.

తా నాడిన మాటకుఁ దిరుగులే దన్నాఁడు బ్రాహ్మణుఁడు. ఇఁక గర్ణుఁడేమి సేయును? చిన్నవోయిన మొగముతోఁ దన గురువును సమీపించెను. జరిగిన సంఘటనమును గురువునకు శిష్యుఁడు విన్నవింపలేదు. తన రహస్యమంతయు నీసాకుతో బయటపడునేమోయని యతని భయము! ఈ మౌన మొకరీతిగఁగర్ణుని కపకారిక మయ్యెను. బయటఁబడి తన దోషమునుఁ బరశురామునకు విన్నవించియున్నచో నాతఁడేదైన శాపవిముక్తిమార్గ మాలోచించి యుండు నేమో! వృథాభయముతో నాయవకాశమును గూడ రాధేయుఁడు జారవిడచికొన్నాడు. ఇంతకు నాతని దురదృష్ట మది!!

కర్ణునకుఁ బరశురామునిపై నెంతయో ప్రేమ! ఆతని వినయ మనన్యసామాన్యము! ఇంద్రియ జయము, మనోనిగ్రహము, సేవ యీ గుణము లన్నియుఁ బరుశురాముని దృష్టి నాకర్షించినవి. గురువు గర్ణునిపై నమితముగఁ బసన్నుఁడైనాఁడు. శిష్యునకుఁ బ్రయోగోపసంహారములతో బ్రహ్మాస్త్రము నుపదేశించినాఁడు. వెంటనే గురువునుండి యనుమతిఁ గైకొని రాధేయుఁడు హాస్తినావతిఁ జేరి యున్నచో బాగుండెడిదేమో! కాని యతఁడట్లొనర్పలేదు. గురుసేవ లొనర్చుచుఁ గొన్ని దినము లచటనే యున్నాఁడు. విద్యలను స్వీకరించుటలోఁ గర్ణుని సంకల్పము హీనమైనది. దానికిఁ దగిన ప్రతిఫలము జరుగవలదా? తరువాతఁ గొన్ని దినముల కే యలర్కకీట వృత్తాంతము సంఘటిల్లినది. ఈ సన్నివేశమున రాధేయుఁడనుపమానమైన యోర్మినే ప్రదర్శించెను. అదియే యతని కపకారకమైనది. పరుశురాముఁడు నిద్రలేచి రాధేయు నిట్లు బ్రశ్నించినాఁడు.

"అతిధుఃఖ మిదం మూఢ! నజాతు బ్రాహ్మణ స్సహేత్

...... ....... .......

ఏవ ముక్తస్స రామేణ న్యాయే నోపజగామహ!

(భా. శాంతి. 3)

"సత్యమును దాపక పలుకుము. బ్రాహ్మణుఁడింత బాధనెన్నఁడును సహింపలేఁడు. క్షత్రియునకే యిట్టి సహనశీలత సాధ్యము! నీ వెవ్వఁడవో వచింపుము.' ' కర్ణుఁడు శాపభయమున గజగజ వణకినాఁడు! అతఁడిట్లన్నాడు. "భార్గవా! నేను బ్రహ్మక్షత్రాంతరమున జనించిన సూతుఁడను. నా తల్లి రాధ! అందుచే రాధేయుఁడ నైతిని. నా పేరు గర్ణుఁడు. అస్త్రవిద్యలయందలి చాపల్యముచేఁ బొంకాడితిని. నన్ను క్షమింపుము. వేదవిద్యాప్రదుఁడైన గురువు తండ్రివంటివాఁడు! ఇది వేదనియమము! అందుచే మిమ్ముఁ దండ్రిగ భావించి నాది భార్గవగోత్ర మంటిని. ఈ దొసఁగును మన్నింపుము."

పరుశురాముఁడు కోపోద్రిక్తుఁడయ్యెను. తన పాదములపైఁ బడి హీనముగ వేడికొనుచున్న గర్ణుని జూచి భార్గవుఁడు "ఓయీ! అస్త్రలోభముచే నసత్యమునుఁ బలికితివి. విద్యయందలి నిష్ఠ కోరఁదగిన దైనను నీ వనుసరించిన మార్గము మాత్రము దోషదూషితము. నీ వధకాలమునందు నీకు బ్రహ్మాస్త్రవ భాసింపకపోవుగాక!" యని శాపమొసఁగెను. పరుశురామునికిఁ గర్ణుని ప్రేమాతిశయమంటిమి. అతనికిఁ గర్ణునిపై జాలి కలిగినది. పరుశురాముఁ శాపమునిట్లు సవరించెను. "కర్ణా! ఎట్లైనను నీవు నా శిష్యుడవు. మరణకాలమునఁ దక్క తక్కినవేళల నబ్రాహ్మణుఁడవైనను నీకు బ్రహ్మాస్త్రవ పనిసేయును. నీతో సమానమైన వీరుఁడు భూమండలమున లేకపోవును విక్రమార్జితమైన నీ కీర్తి మూఁడు లోకములందును వ్యాపించును. కా నీవిఁక నొక క్షణమైనను నిలువరాదు! నీవంటి యసత్యవాదికి, కపటవృత్తి నా కడ చోటు లేదు."

కర్ణునకు భయంకరములైన రెండు శాపములు సంఘటిల్లిన చింతాశకలితుఁడై యాతఁడు హస్తినావతి కరుదెంచినాఁడు. దుర్యోధనున శాపవృత్తము దెలియదు. కర్ణునకు జామదగ్ని యనుగ్రహమబ్బినదని యాత డుప్పొంగెను. బ్రహ్మాస్త్రోపదేశమైనదని మిన్నంటెను. ఇక రాధేయుఁ డర్జునుని

జయించుటలో నసాధ్య మేమున్నది? పాండవుల విక్రమము మంటఁగలసినట్లే! ఈ భావములతో దుర్యోధనునకు రాధేయునిపై యుత్కటమైన భక్తి గుదిరినది.

కర్ణుఁడు కష్టపడి విద్యలు సంపాదించెను. కాని లాభమేది? వానిని సంపాదించుటలో వాని యుద్దేశము పవిత్రమైనది గాదు. విద్యయందలి ప్రేమచే నాతఁడు గురుసేవ యొనర్పలేదు. అందుచే నాతని యుద్దేశ్యము సాత్వికము గాకపోయెను. శుద్ధకీర్తి, సద్ధర్మసంరక్షణము మొదలైన రాజసిక ప్రవృత్తులచేఁ బ్రేరితుఁడై గురువు నాశ్రయింపలేదు. కాన నతని తలఁపు రాజసముగూడఁ గాకపోయెను. మఱి కర్ణుఁడు విద్యల నభ్యసించుటలోఁ గల కారణము? మాత్సర్యము. అకారణద్వేషము! అర్జునుని నాశన మొనర్పవలెనను భయంకరమైన తలఁపు. ఇవన్నియుఁ దామసికగుణములే! వీని ఫల మేమైనది? అతని విద్యలన్నియుశాపదష్టము లయ్యెను. తానునేర్చిన విద్య సమయమునకుఁ దనకే యుపయోగపడకపోయెను. అర్జునుని కంటెఁదా నధికజ్ఞానసంపన్నుఁడు గావలెనను సాత్వికస్పర్ధ రాధేయునకు లేదు. అట్లయినచో నర్జునుని కంటె నతఁడు శీలవంతుఁడు గావలసియుండెను. కర్ణుని వేధించిన తలఁ పొక్కటియే! “కిరీటిని నాశన మొనర్పవలెను.” ఈ భావమే యాతని మహాస్త్రజ్ఞతకుఁ గారణమైనది. అర్జునునిపై నీ స్పర్థ లేకున్నచోఁ గర్ణున కిన్ని బాధలు పడవలసిన యవసరము లేకుండెడిది. ద్రోణులే యాతనికి బ్రహ్మాస్త్ర మొసఁగియుందురు. విద్యలు గూడ శాపదళితములు గాకుండెడివి. ధృష్టద్యుమ్నుఁడు ద్రోణశిష్యుఁడే! తన మృత్యు వారూపమున జనించెనని గుంభజునకుఁ దెలియును. తెలిసియు నాచార్యుఁడాతనికి ధనుర్విద్యారహస్యము లుపదేశించెను. ద్రోణులచిత్తమంత యుదాత్తమైనది. కాని కర్ణుని పేరాస యతని నటనుండనివ్వలేదు. అర్జునునిపై రాధేయునకుఁ గల వృథా ద్వేషమే ద్రోణుల మనస్సునుఁ గలచినది. కపటాచరణముతో సూతపుత్రుఁడు మహాస్త్రములను సంపాదించెను. కాపట్యమునకు ఫలముగ నాతని జ్ఞానమంతయు

వ్యర్థమయ్యెను. కాని తాను గొప్పవాఁడను స్వాతిశయము మాత్రము పెరిగెను. దాని కహంకారము దోడయ్యెను. అగ్నికి వాయువు దోడుపడినట్లు!

## కర్ణుఁడు దుర్యోధనుని పక్షము నెందుకుఁ జేరెను?

రాధేయుఁడు దుర్యోధనుని పక్షము నవలంబించుటలోఁ గృతజ్ఞతాభావ మొక్కటియే కారణముగాదు. అందులోఁ గొంతరాజనీతియు గలదు. కర్ణుఁడు స్వాతిశయ మెక్కువగా గల పురుషుఁడని యింతకుముందే తెల్పితిమి. పాండవులవైపు దాను సేరినచోఁ దన స్వాతిశయము నిలువదు. కౌరవుల కడ సర్వము దానే! దుర్యోధనుడు రాజనుట పేరునకు మాత్రమే! ప్రతి కార్యమును రాధేయుని సమ్మతిలేనిది. జరుగుటకు వీలేలేదు. కురురాజ్యమునకుఁ బ్రధాన సూత్రధారి సూతపుత్రుఁడు పాండవులపైఁ గసి దీర్చికొనుటకుఁ దనక బ్రధానోపాయము గర్ణుఁడగుటచే సుయోధనుఁడతని నన్నివిధము ననుసరించుచుండెను. పాండవపక్షము నవలంబించినచో నీ పెద్దఱికము దక్కఁ పరాక్రమముననను, గార్యదక్షతలోను పాండవులు దనకంటెఁ దీసిపోరు. ఒక మా యెక్కువయే! మఱి యన్ని విధములఁ దనమాటను మన్నింపవలసిన యగత వారి కేమి?

అర్జునుఁడు దనకన్నను శ్రేష్ఠుఁడైన ధనుర్ధరుఁడు. భీముఁడభిమాని. ఁ మనోవృత్తి యత్యంతము తీవ్రము! ఎవరి గర్వమునుఁగూడ బవనసూన మన్నింపఁడు! ఇఁకఁ దన స్వాతిశయము దక్కుమార్గమేది? పాండవులను గౌర యనుసరించు వీరు లెందఱో యుండిరి. కర్ణుఁడు పాండవులవైపు జేరి వారిలోఁ దానొక్కఁడుగ నుండవలసినదే గాని, "సర్వము దానే" ( ప్రతిష్ఠదక్కుటకు వీలే లేదు. కౌరవులపక్షమున నన్ననో తానే సర్వము. పాండవు గృష్ణున కెంత పలుకుబడియో ధార్తరాష్ట్రులలోఁ దన కంత! కనుకఁ గఁ

దుర్యోధనుని పక్ష మవలంబించుటలోఁ గేవల కృతజ్ఞతా భావమేగాక దన స్వాతిశయము నిలుపుకొనుటయు నొకటి! కౌంతేయులపక్షమున నున్ననుఁ దన పెద్దఱికము నిలువవలెనన్నచో దాని కొక్కటే మార్గము! అతఁడు దమ కగ్రజుఁడని పాండవులకుఁ దెలియవలెను. కాని దుర్దైవ వశమున నీ విషయ మిరుపక్షములకుఁ దెలియదు. ఇఁకఁ దెలుపవలసిన వారెవ్వరు? పాండవులకుఁ దల్లియైన కుంతీదేవియే! ఆమె యీవిషయమున మౌనము వహించెను. దానికిఁ గారణము లనేకములు. కనుక పాండవులది ధర్మమను భావమొక్కొక్కసారి యెడదలో భాసించినను, దానినిఁ గాలఁదన్ని కర్ణుఁడాత్మప్రతిష్ఠకై దుర్యోధనునివైపుఁ జేరినాడు. ఇది యాతని కనివార్యము. సుయోధనుని గొప్పతనము వర్ధిల్లుట కెన్ని పనులు గావలెనో యన్నియుఁ గర్ణుఁడొనర్చెను. కురురాజు ప్రతిష్ఠ పెరుగుకొలదియు దన పలుకుఁబడి హెచ్చెను. అందుకై సర్వదా తన యెడలఁ గురురాజు ప్రసన్నుఁడుగ నుండునట్లు కర్ణుఁడొనర్చెడివాఁడు. దుర్యోధనుని సామర్థ్యము, ప్రభావము నాతఁడభివృద్ధి నందించెను. తన ప్రాణము లొడ్డియైనను నీడవలె దుర్యోధనుననుసరించుటకు వెనుదీయలేదు. తన యున్నతి దుర్యోధనునితోఁ బెనగొన్నట్లు కర్ణుని యెదుట స్పష్టముగ భాసించుచుండెడిది. ఆ స్వార్థమును సాధించికొనుటకై యుదారమనస్కుఁడైన రాధేయుఁడు నీచులతోఁ గూడి నీచముగఁ బ్రవర్తించుటకు జంకలేదు. దీనికిఁ బ్రథమోదాహరణము ద్యూతప్రసంగమున జరగిన దురాచారము! ఇది యక్షమ్యమైనది. యుక్తాయుక్తజ్ఞానము గల కర్ణుఁడు గూడ నీ ప్రసంగమున దుర్యోధనునివైపు నిలిచెను. ధర్మాధర్మ విచారమునే యాతఁడు మఱచెను. లేకున్నచో మహాసతియైన ద్రౌపది వస్త్రముల నొలుచుట వంటి పని కౌరవుల నిండు సభలో జరుగవచ్చునా? దీనికిఁ గర్ణుఁ డంగీకరింపవచ్చునా? పాండవుల కింతకంటెఁ జేయవలసిన భయంకరాపకార మేమున్నది? ద్రౌపది సామాన్యురాలు గాదు. ఆమె యొక మహాసామ్రాజ్ఞి! రాజసూయయాగ సందర్భమున సార్వభౌమ సింహాసనము

నధిష్ఠించినది పూర్ణావతారుఁడైన కృష్ణుఁడు గూడ నామె దన చెల్లెలని చెప్పికొని మురిసిపోవుచుండెను. ఆమె యగ్ని సంభవ! మహాపతివ్రత! అట్టి యామె నొక నిర్జీవవస్తువును వలె యుధిష్ఠిరుఁడొడ్డి యోడెను. ఛలద్యూత నిష్ణాతుఁడైన శకుని ద్రౌపదిని గెల్చికొన్నాఁడు దీనితో మదాంధుఁడైన దుర్యోధనునకు ఱెక్కలు మొలచినవి. కౌరవ కులకీర్తి పతాకయైన ద్రౌపది నాతఁడు 'దాసి' యని పిలచెను. ఆమెను నిండు సభలోనికిఁ గొని రావలసినదిగ నాజ్ఞాపించెను. ధర్మజుఁడు ద్రౌనది నోడెనను మాట విన్నంతనే విదురుఁడచేతనుఁడైనాడు. భీష్మ ద్రోణులు గంపించిరి. సభయంతయు ధిక్కారనాదము లొనర్చినది. కాని కర్ణుఁడు మాత్రమానందితుఁడయ్యెను.

"జహర్ష కర్ణోఽతిభృశం సహదుశ్శాసనాదిభిః

..... ..... .....

ఇతరేషాంతు సభ్యానాం నేత్రేభ్యంప్రాప తజ్జలం

(భా. స. ప. అ. 65)

ద్రౌపదిని సభలోని కీడ్చికొని రమ్మన్న సుయోధనుని యాజ్ఞ విని కర్ణునకు మహానందమైనది. ద్రౌపదీ స్వయంవరమునఁ గర్ణున కవమానమయ్యెను ఆ బాధ యాతని యనస్సునుండి మఱగిపోలేదు. నేటికిఁ బాంచాల రాజపుత్రికి దగిన ప్రతీకారము జరగినదని సంతోషపడినాఁడు. పాంచాలి యపుడు రజస్వ ఏకవస్త్ర! ఆ రాజరమణిని దుశ్శాసనుఁడు కేశములఁ బట్టికొని బలవంతమ నీడ్చితెచ్చెను. కౌరవ వంశములోని పెద్దలందఱు సిగ్గుతోఁ దలలు వంచికొన్నాఁ ఆ యకార్యమును ధిక్కరించు ధైర్య మెవ్వరికిని లేకపోయినది. ఆ నిండుసభ నట్టి ధైర్యసంపన్నుఁడైన మహాపురుషుఁ డొకఁడే యొకఁడుండెను. అతఁడు వికర్ణుఁ వికర్ణుఁడు నిజముగ మహాపురుషుఁడు. రాగ లోభాంధముగాని బుద్ధితో నాలోఁ ద్రౌపదికి జరగిన యవమాన మమానుషమని యాతఁడు దీర్మానించికొన్నా అంతమాత్రమే గాదు, లేచి తన యసహ్యమును బాహాటముగనే తెలి

వికర్ణుఁడు దుర్యోధనునకుఁ దమ్ముఁడే! వికర్ణుఁ డొనర్చిన యాక్షేపణకు బదులొసఁగినవాఁడు రాధేయుఁడు. కర్ణుని హృదయమున నెంత నీచత్వమున్నదో యీ యుత్తరమే దెల్పును. అది యిది.

"దృశ్యంతేవై వికర్ణేహ వైకృతాని బహూన్యపి

..... ..... .......

పాండవానాం చ వాసాంసి ద్రౌపద్యా శ్చ వ్యుపాహర!"

(భా. స. ప. అ. 67)

"ఓయి వికర్ణా! నీవు మూర్ఖుఁడవు ! ఏ యరణియం దగ్ని పుట్టునో యా యగ్ని యాయరణినే దహించునటు నీవు ధార్త రాష్ట్రులయందే పుట్టి వారికే సంతాపమునుఁ గలుగఁ జేయుచున్నావు. ఇక్కడఁ జేరిన పెద్దలందఱు నీకంటె ధర్మవిదులే! వారెల్లరు పాండవులు ధర్మముగనే జయింపఁబడిరని తలచుచున్నారు. ద్రౌపది 'దాసి' యైనదనియే వారి నిర్ణయము! అందుకే ధర్మసందేహమును దీర్పవలసినదని పాంచాలి యాచించినను వారెవ్వరు గూడ నామెకు బదులివ్వలేదు. నీవు మాత్ర మేదో ధర్మవిదునివలె మాటాడుచున్నావు. కనులు దెరువని బాలుఁడవై ప్రజ్ఞావాదములఁ బల్కుఁబూనుకొన్నావు. ఇటఁ జేరిన వారందఱు నీకన్న గొప్పవారే! నీవంటి మూర్ఖున కిట స్థానము లేదు. జూదమునందు ధర్మజుఁడు తన సర్వస్వ మోడినాఁడు. మఱి ద్రౌపదినిఁ గూడ నోడినట్లే గదా! నిండు సభలో ధర్మజుఁడు ద్రౌపదినిఁ బణముగా నొడ్డి జూదమాడెను. పణముగా నొడ్డుచున్నానని స్పష్టముగాఁ జెప్పెను. ఆ మాటకుఁ దక్కిన తమ్ములందఱు సమ్మతించిరి. ఇఁక నిది దాసి యెట్లు గాక పోయినది. రజస్వలయై యేకవస్త్రయైన స్త్రీని సభలోనికిఁ గొనివచ్చుట న్యాయమందువా? మూర్ఖా! దాని కుత్తరమును వినుము! దేవతలు ధర్మశాస్త్రానుసారము ఒక్క స్త్రీ కొక్క మగఁడే యని నిర్ణయించిరి. ఆ నియమమునకు విరుద్ధముగఁ బాంచాలి యేవురగట్టికొన్నది. అనేక పురుషులకు లోబడి వర్తించునది కులస్త్రీ యగునా? దానిని సాధ్వి

యనవచ్చునా? ధర్మశాస్త్రము ననుసరించి యది బంధకి, అనగా వేశ్య! అట్టిదాని విషయమున నేక వస్త్రయను విచారమే లేదు. వివస్త్రగనైనను దానిని సభలోనికిఁ గొని రావచ్చును. దుశ్శాసనా! ఈ వికర్ణుఁడేమియుఁ దెలియక తెలిసిన వానివలె భా.ఎంచుచున్నాఁడు. వీడు మహామూర్ఖుఁడు. వీని మాటలు వినకుము. అందఱి యెదుట బంధకియైన ద్రౌపది వస్త్రము లొలిచి దానిని వివస్త్రనుఁ గావింపుము. పాండవుల వస్త్రములు గూడ లాగికొమ్ము! నగ్నులైన వారి స్వరూపమును సభలోనున్న వారందరు కన్నులపండువుగఁ గనుగొందురుగాక!"

రథచక్రములు భూమిలోఁ గ్రుంగినవి. కర్ణుఁడసహాయుఁడైనాఁడు. అపుడర్జునుఁడు రాధేయుని శిరస్సును ఖండించెను. ఈ సన్నివేశము మనకు సూతపుత్రునిపై యనుకంప గల్గుట సహజమే! కాని యట్టివారు ద్రౌపదీ వస్త్రాపహరణ సందర్భమునఁ గర్ణుఁడు ప్రదర్శించిన యాసురికవృత్తిని మఱచిపోరాదని నా మనవి. ఆతఁడు దుశ్శాసనునితో నన్నమాట లెంత పాశవికములైనవో చదివితిమి గదా! కులసతియైన స్త్రీకి మానము ప్రధానాలంకారము. ఆమె మానమునుఁ బ్రత్యక్షముగ గాని పరోక్షముగ గాని భంగపఱుపఁజూచువాఁడు మహాదోషి! వాఁడు కఠినశిక్షార్హుఁడని యార్యనీతి శాస్త్రజ్ఞుల యభిప్రాయము! కర్ణునిపై సానుభూతినిఁ జూపించుసహృదయుఁ డెవ్వఁడు గాని రజస్వలయై యేకవస్త్రయగు మహాసామ్రాజ్ఞిని దుశ్శాసనుఁడు వెంట్రుకలు పట్టి యీడ్చికొని వచ్చిన తరుణమున వాఁడు ప్రవర్తించిన తెఱఁగునొక్కమారు జ్ఞాపకమునకు వచ్చినంతనే మనకు రాధేయునిపై గలిగిన జాలియంతయు ధూమమువలె నెగిరి పోవును. ద్రౌపదిని నగ్నగా నొనర్చుట కాజ్ఞాపించినవాఁడు గర్ణుఁడే! దుర్యోధనుఁడు గాఁడు! కర్ణుని స్వాతిశయము, యహంకారము, స్వార్థము, మాత్సర్యము నీచత్వమున నెంతటి పరాకాష్ఠ నందికొన్నవో మన మిప్పుడు యూహించికొనవచ్చును. ఈ సన్నివేశమునఁ గర్ణుఁడధమాధముఁడుగఁ బ్రవర్తించెను. స్వయంవరమున వాని కవమానమయ్యెను.

నాటినుండి రాధేయుఁడు పాంచాలిపైఁ బగదీర్చికొనుటకు గాఁచియే యున్నాఁడు. ఇప్పుడు వాఁడు ప్రదర్శించిన నైచ్యమున కంతటికిని మూలకారణ మా యవమానమే! ఇంతలో దైవికముగనొక చమత్కారముచే ద్రౌపది రక్షింపఁబడెను. తరువాతఁ గూడఁ గర్ణుఁడు దన యాసురికభావమును వదలలేదు. "ఈ దాసి నింటి కీడ్చికొని" పొమ్మని దుశ్శాసనునితోఁ బల్కెను. దుశ్శాసనుఁడప్పుడు గూడ మానినవాఁడు గాఁడు! మరల నామెవస్త్రములను లాగుటకై వాఁడు సన్నద్ధుఁడయ్యెను. ఇంతవర కోర్చికొని యున్నభీమునకు రోషము నాపికొను టసాధ్యమైనది. ఆతఁడు లేచి భయంకరమైన ప్రతిజ్ఞ లొనర్చెను. వానిని విన్నతరువాతఁ గూడ రాధేయుఁడు చలింపలేదు. వాఁడు ద్రౌపదితో నన్నాఁడు. "లోకమున మువ్వురు బరతంత్రులు! ఒకఁడు దాసుఁడు. మరియొకఁడు బుత్త్రుఁడు. మూడవది స్త్రీ. ద్రౌపదీ ! నీ మగలు కౌరవులకు గులాములైరి. నీ పై వారి కెట్టి యదికారమును లేదు. అందుచేత నీ విపుడు స్వతంత్రులైన కౌరవులకు దాసివైతివి. అనగా ధార్తరాష్ట్రుల కెల్లరకు భోగ్యవస్తు వన్నమాట! నీ కైదుగురు మగలుండిరి. అట్టి బంధకివైన నీకు నేఁడు ధార్తరాష్ట్రులు నూఱుమందియు మగలై నీ యుపభోగేచ్ఛను బూర్ణమొనర్తురు. షండులును, బరాజితులు నైన నీ మగలు నిన్నెట్లు రక్షింపగలరు? పాంచాల రాజపుత్రికయైన దన భార్యను ధర్మరాజు దాసిగా యొనర్చెను. దీనితో వాని పౌరుషము వమ్మయినది. జన్మసార్థక్యము గూడ వీసరవోయినది."

కర్ణుఁడీ మాటలన్న తరువాత నున్మత్తుఁడైన దుర్యోధనుఁడు నిండుసభలోఁ బెద్దలయెదుట దన యెడమతొడను జూపి, ద్రౌపదికి సైగఁజేసినాఁడు. వాఁడిట్లు ొయుటయు గర్ణుని ప్రేరణమే! ఈ కోలాహలము గాంచి ధృతరాష్ట్రుఁడు నుపడెను. సభాంగణమే రణాంగణ మగునేమోయని వాని భయము. ఆతఁడు పాండవులను దాస్యము నుండి విముక్తమొనర్చెను. కర్ణుఁడపు డిట్లు హాస్యమొనర్చి నాఁడు. "ఇంతవఱకును మనము రూపవతులైన స్త్రీల కీర్తినే బుష్కలముగ

వింటిమి. కాని ద్రౌపదివంటి క్రియాశాలినిని గురించి వినలేదు. పాండవులును ధార్తరాష్ట్రులును నొకరు నొకరు దున్నుకొన సిద్ధమైనపుడు, ద్రౌపదివంటి యాడుది శాంతిని బ్రతిష్ఠించినది. కల్లోలితమైన సముద్రమునందు మునిగిపోవుచున్న కౌంతేయులను భార్యయైన ద్రౌపది యొక నావయై రక్షించినది.

దుర్యోధనుని తోడి సఖ్యమైనదే మొదలు రాధేయుఁడు దన ఘనత యాతని కర్థమగుటకై యెంతయో యాతురతఁ బడెను. ఆతఁడు గడకు సుయోధనుని హృదయమును దనకుఁ గైవసమొనర్చికొనెను. అప్పటి నుండియు అంతవఱకు గౌరవపాత్రులుగ నుండిన భీష్మ ద్రోణాదుల నాతఁడు సమయము దొరికినపుడంతయు నెదిరించుచునే యుండెను. రాధేయుఁడు వారి పెద్దఱికము నేమాత్రము మన్నింపలేదు. దుర్యోధనుఁడు గూడఁ దన మనస్సులో నెంత యయిష్టమున్నను వారిని బాహాటముగ నెదిరించుటకు జంకెడివాఁడు. కర్ణున కిది సున్న. సుయోధనుఁ డనుటకు భయపడుచున్న మాటలన్నియు గర్ణుఁడు భీష్మద్రోణాదుల ననెను. నిండు సభలో వారిని గూర్చి కర్ణుఁడాడిన ప్రల్లదములకు లెక్కలేదు. "దుర్యోధనా! భీష్ముఁడు నీకు పితామహుఁడు గావచ్చును. ద్రోణుఁడు మనకు ధనురాచార్యుఁడే ! కాని రాచరికమునకు సంబంధించి నంతవఱకు వారు నీ మంత్రులు. నీ హితచింతకులుగ నిరంతరముఁ బని సేయవలసినవారు. కాని వా రాపని యొనర్పక కర్తవ్యవిముఖులైరి." ఇట్టివే కర్ణుని వాగ్విలాసములు! ఈ రీతి మంత్రుల యధికారమును గ్రమగ్రముగ నదలించుచు వచ్చిన రాధేయుఁడు కడకు వారి యధికారము గూడ దానే హస్తగత మొనర్చికొన్నాఁడు. ఈ ప్రయత్నమున నాతఁడెంతయో జాగ్రత్తగ మెలఁగెను. మాటిమాటికి దుర్యోధనుని హృదయము గూడ నాతఁడు బరీక్షించుచునే యుండెను. ద్రౌపదీ వివాహానంతరము పాండవులతో యాదవ పాంచాలురు జేరిరి. దానితో వారి కంతముందు కంటె కొంచెము బలము సేకూరినది. యాదవులు జేరుటకు ముందే పాండవులను

మట్టుపెట్టవలెనను ధోరణి ధార్తరాష్ట్రులలో నుండెను. మిత్రసంపత్తి లేనివారిని జయించుట సులభము గదా! ఒకసారి ఈ విషయమై కౌరవుల సభలోఁ జర్చ జరుగుచుండినది. భీష్మద్రోణు లీ వర్తనమును వ్యతిరేకించిరి. వారు సుయోధనునకు హితము నుపదేశించినారు. కర్ణునకీ మాటలు రుచింపలేదు. అతఁడు వారి నెదిరించినాఁడు. కర్ణుఁడెన్నియో దుర్భాషలాడెను. భీష్మద్రోణులు సుయోధనునకు సేవకమాత్రులే యనియు నాతని యాజ్ఞానిర్వహణమే వారికి విధియనియు సూతపుత్రుఁడు నొక్కి పలికెను. ఈ మాటలు సుయోధనుని హృదయముపైఁ గొంతపనిఁ జేసినవి. భీష్మద్రోణు లన్నచో నంతకు ముందాతని కున్న యళుకు, నాటినుండి కొంత కొంత సడలిపోఁ జొచ్చినది. కర్ణుని మాట లీ క్రిందివి.

"యోజితా వర్ధమానాభ్యాం సర్వకార్యే ష్వనంతరౌ

....... ....... .......

దుష్టానాం చైవ బోద్ధవ్య మదుష్టానాం చ భాషితం."

(భా. ఆ. ప. అ. 204)

"పరస్పరేణ భేదశ్చ నాధాతుం తేషు శక్యతే

....... ....... .......

రాజ్యార్థే పాండవేయానాం పాంచాల్య సదనంప్రతి.

(భా. ఆ. ప. అ. 202)

"రాజసేవకు లెప్పుడును యజమానునకు హితముఁ గోరవలెను. రాజ్యశక్తిని నిష్కంటక మొనర్చుటయు నరాధిపుని మర్యాదను హెచ్చించుటయు ముఖ్యముగ సేవకు లొనర్పఁదగిన హితము. దుర్యోధనా! నీ వంటి దురదృష్టవంతుఁడైన రాజును మున్నెన్నడు నేను జూడలేదు. భీష్మద్రోణులను వృద్ధు లగునంతవఱకు

నీవు పోషించితివి. వారి ధనమానములు నీ వొసఁగినవే! కాని లాభమేమి? వారి యెడల నీ యుపకారములన్నియు వ్యర్థమైనవి. హిత మొనర్చుటకు బదులు వారు నీ కహితము లొనర్పఁ బూనుకొనిరి. భీష్మాదుల మన స్సెప్పుడును కౌంతేయులపైఁ బడి కొట్టుకొనుచుండును. సత్యము విచారించినచో కౌంతయుల జయించుటకు నీ పరాక్రమమే జాలును. వీరిపై యాధారపడవలసిన యక్కఱయే లేదు. ఈ పెద్దల మనుకొను వారందఱును బరమ కృతఘ్నులు. నీ శత్రుపక్షము వారు."

"పాండవులయందు భేదోపాయము బ్రయోగించుటకు వీలు లేదు. వారెల్ల రొక భార్యయందు సక్తులు. అందుచే వారి మైత్రి దృఢమూలము! పాంచాలునకు ధనముపై నాశలేదు అతఁడౌదార్యవర్తనుఁడు. ఏ యాశఁజూపినను వారల నాతఁడు వదలి రాఁడు! పైఁగా ద్రుపదుఁడు వారికిఁ గన్య నొసఁగి మామ యైనాఁడు. ఇఁక వారి నాతఁడు వదలి వచ్చునా? కాని ద్రుపద రాజునకు గూడ మనము భయపడవలసిన యగత్యము లేదు. అతఁడు మనవిక్రమము నెదుర్పలేఁడు. కాని ప్రధానకీలక మొక్కటి గలదు. యాదవులు వారికి బంధువులు. వారు బలవంతులు. కృష్ణుఁడు మహారాజనీతివిచక్షణుఁడు. కనుక యాదవులు బాండవులతోఁ జేరకముందే మనము వారిని నాశన మొనర్పవలెను. ఈ పని హఠాత్తుగ జరగవలెను. పాండవులు నిర్జితులైన తరువాత ఆ విషయము గృష్ణునకుఁ దెలిసినను మనకు బాధలేదు. పాండవులే లేనప్పు డాతఁడింకెవరికి సాయమొనర్చుట? కనుక యెట్లు జూచినను కౌంతేయబలము దృఢమూలము గాకముందే వారిని బట్టి పాలార్చుట మంచిదని నా యభిప్రాయము. ఇదియే మనకు శ్రేయస్కరము.'

క్లిష్ట సమయములం దంతయు ధృతరాష్ట్రుఁ డెఱిగిన దొక్కటే యుపాయము. చెవిటివాఁడుగ నటించుట. కర్ణుఁడు భీష్మద్రోణ విదురాదులను బరిహాసమొనర్చుచునే పోయెను. దీనితోఁ గౌరవసభలో సచివసంస్థ యొక్క

పలుకుబడి క్రమక్రమముగ సన్నగిల్లెను. రాధేయుఁ డింతటితో నాగలేదు. ఆతఁడు దిగ్విజయములొనర్చెను. దుర్యోధనున కాతనిపై నమితగౌరవ మేర్పడెను. తన యాజ్ఞ తరువాత పలుకుబడి గల మాట కౌరవసభలోఁ గర్ణునిదే! ఈ రీతిగ భీష్మాదులకు రాధేయుఁడు గొఱుకరాని కొయ్యగఁ దయారైనాఁడు. దుర్యోధనునకుఁ గూడ నప్పుడప్పుడు రాధేయుని సాయము గావలసి వచ్చినది. వానికి రహస్యముగ భీష్మాదులపైద్వేషము. కాని వారిని బాహాటముగ నిందించు ధైర్యము లేదు. అందుచే సుయోధనుఁడు. దా ననవలసిన మాటలను గర్ణునినోటఁబలికించెడివాఁడు. ఉత్తరగోగ్రహణము, ఉద్యోగపర్వము వీనిలోని సన్నివేశము లీ విషయమును స్పష్టముగఁ దెలుపును. కురుపాండవులు దమతోఁ గలసి మెలసి వర్తించినచోఁదనకు నాశము దప్పదని కర్ణుఁడెఱుఁగును. దుర్యోధనుని సౌఖ్యము పెనవేసికొని యున్నది. కురుపాండవులకు సంధి కుదురనీకుండుటకై కర్ణుఁడొనర్చిన యుపాయములకు ?క్కలేదు. ఒక్కొక్కసారి యాతఁడు కేవల నీచముగఁ గూడఁ బ్రవర్తించెను.

"పాండవులు గాననవాస మొనర్చి మరలివచ్చినచో వారిని బట్టుట ?ష్టము. వారపుడు రాజ్యభాగ మడుగుట న్యాయముమగుటచే రాజులనేకు లా వైపు జేరుదురు. యుద్ధము జరగినచో ధార్తరాష్ట్రులకు విజయము సంశయాస్పదము. వనములలో నుండగనే పాండవులను బరిమార్పవలెను. అపుడు వారికి ?హాయసంపత్తి యుండదుగదా! కనుక వారిపైకి సైన్యము గైకొని వెడలి యడవులలోనే వధింపవలెను." ఈ యాలోచన లన్నియుఁ గర్ణుఁడొనర్చెను. ఈ సేతలు దనశౌర్యమునకుఁ గళంకముఁ గలిగించునని వానికిఁ దట్టలేదు. తన జీవితమంతయు హీనమైపోవుననియు రాధేయుఁడు దలంచలేదు. తన యభిప్రాయము దుర్యోధనుని చెవిలో నూదినాఁడు. వాని మాట కాక్షేపణ యేమున్నది? బ్రహ్మాండముగఁ గౌరవసైన్యములు గదలెను. కాని యింతలో నొక యాపత్తి గలిగినది. అది హఠాత్తుగ నేర్పడినదే! ఆ విషయమై భారతకారుఁడిట్లనెను.

"ఉపలభ్య తత: కర్ణో నివృత్య నయనే శుభే
.... ...... ....... .......
ప్రతిష్ఠి ధ్యా2 ధ తాన్ సర్వాన్ భగవాన్ లోక పూజిత: ।"

(భా. వ. ప. అ. 7)

కర్ణుఁడిట్లు పలికెను. "మనము సైన్యములఁ గైకొని వనముల కేఁగుదము. పాండవులఁ బట్టి వధింతము. ఏ యుపాయముచేత నైనను పాండవులను వధించుటయే మనకుఁ గావలసినది. వారి మరణమున మన సుఖమున్నది. ఇప్పుడు పాండవులు హీనస్థితియం దుందురు. శోకమగ్నులైన వారి కుత్సాహముండదు. మిత్రసంపద సున్న. సైన్యములు లేవు. మనము వారిని వధించుట కిదియే సమయము."

సేనాపతియైన కర్ణుని మాటలు విని ధార్తరాష్ట్రులు సైన్యసన్నాహములతోఁ గదలిరి. కౌరవసేన హస్తినాపురి దాటి వచ్చినది. ఇంతలో వారికొక్క యాటంకము గల్గెను. మధ్యేమార్గమున వ్యాసమహర్షి దారసిల్లినాఁడు. అతఁడు వారికి హితము నుపదేశించి వెనుకకుఁ బంపివేసెను.

కర్ణుఁడు దన యత్నముల నంతటితో వదలలేదు. మరల దుర్యోధనుని ఘోషయాత్రకుఁ బ్రేరేచి తన హృదయనైచ్యమును బయట బెట్టికొనెను. ఘోషయాత్రకు వెడలినారు. గంధర్వులు చుట్టుముట్టిరి. దుర్యోధనుఁడు పూర్తిగ నోడినాఁడు. పాండవులు విడిపించిరి. కళాహీనమైన ముఖముతో సుయోధనుఁడు వెన్కకు వచ్చుచుండెను. అతని మఱల నుత్తేజితు నొనర్పవలెనని రాధేయుఁడెంచెను. అపుడాతఁడు విచిత్రమైన యుక్తివాద మొనర్చినాఁడు. ఆ వాద మెంత విచిత్రమైనదో యంత నీచమైనది. కర్ణుఁ డన్నమాట లీ క్రిందివి.

"రాజన్న ద్యావగచ్ఛామి తవేహ లఘుసత్త్వతా

..... ... ....

శూరాశ్చ బలవంతశ్చ సంయుగే ష్వపలాయినః ॥

(భా. వ. ప. అ. 250)

"దుర్యోధనా! పాండవులు నీ రాజ్యమునకుఁ జేరిన యొకానొక వనమునందే వసించుచున్నారు. నీవు భూమండలమున కంతయు సార్వభౌముఁడవు గదా! కనుక నొకరీతిగఁ జూచినచో కౌంతేయులు నీ పౌరకోఁటిలోనివారే ! సంకటము లందున్న రాజాను రక్షించుట పౌరధర్మము. రాజు యుద్ధ మొనర్చుచున్నాఁడనఁగా సైనికులు పోరుచున్నారనియే గదా యర్థము? ఇంతకు ముందు పాండవులు జూదమున నీ కోడి దాసులైరి. వారు శూరులు బలవంతులు అట్లుండియు వారింతవరకు నీ కొక యూడిగ మైనను జేయకపోవుట వారి యపరాధము. నేఁడట్టి సేవ నొకటి జెల్లించిరి. దీనిలో వారి ఘనత యేమున్నది? అకారణముగ నీవు దుఃఖించు చున్నావు. లోకమునందలి రాజనీతి విశారదులు నీ బేలతనమును జూచి పరిహసింతురు. కనుక నీ వే మాత్రమును దుఃఖింపకుము. నా వెంట రమ్ము. హస్తినాపురమునకు మరలిపోదము."

కర్ణుని యుక్తివాద మెంత హీనమైనదో వేఱుగఁ జెప్పఁబనిలేదు. కర్ణునివంటి గుణసంపన్నుని గూడ నింత క్రింది కీడ్చిన దన్నచో యన్యాయజుష్టమైన మహత్త్వాకాంక్ష యొనర్చు దుర్మార్గముల నెంతని వర్ణింపవచ్చును? కురుపాండవులవైరము నానాటికిని బెంచి ప్రోదియొనర్చినవాఁడు రాధేయుఁడే! దుర్యోధనుని దురాలోచనలకు రాధేయుఁడొక యాశ్రయ స్తంభము. పాండవులపైకి దుర్వాసుని గమ్పించిన దుష్టప్రయత్నములోఁ గర్ణుని భాగము సామాన్యమైనదిగాదు. ఇంతమాత్రమే గాదు కర్ణుని దుశ్చరిత్రము. పాండవులు రాజసూయ మొనర్చిరిగదా!

నాటినుండియు దుర్యోధనుని హృదయమునఁ జింత జుట్టుకొన్నది. ఆనాటికి కప్పడి కర్ణునకే యపకారమును గూడఁ జేసి యెఱుఁగడు. కాని నిరపరాధియైన యర్జునునిపైఁ గత్తిగట్టిన రాధేయుఁడు బీభత్సుని వధింతుని భీషణప్రతిజ్ఞఁ బట్టెను. అతఁడన్న మాట లివి.

"త మబ్రవీత్తతాకర్ణః శ్రుణు మే రాజమంజిర !

........... ......... .........

అధోత్సృష్టం మహేష్వాసై ర్ధార్తరాష్ట్రై ర్మహారథైః ॥'

(భా. వ. ప. అ. 257)

"యుద్ధమున నర్జునుని వధించు వఱకును నేను తృప్తిపడను. అర్జునుని సంహరించు వఱకు నా పాదములను నీరువేసి కడిగి శుభ్రమొనర్చుకొనను. సేవకులచేఁ గడిగించుకొనను. క్షత్రియోచితములైన మద్యమాంసములను భుజింపను. కఠోరవ్రతస్థుఁడనై జీవింతును. నా దానశీలత త్రిజగత్ప్రసిద్ధమైనది. అడిగిన వాని కింతవఱకును లేదన్నది లేదు. ఆ దానశీలతపై నేర్పడిన పుణ్యముపై నొట్టువేసికొని చెప్పుచున్నాను. నేను ఫల్గునుని వధించితీరెదను."

కర్ణుఁడింతటి ఘోరప్రతిజ్ఞ నొనర్చుట కే కారణమును లేదు. అర్జునునితో నింతకుముం దాతనికిఁ బగలేదు. ఈ ప్రతిజ్ఞలోని హృదయము సుయోధనుని ప్రేమను సంపాదించికొనుటయే!

కురుపాండవుల మధ్య ద్వేషాగ్నిని సృష్టించి దానిని రగుల్కొల్పుట మాత్రమే గాదు. కర్ణుఁడింకను గొప్పపనులనే యొనర్చెను.దుర్యోధనుఁడు దన్నుఁ బూర్తిగ విశ్వసించెనని వానికిఁ దెలియును. అంతమాత్రామే గాదు. రాధేయున కాతడు బూర్తిగ లోఁబడిపోయినాఁడు. కడకు దుర్యోధనుఁడు సూతపుత్త్రునకుఁ బలుకుబండగఁ దయారైనాఁడు. భారతము కనుగలిగి చదివినచో నీ విషయమడుగునను

ప్పష్టము సుయోధనుడు గర్ణునకు వశమగుటతో సూతునిపాలికిఁ దేలుకుఁ బెత్తన మిచ్చినట్లైనది. అడుగడుగునను వాఁడు "యుద్ధము యుద్ధమ"ని కలవరించెను. అవసరమున్నను లేకున్నను గయ్యమునకుఁ గాలుద్రవ్వెను. ఉత్తరగోగ్రహణానంతరము గౌంతేయులు బయటఁబడిరి. అంతకుముం దేర్పఱచి కొన్న నియమము ననుసరించి వారు భాగమివ్వవలెనని ధార్తరాష్ట్రులను గోరినారు. పాండవులకడ నుండి సంధికై ద్రుపదపురోహితుఁడు కౌరవులపాలి కేతెంచెను. ద్రుపదపురోహితునితోఁ జర్చలు సాగినవి. అపుడు గౌరవసభలో ముఖ్యముగ విజృంభించినది రాధేయుఁడే! ధృతరాష్ట్రు నాతఁడు మాటాడనివ్వలేదు. మహామంత్రియైన విదురునిబలుకుబడి పోయినది. రాజ్యనియంత్రకుఁడైన భీష్ముని పల్కులు వినువారు లేరైరి. కర్ణుఁడు దుర్యోధనునితో మంత్రించికొని ద్రుపద పురోహితున కిట్లు జవాబుచెప్పెను.

"దుర్యోధనం సమాలోక్య కర్ణో వచన మబ్రవీత్

...... ...... .....

ఆపా ద్యేమాన్ కురుశ్రేష్ఠాన్ స్మరిష్యంతి వచో మమ॥

(భా. ఉ, ప. అ. 21)

"ఓయీ! బ్రాహ్మణా! చెప్పిన విషయములే మాటి మాటికిని జెప్పుచున్నావు. నీవు వచించినది మా కర్థము గాలేదనియా నీ యభిప్రాయము? దుర్యోధనునికొఱకై శకుని జూదమాడెను. ఆ ధర్మద్యూతమునఁ గౌంతేయు లోడిరి. నియమము ననుసరించి ధర్మరాజు వనమునకుఁ బోయెను. ఇపుడు మఱల పితృభాగమున కెట్లర్హుఁడయ్యెను? ఓడిన సొత్తు మఱల స్వత్వమగునా? అది గాదు లెమ్ము. ఈ నడుమ ధర్మరాజు గొంత మిత్ర సంపన్నుఁడైనాఁడు. మాత్స్య పాంచాలుర యండతనికిఁ గలిగినది. అందుచే నాతఁడు మమ్ము భయపెట్టఁ జూచుచున్నాఁడు. ఈ వేడుక లీ యెడ సాగిరావు. దుర్యోధనుఁ డెవ్వరికిని భయపడవలసిన

పని లేదు. బెదరింపు మాటలకు మేము లొంగము. నీ కొక మార్గమును దెల్పెదను వినుము. దాయభాగము ధర్మరాజునకుఁ గావలసినచో నాతనిని మరల వన వాసమొనర్చి రమ్మనుము. అటు తరువాతఁ గరుణించి యర్ధరాజ్య మొసఁగెదము. దుర్యోధన చక్రవర్తికి సామంతుఁడై మనుమని పలింపుము. ఈ వాదమున కంగీకరింపక యుద్ధమునకే దలపడినచో యుధిష్ఠిరుఁడు నా కోపాగ్నికి శలభమైపోవును."

కర్ణుని యీ పల్కులన్నియు ననధికృతములే! అధిక ప్రసంగములే! ఇట్టి పల్కులే రాఁబోవు యుద్ధమున కంకురార్పణమైనవి. ఎవరి యాజ్ఞల నెదురుచూడకయే గర్ణుఁడే మొదటినుండి యుద్ధభేరిని వాయింప మొదలుపెట్టెను. ఉత్తర గోగ్రహణమునఁ గర్ణునకుఁ దగిన శాస్తిజరుగనే జరిగినది. కాని యాతఁడా యనుభవమును మఱచి పోయెను. ఉత్తర గోగ్రహణమునఁ దనకు జరిగిన పరాభవమును జ్ఞాపకముంచికొని యాతఁడు గొంత వినయము ననుసరింపవలసి యుండెను. మెత్తని మాటల నాడవలసియుండెను. అట్లుఁ బ్రవర్తించియున్నచోఁ గురుపాండవుల యుద్ధము రాకయుండెడిదేమో! త్రికరణశుద్ధిగఁ గర్ణుఁడిచ్ఛగించియున్నచో భారత యుద్ధము నాతఁడు నిల్పియుండును. అతని కది యశక్యము గాదు. అనభిలషితము! ఒక వేళ భీష్మద్రోణాదుల మాటల కంగీకరించి దుర్యోధనుఁడు దాయభాగము నొసగియున్నచో యుద్ధము తటస్థపడకుండెడిది, కాని యప్పుడు రాధేయునకుఁ జిత్తశాంతిమాత్ర ముండెడిది గాదు. అతఁడెట్టైనను దుర్యోధనుని బాండవులపైకిఁ గవ్వించియుండెడి వాఁడే! స్వపరాక్రమమైక సాహాయ్యుండై యాతడు దిగ్విజయమొనర్చి దుర్యోధనుని సార్వభౌము నొనర్చియుండెడివాఁడు. పాండవులు రాజసూయయాగము చేసినపుడు యిట్టి సన్నివేశమే యేర్పడినది గదా! అపుడు పాండవులు స్వతంత్రులై వారణావతమందుండిరి. వారికాంతిముందు దుర్యోధనుని ప్రభ యెక్కి రాలేదు.

ఒకవేళ మఱియొకసారి రాధేయుఁడు దిగ్విజయ మొనర్చి దుర్యోధనుని జక్రవర్తి నొనర్చినను గలుగఁబోవు పరిణామ మింతే! ఈ విషయము సూతపుత్రునకుఁ బాగుగా దెలియును. దుర్యోధనునకే వైభవము జరుగనప్పుడు వాని నాశ్రయించియున్న తనకు మాత్ర మేమి జరగును. ఇపు డట్లుగాదు. పాండవులకు రాజ్యమేలేదు. దుర్యోధనుఁ డేకచ్ఛత్రాధిపతి. రాధేయుఁడాతనిని శాసించువాఁడు. పాండవుల కర్ధ రాజ్య మొసఁగినచోఁ దనకు పెద్దఱిక మేదీ? కనుక నిప్పుడు మిగిలినవి గర్ణునకు రెండే మార్గములు. లేదా జీవితాంతము, దా నొక సామాన్యుఁడై బ్రదుకవలెను. కీర్త్యాశ వదలుకొనవలెను. కాకున్నచో, భారత మహాసంగ్రామమును రేపి, దానిలోఁ బాండవుల వధించి, శాశ్వతముగఁ గీర్తి శిఖరముల నధిరోహింపవలెను. ఈ రెంటికిఁ దప్పినచో మూఁడవ మార్గ మొక్కటే! మహాయుద్ధమునఁ దాను పాండవులచేత మరణింపవలెను. కర్ణుఁడు మహాస్వాతిశయము గలవాఁడు. ఆతని యున్ని యాదర్శములును యీ భావమునకుఁ గ్రిందే! కనుక నతని జీవితము తిశయమే బ్రధానముగ నడపించినది, భారత యుద్ధమునే యాతఁడు వలచెను. నాశమున కంగీకరించెను. నాటి సమాజము దనపై నొక దారుణ క్రియ పినది. స్వశక్తితోఁ గొప్పవాఁడగుటకన్నను దనకు వేఱు మార్గము లేదు. ఈ భావములతో రాధేయుఁడు దుర్యోధనున కెన్నియో రీతుల నెక్కులు వెట్టినాఁడు .ధార్తరాష్ట్రుఁడు బాండవులతో వైరము బెట్టికొన్నది కర్ణుని బాహుబలమును నచ్చియే! ఈ విషయమందఱకును దెలియును. ధృతరాష్ట్రునకు గూడఁ గర్ణునిపై నిట్టి యాశయుండెడిది. సూతపుత్రుడు మరణించినపుడు ధృతరాష్ట్రుఁ డిట్లుపలవించినాఁడు.

"య మాశ్రిత్య మహాబాహుం విద్విషాం జయకాంక్షయా
దుర్యోధనో ऽకరో ద్వైరం పాండుపుత్త్రై ర్మహారథైః॥

(భా, కర్ణ. ప. అ. 8)

"కురు పాండవ భీషణ మహాయుద్ధమునకుఁ గేవలము కర్ణుని మహత్వాకాంక్షయే కారణము. వాని స్వాతిశయమే దాని నాహ్వానించినది. అభిమాన వశమున నాతఁడు ఫల్గునునిపైఁ బగఁబట్టెను. కర్ణుని యాత్మశ్లాఘ కంతు లేదు. అర్జునుని పేరెత్తినచో నాతఁడు మండిపడును. కవ్వడిలో నిజముగ నున్న గుణములనైనను కర్ణుని యెదుట నెవ్వరు బ్రశంసింపరాదు. అట్లొనర్చినచో నాతఁడు రోషమున విఱిచికొని పడును. చిన్న పెద్ద తారతమ్యములు లేక మాటాడును. కౌరవ సభలో వీరులు దమలోఁ గలహించికొనుచుండిరి. ఆ కలహములలోఁ జాల పాటికిఁ గర్ణుని యాత్మశ్లాఘయే కారణము. ఒకసారి కర్ణుని గృపాచార్యుఁ డిట్లు వర్ణించెను.

"బాహుభిః క్షత్రియా శ్శూరాః వాగ్భి శ్శూరా ద్విజాతయః
ధనుషా ఫల్గున శ్శూరాః కర్ణ శ్శూరో మనో రథైః "
(భా. కర్ణ. ప. అ. 258)

"క్షత్రియులుబాహుబలముతోశూరులు.ద్విజాతులువాక్శూరులు.అర్జునుడు ధనుస్సునశూరుఁడు.కర్ణుఁడుమనోరథములలోమహాపరాక్రమవంతుఁడు."

కర్ణుని యాత్మశ్లాఘ కింతకంటెను రమ్యమైన యుదాహరణ యొకటి గలదు. అది ద్రోణపర్వమున జరిగిన కలహము. దానినిఁ దిలకింతముగాక!

"కర్ణ ఉవాచః-
పశ్య త్వం గర్జిత స్యాస్య ఫలం మే విప్ర పాండవాన్
...... ..... .......
తత్త్వాస్తే ఖడ్గ ముద్యమ్య జిహ్వాం ఛేత్స్యామి దుర్మతే!"

పై సంవాదము సైంధవవధలోనిది, నాఁడర్జునుండపూర్వముగ విక్రమించెను. కవ్వడి యానాఁడు గర్ణుని సంపూర్ణముగఁ బరాభవించినాఁడు. ఎదిరిన

సైన్యమునంతయుఁ దుత్తునియ లొనర్చెను. విక్రమశీలుఁడైన యాతఁడు భయంకరముగ గర్జించుచుండెను. అతని యీ గర్జనలకుఁ గౌరవసైన్యము గంపించి పోయెను. అపుడపుడే ఫల్గునున కోడిపోయిన కర్ణుఁడు దుర్యోధనునాశ్వాసింప వచ్చినాఁడు. అపుడు గర్ణుఁడు కృపాచార్యునితో నిట్లువచించుచున్నాఁడు. "నే నిప్పుడు గర్జింతును. దాని ఫలమునుగూడ మీకుఁ ద్వరలోనే జూపింతును. యాదవులతోఁ గూడఁ గృష్ణుని జయించి పాండవుల నిప్పుడే మట్టువెట్టెదను. దుర్యోధనునకు రాజ్యమొసఁగెదను."

ఇంతకుముందుగనే యర్జునునిచేత రాధేయుఁడు బరాభవింపఁ బడినాఁడు. మఱల వీరాలాపము లాడుచున్నాఁడు. కర్ణుని యీ చేష్టకెవ్వరికైన నవ్వు వచ్చును. కృపాచార్యున కట్లే నవ్వు వచ్చినది. వారిట్లనిరి.

"కర్ణా! నీవా యుద్ధమున శ్రీకృష్ణుని జయించువాఁడవు? ఈ మాటలనుట నీ దుస్సాహసము. ఔద్ధత్యము, అంతే!" కృపాచార్యుని పలుకులు ి కర్ణుఁ డగ్గిలేకయే యుండినాఁడు. వాఁడు వెంటనే యందుకొనెను. "ఓయీ! ాహ్మణా! ఇంకేమియును బలుకకుండుము! మరి మాటాడితివా నా ఖడ్గముతో నాలుకను ఛేదింతును."

మేనమామకు జరిగిన యీ యవమాన మశ్వత్థామ కసహ్యమైనది. వెంటనే యాతఁడు రాధేయుని పైకి దూకినాఁడు. ఆతఁడనెను.

"ఓయీ కర్ణా! నీవు నరాధముఁడవు. కృపాచార్యులు గుణగ్రహణ బుద్ధిగలవారు. వా రర్జునిలోనున్న గుణములనే వక్కాణించిరి. నీకును ఫల్గుననకును బోలిక యెక్కడ? అతఁడు నిజమైన శూరుఁడు. నీవు వాక్శూరుఁడవు. అహంకారివి. అర్జునుఁడు నిన్నుఁ బరాభవించి సైంధవుని తలఁదరుగునప్పుడు నీ వీరాలాపము క్కడికిఁ బోయినవి? అస్త్రము లే యేటఁబడినవి? అర్జునుఁడు మహాదేవునితో

బోరాడి పాశుపతమును దెచ్చెను. నిన్నాతనితోఁ బోల్చికొనుట మూర్ఖత్వము. దేవేంద్ర సహితులైన దేవతలైనను కృష్ణునితో గూడిన యర్జునుని జయింపలేరు. ఇఁక నీ వా - జయించునది? ఇంతకుముందే పరిభవింపఁబడితివి. దాని నప్పుడే మఱచితివా? మూర్ఖా! నిన్ను జయించుట కర్జునుఁడు గావలెనా? నేనే నీ తలఁదరిగెదను. కాఁచికొమ్ము" అశ్వత్థామ యింతగా విజృంభించు వఱకును, రాధేయుని వాక్ప్రసారము దగ్గినది గాదు.

ఇట్టి ఘట్టమే మఱియొకటి - యుత్తర గోగ్రహణమున వచ్చును. ధార్తరాష్ట్రులు విరటుని గోవులఁ బట్టిరి. వారితోఁ బోరుట కర్జునుఁడు వచ్చెను. ద్రోణులాతని గుర్తించిరి. శిష్యుని జూచినంతనే వారి యుత్సాహము మిన్నంటెను. ద్రోణు లర్జునుని బొగడిరి. ఈ ప్రశంస విన్నంతనే, కర్ణుఁడు ధుమధుమ లాడెను. అతఁడన్నాఁడు:

"పర్వా నాయుష్మతో భీతాన్ సంత్రస్తానివ లక్షయే

...... ....... ......

రథేషు వాపి తిష్ఠంతో యుద్ధం పశ్యంతు మామకం"

(భా, విరాట. ప. అ. 48)

"అర్జునుని గుణములఁ బ్రశంసించుచుండుటయే మీకుఁ బనియైనట్లున్నది. అందుకై లేనిపోని గుణములను గలిపించి యాతఁడు గొప్పవాఁడని నిరంతరముఁ జెవినిల్లుఁగట్టికొని పోరుచుందురు. నిజమునకుఁజూచినచో నర్జునుఁడు నాలోఁబదునాలవపాలును బోలఁడు. దుర్యోధనున కీడురాఁడు. సుయోధనా! నీ వీ ద్రోణాదులమాటలు వినకుము. నామాట బట్టి నడవుము. ద్రోణులకు శిష్యునిపై నెక్కువ మమకారము. అందుచే నాతఁడు నిరంతరము వాని కల్యాణమునే గోరుచుండును, మన కహితమును గూడ! ధార్తరాష్ట్రులను నిరంతరము నిరుత్సాహ పఱచుటయే యాతని పని. అర్జునుని బ్రహ్మాండముగ వర్ణించి మన సైనికులలో

భయమును గలిపించుట కాతని యెత్తులు. ఆ భయముతోఁ గౌరవులు సరిఁగా బోరక సంగరమున నోడి పోవలెనని ధనురాచార్యుని యిచ్ఛ! మీయం దాతనికి గూఢద్వేషము. అందుచే ద్రోణాదులు నీవైపున నున్నను, నీకు ( జేదుగఁ బలుకుచు మన పరాభవమునే యాకాంక్షించుచుందురు. ధనురాచార్యులకుఁ బాండవులపైనున్న ప్రేమ జగద్విదితము. పాండవులు రాజులై వారికడ, ధనురాచార్యపదవి నిర్వహింపవలెనని ద్రోణుల పేరాస! అందుకై సంతతము వారిని స్తుతించుచుండుటయే దనకర్తవ్యమని ద్రోణులెంచినారు. అతని యొక్కొక్క వాక్యము విన్నపుడును నాకాశ్చర్య మగుచుండును. గుఱ్ఱములు సకిలించుచున్నవట! ఆకాశమున మేఘములాక్రమించినవట! మేఘములు గర్జించుచున్నవి. ఇవన్నియు నపశకునములట! ద్రోణుని వచనము లెంత బాగుగా నున్నవి. గుఱ్ఱములు సకిలింపక మఱియేమిసేయును? మేఘము లాకాశము నాక్రమించుట సహజమే? అవి గర్జించుటయు స్వభావమే! ఇందులో నాశ్చర్యమేమున్నది? ద్రోణుఁడు నీహితచింతకుఁడు గాఁడు. ముమ్మాటికిని బాండవులు గెల్చుటయే యాతని యభీష్టము. ద్రోణుఁడు ధనుర్విద్య నెంతనేర్చినను జాతితో నాతఁడు బ్రాహ్మణుఁడు. విప్రులు సహజముగ దయాశీలురు. తపస్వులు. భీతి గల వారు. కర్మరులు. క్షత్రియులు మానధనులు. ప్రాణములు గైకొనుట, యొసఁగుట, క్షత్రియుల పాలి కొక క్రీడ! ఇట్టి పనులలో బ్రాహ్మణులు బ్రవేశించినచో - నవకతవకలు ఘటిల్లితీరును. ఇందులకు ద్రోణుని వర్తనమే సాక్ష్యము. పండితులను యుద్ధమునకుఁ బిల్చికొని రావచ్చునా? తీరిక సమయములలో సంభాషించుటకే వారర్హులు. యజ్ఞములు జేయించుట, శాస్త్రశిక్ష నొసఁగుట - తత్త్వజ్ఞానమనెడు వ్యర్థసల్లాపములతో లోకమును రంజింపఁజేయుట, యివియే విప్రులకుఁ దగినపనులు. వారు భోజన శూరులు. యుద్ధములను గుఱించి వారి యభిప్రాయమును నడుగుట, యది యవివేకమే! ద్రోణాచార్యులపల్కుల విని మీరందఱు,

భయపడినట్లున్నది. ఈ వచ్చుచున్నదర్జునుఁడే యైనచో - మనము వెఱవ వలసిన పని యేమున్నది. సంతోషపడవలెను. మహా సముద్రమును చెలియలికట్టు నిలుపునట్లు, నేను కవ్వడి పరాక్రమమును నివారింతును. నాధనుస్సునుండి వెడలు నతపర్వములైన బాణములు, సర్పములు వోలె నర్జునునిపైఁ బడును. సుతీక్ష్ణాగ్రములైనయవి, పాదపమును శలభములవోలె, ఫల్గును నాపాదమస్తకము నాక్రమించునుగాక! మౌర్వ్యాహతములైన నాశరసంఘముల ధ్వని, భేరీ నినాదమువలె మీకుత్సాహమును గల్గించును. గుణవంతుఁడైన బ్రాహ్మణునివలె, నర్జునుఁడు ప్రధానాతిథ్యమునకర్హుఁడు. పాండవులయం దాతఁడు గొప్పవాని వలె వర్తించును. కౌరవులలో మొనగాఁడని నాకును బేరు గలదు. మాయిర్వురి శరౌఘము లాకసము నాక్రమించినపుడు చూపరులకాశ్చర్యమును గల్గించును. దుర్యోధనుఁడింతవఱకును నన్ను మన్నించి గౌరవించెను. ఆ యప్పు దీర్పవలసియున్నది. అర్జునుని వధించి దుర్యోధను ఋణము నీఁగి కొందును. పిడుగుపాటునకు బెదరిన మద కుంజరము వలె నర్జునుఁడు నా బాణములకుఁ దికమకలాడుగాక! అర్జునుఁడు వీరులలో శ్రేష్ఠుఁడు. అతిరథులలో వరిష్ఠుఁడు అయిననేమి? గరుఁడుడు సర్పములను వధించినట్లు నేను వానిని గీటడగింతును. ఇదేయీ నా ఖడ్గము. ఇది యగ్నివలె దుర్ధర్షము - శత్రువుల నిది తెగఁగాల్చును. ఈ బాణములు, యీ శక్తి పరభయంకరములు. ఈ యాయుధములు కిరీటికోప మినుమడింపఁజేయును. కవ్వడి మహామేఘము వంటివాఁడు. వర్షధారలవంటి వాతని శరధారలు. రథధ్వనియే పిడుగులు. అశ్వవేగమే యాతనికి పురోగచ్ఛన్మారుతము. అట్టి యా యర్జునమేఘమును నేనడఁగింతును. మద్ధనుర్విముక్తములైన బాణములు వల్మీకమును పన్నగములవలె ఫల్గుని దేహముఁ బ్రవేశించునుగాక! నాబాణములుదగిలి యాతని యాపాదమస్తకము రక్తసిక్తమైపోవును. అర్జునుఁడు పర్వతోన్నతుఁడు. మద్బాణవిదారిత శరీరుఁడైన యాతఁడు, కర్ణికారములచే నిండిన మహాపర్వతమువలె మీకు

సంభ్రమాశ్చర్యములను గలిగించును. దుర్ధర్షుఁడైన పరశురాముఁడు నాగురువు. ఆతనిదయతో నేననేకాస్త్రములు సంపాదించితిని. ధనుర్విద్యా విశారదుఁడైన నేను, వాసవునకు వెఱువను. అర్జునుఁడేమిలెక్క!! మచ్చర నిర్దళితుఁడై యర్జునుని ధ్వజమునందుఁ గూర్చున్న హనుమంతుడు, కహకహారావములతో భూమిపైఁబడును. కవ్వడి రథధ్వజము నాశ్రయించి, యనేక భూతములు వెలుఁగుచున్నవి. వానినెల్లఁ జెదరఁగొట్టెదను. ఆ పిశాచముల యాక్రోశములచే భూమ్యాకాశములు నిండిపోవునుగాక! అర్జునుని గుఱించిన చింత దుర్యోధనుని హృదయమున నెన్నియేండ్లనుండియో గలదు. అది యాతని మనస్సును శల్యమై యేర్చుచున్నది. నేఁడు దానిని సమూలముగఁ బెరికివేయుదును. హతాశ్వుఁడై-విరథుఁడై,పౌరుషహీనుఁడై,నాగమువలె నిశ్వసించుచున్నపార్థుని - కౌరవు లుత్సాహమునకుఁ గొందురుగాక! నేనొక్కఁడనే గవ్వడితోఁ బోరుదును. ఇఁకఁ దక్కిన వీరులతోఁ బనియేమున్నది. మీరందఱు గావలసిన ధనములు గ్రహించి యిండ్లకేఁగుఁడు. లేకరథములపై నిలచి - మాయిర్వురి యుద్ధమును దిలకించుచుండుఁడు."

కర్ణుని యాత్మశ్లాఘకు సంబంధించిన యుదాహరణములు భారతమున ననేకములు. మచ్చునకు రెండు జూపితి నంతే! మాటి మాటికి దన్నుఁ బొగడుకొనుటచే, లోకము "దన్నునర్జునునితో సమానుఁడనుకొను" నని రాధేయుఁడు భ్రమపడినాఁడు. కాని, పరాక్రమమున నర్జునునితోఁ గర్ణునకుఁ బోలికయే లేదు.

## కర్ణుఁడర్జునునకంటెను పరాక్రమవంతుఁడా?

భారతమంతయు వెదకినను, రాధేయుఁడర్జునునోడించిన ఘట్టమొకటియుఁ గానరాదు. కాని కర్ణుఁడోడిన సన్నివేశములు పరశ్శతములు. కర్ణుఁడెదిర్చినప్పుడంతయుఁ గవ్వడిచే నోటమియే సంభవించినది. సంభవింపని ఘట్ట మొకటియు

లేదు. కొందఱిట్లందురు. కృష్ణుఁడుండబట్టి పృథా పుత్త్రుడు బ్రదికిపోయినాఁడు. లేకున్నచో, నర్జునుఁడు రాధేయుని బారిఁబడి సమసి యుండెడివాఁడే! ఈ వాద మాధారము లేనిది. కృష్ణుఁడు లేనప్పుడు గూడ నర్జునుఁడు సూతపుత్త్రునెన్ని యో సారులోడించెను. ద్రౌపదీస్వయంవరమున నిట్టిఘట్టమే దాపరిల్లినది. పాండవులు బ్రాహ్మణ వేషధారులై యటఁ బ్రవేశించిరి. అర్జునుఁడు మత్స్యయంత్రము వేయుటతోఁ గలహము జెలరేగినది. కర్ణుఁడు గవ్వడిపైఁ బడినాఁడు. అర్జునుఁడు తీక్ష్ణపుంఖములైన శరములను బ్రయోగించెను. వాని ధాటికి రాధేయుఁడు సంభ్రమించెను. అప్పటి కింకను బ్రాహ్మణ వేషముననున్న వాఁడర్జునుఁడని కర్ణునకుఁ దెలియదు. పరువెత్తి పోవుట కొక సాకు రాధాపుత్త్రుఁడు వెదకికొన్నాఁడు. ఆ సమయమున ( గూడ నాతఁడాత్మశ్లాఘను మఱువలేదు. కర్ణుఁడిట్లనెను.

"తుష్యామి తే విప్రముఖ్య! భుజవీర్యస్య సంయుగే

....... ....... .......

ఏవ ముక్త స్తు రాధేయో యుద్ధా త్కర్ణో వ్యవర్తత।

(భా. ఆ. ప. అ. 190)

"ఓయీ! బ్రాహ్మణా! యుద్ధమునఁజూపిన భుజబలమునకు సంతోషించితిని. ధనుర్విద్యయందలి నీ కౌశల్యము శ్లాఘాపాత్రముగనున్నది. నీవు మూర్తిభవించిన ధనుర్వేదము. దేవేంద్రుడు లేక శ్రీమహావిష్ణుఁడ వగుదువు. నాతో యుద్ధ మొనర్చుటకుఁ బ్రతిచ్ఛన్నస్వరూపుడవయి వచ్చితివి, నన్నెదుర్ప గలవారిద్వరే? ఒకఁడు శచీపతి! రెండవవాఁడర్జునుఁడు. వీరిద్వరు దప్ప ద్వంద్వయుద్ధమున నన్నెదుర్పగలవారు ముల్లోకముల లేరు. కాని పాండవులు లాక్షా గృహమున దగ్ధమయిరి. అందుచే నీ వర్జునుఁడవు గానేరవు."

పరాభవము నొందినను కర్ణుని గర్వము చావలేదు. వాని యౌద్ధత్య

మర్జునునకు వేడుకఁ గల్గించినది. ఆతఁడిట్లు బదులువల్కెను. "కర్ణా! నేను మూర్తీభవించిన ధనుర్వేదమునుగాను, పరశురాముఁడనుగాను, నేనొక బ్రాహ్మణ మాత్రుఁడను. గుర్వనుగ్రహమున విద్యలఁ బడసితిని. బ్రహ్మాస్త్రము నాయధీనము! ఇంతకు నేనెవఁడైన నీకేమి? నీవు నాకుఁ బ్రతిపక్షివై నిలచితివి. నన్ను వధించుటయో, వధింపఁబడుటయో నీ కర్తవ్యము! సుస్థిరుఁడవై నిలువుము."

దానిపైఁగర్ణుఁడొక్క యుపాయమును వెదకెను. విప్రులతోఁ బోరనని యాతఁడు వెనుదిరిగినాఁడు. ఇది కేవలము యుక్తివాదము.ఇది యెవ్వరికైనను దెలియును. విప్రుని గౌరవించుటయే రాధేయుని యుద్దేశ్యమైనచో, నాపని నింతకుముందేఁ జేయవలసియుండెను. కాని యట్లు జరుగలేదు. కర్ణుఁడు భయపడినది, కిరీటిలోని బ్రహ్మతేజస్సునకు గాదు. క్షత్ర తేజస్సునకు. ఒక్క యర్జునునకే గాదు. కర్ణుఁడెందరికో యోడి పరువెత్తి పోయినాడు. ఉత్తర గోగ్రహణమునఁ గర్ణుని కిట్టి పూజయే జరగినది. అపుడర్జునుని వెంటఁ గృష్ణుఁడు లేఁడు. ఉండినది యుత్తరుఁడు మాత్రమే! తల, మొల, యెఱుఁగక రాధేయుఁడు బరువెత్తెను. ఇంతమాత్రమేగాదు. భారత యుద్ధమున నిట్టి ఘట్టము లనేకములు. కర్ణుని యెట్టయెదుటనే, యాతని పుత్త్రుని, నర్జునుఁడు యుద్ధమునకుఁ బిల్చి పోరి, భీకరముగ వధించెను. తరవాతనే కర్ణవధ జరిగెను.

కర్ణుఁడు పరాక్రమవంతుఁడే. కాని యర్జునునితో సమానుఁడనుట మాత్రము - నేతిబీరకాయవంటిమాట.

## శ్రీకృష్ణుని భేదనీతి

కౌరవులలోఁ గర్ణునకుఁగల పలుకుబడి జనార్దనునకుఁ దెలియును. కురుపాండవ యుద్ధమును నిలుపఁదలచుకొన్నచోఁ జేయఁగలవాఁడు రాధేయుఁడొక్కఁడే నని యు గృష్ణుని యభిప్రాయము. దుర్యోధనున కున్నది కర్ణుని యంగబలమే!

ఆతఁడు గొంత వేత్రైనచో, సుయోధనుని యూహలన్నియుఁ జిటికెలోఁ జల్లారిపోవును. కాని వారిరువురి స్నేహబంధము మాత్రమతిదృఢమైనది. వారి నిర్వురను విడదీయుటెట్లు? ఆ యుపాయము జూచాయగా నైనఁ దెలిసినది కృష్ణున కొక్కనికే! కౌరవుల కడకు రాయబారము వచ్చినపుడు, కృష్ణుఁడాయుపాయమును గర్ణునిపైఁ బ్రయోగించెను. ఆ యుపాయము సాగివచ్చెనా? కురుపాండవ యుద్ధము నిలచును. అంతకన్నను మించిన ఘనకార్యమే లేదు. కృష్ణ రాయబారము ముగిసిన వెనుక, విదురాదులైన కురు ముఖ్యులు, జనార్దనుని సాగనంప వచ్చిరి. వీరందఱు హస్తినాపురమును దాటి గూడ గొంతదూరము వచ్చిరి. కురుముఖ్యులతో సముచితములైన మాటలాడి కృష్ణుఁడు వారిని వెన్కకంపి వేసెను. కర్ణుని మాత్రము మఱికొంత దూరము నాతో రమ్మని సైగజేసెను. రాధేయుఁడు రథస్థుఁడై జనార్దనుని వెంటఁబోయినాఁడు. అపుడు దిన్నగాఁ గర్ణుని జన్మ వృత్తాం తమును కృష్ణుడారంభించెను. పాండవులు సూతపుత్రుని తమ్ములని, యాతఁడు విప్పి చెప్పెను. కాని యప్పటికే కురు పాండవుల మధ్య ద్వేషములు పెరిగిపోయినవి. అట్టిస్థితిలో నేది యెట్లున్నను, గర్ణుఁడు కౌరవుల విడిచి వచ్చుటకు వీలులేదు.

కృష్ణుఁడు గర్ణునిపై బ్రయోగించిన యుపాయము విఫలమయ్యెనని చాలామంది విమర్శకులమతము. కాని నా యూహ యదిగాదు. కృష్ణుని రాజనీతి పూర్తిగ విఫలముగాలేదు. కర్ణుఁడు వానినిఁ బూర్తిగఁ జంపివేసినాఁడు. కౌంతేయులు తన తమ్ములని తెలిసినంతనే, రాధేయునకు వారిపైనున్న ద్వేషము సన్నగిల్లి పోఁజొచ్చెను. ద్రౌపదిపైఁ దానెన్ని యత్యాచారము లొనర్చెను! అవి యన్నియు నొక్కటొక్కటే, రాధేయుని నేత్రముల ముందు నిలువసాగెను. ఆతని హృదయమంతయుఁబశ్చాత్తాపముతోఁ గాయమయ్యెను. తానొనర్చిన యిన్ని పాపములకుఁ బ్రాయశ్చిత్తము, రాబోవు యుద్ధమునఁ గౌంతేయులచేతిలో వధింపఁబడుటయే. కర్ణునిలో నీ మార్పు గలుగవలెననియే కృష్ణుని యభిప్రాయము!

ఆయత్నమున సంపూర్తిగ నతఁడు సఫలుడైనాఁడు. అప్పటివఱకు, పాండవులను నేను వధింతునని ఘోరప్రతిజ్ఞ లొనర్చుచున్న కర్ణుని మనస్సు నిముసములో మారిపోయెను. తమ్ములైన పాండవులపై నిష్కారణముగఁ దా నత్యాచారము లొనర్చెను. దీనికి బ్రాయశ్చిత్తము గవ్వడిచేఁ దాను వధింపఁబడుటయే. ఈ విషయమే, రాధేయుఁడు గృష్ణునితో నిట్లు స్పష్టముగఁ జెప్పెను.

"యదబ్రువ మహం కృష్ణ! కటుకానిస్మ పాండవాన్

...... ...... ......

హతేశ్వరా నష్టపుత్రా హతనాధాశ్చ కేశవ!

(భా. ఉ. ప. అ. 141)

"కృష్ణా! పాండవులు నా తమ్ము లంటివి. వారి నింతవరకు నేనెంత యేడ్పించితిని! నాకు వారే యపరాధముగూడ నొనర్పలేదు. కాని, నేనుమాత్రము వారిపై, యకారణముగఁ గక్ష కట్టితిని. సుయోధనునకుఁ బ్రీతిగ నుండుటకై వారి ననేకవిధముల దూలనాడితిని. ఈ కార్యము నా హృదయమును దహించుచున్నది.

నేనుఁ గిరీటి చేతిలో యుద్ధమున మరణింపవలెను. భారతయుద్ధమున నామరణము సంభవించినపుడే, పాండవుల రణయజ్ఞమునకుఁ బునశ్చిత్తి జరగుచున్నది. భీముఁడు విజృంభించి దుశ్శాసనుని రక్తముఁ ద్రాగితీరును. కహకహారావ భయంకరుఁడైన యా భీముఁడట్లు విక్రమించినపుడే రణ యజ్ఞమున 'సూయ' మను కర్మ ముగియును. ద్రోణులను ధృష్టద్యుమ్నుడును, భీష్ములను శిఖండియు వధింతురు. ఇర్వురు పాంచాలు రాపని యొనర్చిననాఁడే యజ్ఞావసానమగును. భీముఁడు, దుర్యోధనుని తొడలను గదతో భేదించి తీరును. నాఁడా యజ్ఞము సాంగోపాంగముగా ముగియును. ధృతరాష్ట్రుని కోడండ్రు,

బిడ్డలు, మొదలైన యంతఃపురమంతయు, హతేశ్వరులై, ఘోరముఁగ విలపింతురు. ఇది తప్పదు."

కృష్ణుఁడు జెప్పిన పలుకులతో రాధేయుని హృదయమెంతయో మారినది. ఆతఁడు బశ్చాత్తాపముతోఁ బొట్టు పొరలగుచుండెను. అటుతరువాతనే యాతఁడే గుంతీదేవికి, "అర్జునుని దప్పతక్కిన పాండవులను వధింప" నని మాట యిచ్చెను. ఈ ప్రతిజ్ఞను నిలుపుకొనెనుగూడ. దేవేంద్రుఁడీ తన సహజ కవచకుండలములను ముందే హరించియుండెనుగదా! ఇంద్రుఁడు, రాధేయుని కొక శక్తిని బ్రసాదించి యుండెను. దానినిఁ గర్ణుఁడు ఫల్గునునిపైఁ బ్రయోగింపఁ దలచెను. కాని, దానిని ఘటోత్కచునిపై వేయవలసి వచ్చినది. ఇది కర్ణునకు జరగిన రెండవ వంచన. ఇఁక మూఁడవ యనుత్సాహ కారణము. శల్యుఁడొనర్చిన పని. శల్యునివంటి మాననీయుఁడైన క్షత్రియుఁడు, యిట్టినీచమైన పని కొడిగట్టి యుండఁడని చాలమంది యభిప్రాయము. విదేశీయ విమర్శకులే గాక, భారతీయులలోఁ గూడ కొందఱు పండితులిట్లే వాదించిరి. మహారాష్ట్ర దేశమున, తొట్టతొలిసారి, "శ్రీ చింతామణి వినాయక వైద్య" మహాశయులు, సంస్కృత భారతమును సంస్కరించి ప్రకటించిరి. వారికిఁగూడ నీసందేహమే గలిగినది. వారీ భాగమువంతయుఁ బ్రక్షిప్తమని, గ్రంథమంతయు పూర్తియైన వెనుక, కట్టకడపట ముద్రించిరి. తమ తర్కమునకు నిలువని దానినంతయుఁ, బ్రక్షిప్తమని త్రోసివేయుటలోఁ బాశ్చాత్యవిమర్శకులు దక్షులు, ఆ వాసనయే నేఁడు స్వదేశ పండితులకుఁ గూడ నంటుచున్నది, నీతిశాస్త్రము ముఖ్యముగ వైయక్తికము. రాజనీతి సామాజికము. ఈ రెంటికి ముడివెట్టి నిర్ణయము సేయఁబూనుట ప్రమాదకరము. దుర్యోధనుఁడు శల్యుని సాయమును వంచనతోనే సంపాదించెను వైద్యగారన్నట్లు శల్యభాగము బ్రక్షిప్తమైనచో, మద్రేశ్వరుని ధర్మదృష్టికే లోపము వచ్చును. ఆ విషయము పైన మనవి సేతును. శల్యకథా భాగము ప్రక్షిప్తము గాదని నా యూహ!

అంతమాత్రమే గాదు, ఉండవలసిన దానిలో నతిముఖ్యమైన దనిగూడ! వ్యాసుని ప్రతిభాశక్తి రెండింతలుగ వికసించిన దిట్టి ఘట్టము లందే! శల్యు డొనర్చిన భేదనీతి కృష్ణుఁడు గర్ణునిపైఁ బ్రయోగించిన భేదనీతికి 'ఇతిశ్రీ' యని నే నను కొందును. ఇది లేని దది సమగ్రము గాదు.

## శల్య ప్రకరణములోని యౌచితి

మద్రరాజైన శల్యుఁడు మాద్రికి సోదరుఁడు. అందుచే నేరుగాఁ గవలకు మేనమామ! ఇట్టివాఁడు గౌరవులతోఁ జేరుకొనుననుటకు వీలే లేదుగదా! ఇంత మాత్రమే గాదు. దుర్యోధనుఁడు దన మేనల్లుంద్రను సిలుగుల వెట్టెను. వారి భార్య నవమానించెను. ఈ కారణములతో ధార్తరాష్ట్రులపై శల్యున కమర్షమే యుండును గాని యభిమాన మెట్లుండును? భారతయుద్ధము మొదలైన దన్నంతనే శల్యుఁడెంతయో యానందపడినాఁడు. పాండవులు దమకు గలిగిన యపకారమును వడ్డీతోఁ గూడఁ దీర్తురని యాతఁడెంచెను. ఇంతలోఁ దనకు పాండవుల నుండి యుద్ధాహ్వానము గూడ వచ్చెను. ఒక యక్షౌహిణి సేనను గైకొని శల్యుఁడు పాండవులను జేరవచ్చుచుండెను. దుర్యోధనుఁడీ ప్రయాణమును బసివట్టినాఁడు. మార్గమునందు శల్యున కాతఁ డెన్నియో సదుపాయములఁ గల్పించెను. సైన్యము లెత్తినచోట విడిసినచోట నాహార విహారముల కనుకూలము గలిగించినాఁడు. ఈ యేర్పాటులతో శల్యుఁ డానందోద్రేకమున మైమఱచెను. ఇవన్నియు ధర్మజుఁడే యొనర్చెనని యాతని తలఁపు. సంతోషమున శరీరమునుమఱచిన శల్యుఁడు "నాకన్ని సదుపాయములఁ గల్పించిన వాఁడు యేమడిగినను యిత్తు" నని ప్రతిజ్ఞ యొనర్చెను. మద్రేశ్వరుడీ మాట యన్నంతనే ధార్తరాష్ట్రు డక్కడఁ బ్రత్యక్షమైనాఁడు. తనవైపు నిలచి పోరవలసినదని దుర్యోధనుఁ డర్థించెను. ఆడినమాట దప్పుటకు వీలులేదు. ప్రాణసంకటమునఁ జిక్కిన శల్యుఁడట్లే

గానిమ్మన్నాఁడు. కాని "పాండవుల కడకేగి మాటాడి వత్తునని యాతఁడు గౌంతేయుల శిబిరముల కడకు వచ్చెను. జరగిన పరిస్థితి నంతయు మద్రేశ్వరుఁడు దెలిపెను, పాండవ శిబిరములలో రహస్యాలోచనములు సాగినవి. కృష్ణుఁ డెంతయో దూరదృష్టి గలవాఁడు గదా! దుర్యోధనునకుఁ బ్రధాన బలమైన కర్ణునెట్లైనను దేజోవిహీనుగావింప వలెనని సరసిజోదరుఁడు శల్యునిచే మాట దీసికొన్నాఁడు. ఇచ్చిన రెండు ప్రతిజ్ఞలను గూడ శల్యుఁడు నెఱవేర్చికొనెను. కౌరవులవైపు నిలచి యాతడు బోరినాఁడు. రాధేయునిఁ దేజోహీనుని గావించినాఁడు. శల్యుఁ డొనర్చిన పని దుర్యోధనుని జీవనాడులనే గదలించినది. పాశ్చాత్యవిమర్శకులట్లోవలే చిత్రములు. దుర్యోధనుఁడు శల్య సాహాయ్యమును సంపాదించుట నీతివిరుద్ధమైన కార్యమట! ఇది మాత్రమెందుకు రాచనీతి గారాదు. మహారథుఁడైన కర్ణుఁడు బాండవులను దూలనాడెను. అర్జునునిఁ జుల్కనఁ జూచెను. అవి వీరాలాపములట! వికత్థనుఁడైన కర్ణుని మందలించుట శల్యుని గుణలోలుపత యెందుకు గారాదు? పాండవులు శల్యునకు మేనల్లుండ్రఁడంటిమి. వా రష్టకష్టములు బడుటకుఁ బ్రధానకారణభూతుఁడు గర్ణుఁడే! అట్టి వానిపై శల్యునకు గూఢద్వేష ముండుటలో వాశ్చర్యమేమున్నది? కృష్ణార్జునులలో నున్నంత యొద్దిక కర్ణ శల్యులలో నెట్లు వచ్చును? శల్యుడు గౌంతేయుల కిచ్చిన ప్రతిజ్ఞను సమర్థముగ నిర్వహించెను. ఈ పట్టున రాధేయుఁడు బ్రదర్శించిన ధైర్యముమాత్ర మలౌకికమైనది. శల్యుఁడాడిన ప్రతిమాటయు రాధేయుని హృదయమును ఘూర్ణిల్లఁజేయునదిగానుండెను. అడుగడుగునను నాతఁడెదిర్చెను. కాని రాధేయుఁడు దుఃఖమునంతయుఁ దిగమ్రింగికొని, యపూర్వ పరాక్రమమును బ్రదర్శించెను. ఈ సన్నివేశము రాధేయుని గుణసౌరభములను మఱియొకసారి విరజిమ్మెను.

# దయనీయమైన మరణము

కడకు కర్ణుని వధ్యదినము సమీపించినది. రాధేయుఁడు తన దోషములతోఁ దానే మండిపోయినాఁడు. తండ్రియైన కర్ణుని కట్టెదుటనే, యర్జునుఁడాతని పుత్త్రుని భయంకరముగ వధించెను. పుత్రశోకమున సూర్యపుత్రుని హృదయము వికలమైనది. శాపప్రభావమున నాతని రథచక్రములు భూమిలోఁ గ్రుంగెను. కర్ణుఁడు క్రిందికి దిగి, రథచక్రములను జేతులతోఁ బట్టికొని పైకి లేపుచున్నాఁడు. ఆ సమయమును గనిపెట్టి కృష్ణుఁడు కవ్వడితో "చంపు! చంపు" మని యఱచెను. కృష్ణుని మాటలు రాధేయుని చెవులలోఁ బిడుగువలెఁ బడినవి. భగ్నసంకల్పుఁడైన యతని రెండు నేత్రములు బాష్పసిక్తములైనవి. అర్జునుఁడు దన కంఠమునకు గుఱిఁజూచి బాణమును సంధించినాఁడు. అప్పుడర్జునునితో గర్ణుఁడిట్లనెను.

"భో! భో! పార్థ! మహేష్వాస! ముహూర్తం పరిపాలయ

...... ..... ...... .....

అతస్త్వాం ప్రబ్రవీ మ్యేష ముహూర్తం క్షమ! పాండవ!

(భా, క. ప. అ. 90)

"మహేష్వాసుఁడవైన పార్థా! క్షణకాల మాగుము. నా రథచక్రము భూమిలోఁ గ్రుంగినది. దానిని లేవనెత్తెదను. ఈ సవ్యచక్రము భూమిలోఁ గ్రుంగినది. నా దురదృష్టము. ఈ యవకాశమున నీవు బాణమును సంధింపరాదు! అది కాపురుషు లొనర్పవలసిన పని. నీవు విశిష్టుఁడవు. రణకోవిదుఁడవు. నీ వొనర్చు కార్యములు గూడ విశిష్టములై యుండవలెను."

"ప్రకీర్ణ కేశుఁడు, విముఖుఁడు వీనియందు బాణముఁ బ్రయోగింపరాదు. ...హ్మణుని వధింపరాదు. ఆయుధము లేనివానిని, యాచమానుఁ డైనవానినిఁ ...ంపఁగూడదు. బాణములు లేనివానిని, భ్రష్టకవచుని, యాయుధములు భగ్నమైన

వానినిఁ జంపరాదని యుద్ధనియమము! దీనిని నీ వుల్లంఘించినచో నీ కపయశస్సు గలుగును. నీవు శూరతరుఁడవు. అపకీర్తిని సంపాదించికొనరాదు. దివ్యాస్త్రవిదుఁడవు. యుద్ధముల యందు కార్తవీర్యున కీడైనవాఁడవు. నీ వకార్యము నొనర్పవచ్చునా?"

"ఈచక్రము నెత్తువఱకును గొంతయాగుము. నీవు రథస్థుఁడవు. నేను భూమిస్థుఁడను. నీ విపుడు నా పై బాణమును సంధించుటన్యాయము. నేను నీకు వెఱచుటలేదు. కృష్ణున కసలే భయపడుటలేదు. నీవు వీరోత్తముఁడవని చెప్పుచున్నాను. చావునకు జంకి కాదు."

దయనీయమైన కర్ణుని వాక్యములువిని, యర్జునుని మనస్సు గరగినది. రాధేయునిపై శరమును దొడుగుట కాతని చేయాడలేదు. ఆతఁడూరక నిలచియుండెను. జరగినంత కాలము బాగుగ నధర్మములొనర్చి, యంతకాలమున ధర్మప్రవచనము లాడుచున్న కర్ణుని వాలకము కృష్ణునకు సహ్యముగా లేదు. భారత యుద్ధమునకుఁ గౌరవులఁ బ్రేరేచినవాఁడు గర్ణుఁడు. ఇంతవరకు జరిగిన రక్తపాతమంతయు నాతఁడు దెచ్చినదే! ఆతఁడిపుడు ధర్మోపన్యాసము లిచ్చుట పరిహాసభాజనము గదా! పూర్ణావతారుఁడై యుగపురుషుఁడైన కృష్ణుఁ డిట్టి దుశ్చిత్తములను క్షమించునా? కర్ణునకుఁ బాండవులపైఁ గల మత్సరము వైయక్తికము. జన్మంతయు రాధేయుఁడు ఆత్మలాభమునే జూచికొనెను. కాఁ దేశక్షేమము నేమాత్రము గమనింపలేదు. సజ్జనులైన పాండవుల నాతఁడు నిందించెను. అవమానించెను. వంచించెను. వానిసద్గుణము లన్నియు, మాత్సర్యమను భయంకరాగ్నిలోఁ బడి దగ్ధమై పోయినవి. కురుపాండవ వంశముల నాతఁడు విధ్వంస మొనర్ప సంకల్పించెను. భారతదేశము నంతయు మృత్యుదేవికి నాతఁడు వంటిల్లుగాఁ దయారుజేసినాఁడు. ఆతని మాత్సర్యము కులస్త్రీలను గౌరవింపలేదు. భీష్మాదు లీ దుర్మార్గుని పలుకుఁబడిలోఁ గుతకత యుడికి పోయిరి. ఇట్టి కుటిలుఁడు కర్ణుఁడు మృత్యుకాలమున ధర్మోపన్యాసములాడుట! నవ్వులపాలుగాఁ

మతేమి?

కృష్ణుఁడు కర్ణుని పాపములను ప్రత్యక్షముగఁ జూచెను. భయానకమై, క్రూరమై, వేదనామయమైన మృత్యువు గర్ణునకు దాపరిల్లినది. ఇది యొక్కటే యాతని పాపములకు నిష్కృతి. ఈ మాటలే గర్ణునితో గోవిందుఁడు స్పష్టముగఁ జెప్పెను.

కృష్ణుఁ డర్జునుని వైపు దిరిగి యిట్లన్నాఁడు. "అర్జునా! వీడు నీచుఁడు. వీనిపై దయఁజూపరాదు. ఈ కర్ణున కిప్పు డుపకార మొనర్చితివా! అది పామునకుఁ బాలు పోసినట్లే! ఊరక నిలుచున్నావేమి? గాండీవము దెగవేయుము. మహా పాపియైన వీని శరీరమును గుక్కలు, నక్కలు కాకులు తనివిదీరి భక్షించుగాక!"

కృష్ణుని మాటలు విని గర్ణుఁడు సిగ్గునఁ దల వంచికొనెను. అది యపరాహ్ణకాలము. సూర్యుఁడాకాశ మధ్యమునుండి నిస్తేజస్కుఁడై గర్ణుని యవస్థను గమనించుచుండెను. గాండీవము నుండి వెడలిన యర్ధచంద్ర బాణ మొకటి తృటిలో వచ్చి కర్ణుని కంఠము నుత్తరించెను. ఆ తల క్రిందఁ బడెను!

దీర్ఘదర్శియై, ప్రతిభావంతుఁడై, ఋషికవి యొనర్చు వ్యక్తి చిత్రములలోఁ గొన్ని శాశ్వత సందేశములు మూర్తీభవించియుండును. భారతమునఁ గర్ణుని చిత్రము కేవలము వ్యర్థముగాదు. నాశకరమైన కర్ణుని జీవితముతో నొక శాశ్వత సందేశమును మహర్షి లోకమున కొసఁగెను. ఆ సందేశ మేమి? ఒకానొక పురుషుఁడు హిమాచలము వంటి యున్నతుఁడే యగుఁగాక! వానియం దహంకారము, స్వాతిశయము రేకెత్తినచో వాని సమస్త శక్తులును లోక కల్యాణకరములు గాక, వినాశకరములే యగును.

# రాజర్షి భీష్ముఁడు

రాచఱికముతోనే ధర్మము రక్షింపఁబడును. తపస్వు లాదరింపఁబడుదురు. రాచఱిక మధఃపతిత మైనపుడు చెప్పకయే ధర్మగతి మూలఁబడును. అథఃపతితమైన రాచఱిక మెట్లుండునో వ్యాసభగవానుఁడు, ధృతరాష్ట్ర దుర్యోధనుల మూలమున మనకుఁ బ్రత్యక్షపఱచినాఁడు. శకుని, దుశ్శాసనుఁడు, కర్ణుఁడు దుర్యోధనునకు ప్రధానమైన మూలబలము. వీరందఱు సమర్థులే. కాని, వికారవశులు, క్షుద్రులు, నృశంసులు. స్వాతిశయమే వారి స్వభావము. తమ స్వాతిశయమును నిలిపి కొనుటకు, జగత్తునే బలిపెట్టుటకు వారు వెనుదీయరు. ఈ ముగ్గురి చిత్రములను చిత్రించి వ్యాసభగవానుఁడు దుష్టసచివ సంస్థ యొక్క స్వభావము మన కన్నుల యెదుట మూర్తీభవింపఁ జేసినాఁడు. అసత్పాపిష్ఠ సచివాయత్తమైన లోకధర్మము నశించితీరును. రాజ్యసంస్థపాడగును. రాచఱికమును సచివుఁడు నియమింపవలెను. సచివ సంస్థయొక్క బలము దగ్గినపుడు రాజ్యసంస్థ క్రియామూఢమై పోవుటలో నాశ్చర్య మేమున్నది? మఱి, యట్లైనచో, వ్యాసుఁడు ఉత్తమ సచివ సంస్థ యొక్క గుణములను వర్ణింపనేలేదా? నాఁడు జెప్పికొనఁ దగిన సచివ సంస్థయే లేదా? ఉన్నది. రాజర్షియైన భీష్ముఁడు, విదురుఁడు, గాంధారి వీరి స్వరూప చిత్రములే యుత్తమమైన సచివ సంస్థ యొక్కలక్షణములు, కాని దీని యధికారమును రాజ్యసంస్థ త్రోసిరాజన్నది. అందుచే సాచివ్యము రామాయణ కాలమునందు వలె సామాజిక వికాసము సాధింప లేకపోయినది. రాజ్యసంస్థ దీని నపహాసమొనర్చెను. భీష్మాదుల మాటకు దుర్యోధనుడు దమ్మిడీ వెలగట్టలేదు. కడకు వారి యధికారములూ నశించెను. సత్యమైన సచివ సంస్థ యెట్టిది? యనుట కుదాహరణమే భీష్ముని చరిత్రము- వ్యాసభగవానుని ప్రతిభా ప్రకాశము.

భీష్ముఁడు రాజర్షి. కాని, యాతనిపై ననేకములగు విమర్శములున్నవి. కొందరిట్లందురు. "తానువివాహమాడనని భీష్ముఁడు శంతనునకు మాట నొసఁగుట

దొడ్డ నేరము. ఆతని బ్రహ్మచర్యము కౌరవకులమునకు వినాశకరమైనది. భీష్ముఁడు పరమపవిత్రుఁడైన మహాపురుషుఁడు. ఆతఁడే వివాహ మొనర్చికొని, సంతానమును గనియున్నచో యది లోకోత్తరమై యుండెడిది. ఆ వంశమున దుర్యోధనుని వంటి క్రూరులు జన్మించుట కవకాశము లేకుండెడిది. ఆ యదృష్టమును భీష్ముఁడు భారతమునకు దక్కనివ్వలేదు." ఈ విషయమునింకను సాగఁదీసి - "భీష్ముఁడొనర్చిన ఘోరమైన పొఱపాటు" అనుశీర్షికతో నొక వ్యాసమీ నడుమ ప్రకటింపఁబడెను. శారీరశాస్త్రముపై నా విమర్శకునకుఁ గల భక్తికి నే నెంత సంతోషించినను ఆ వ్రాఁత కువిమర్శయనక తప్పదు. మఱికొంద ఱిట్లు వాదింతురు. "ద్రౌపదీ వస్త్రాపహరణ సందర్భమున భీష్ముఁడు మౌనము వహించెను. అప్పుడతడూరకుండి యుండరాదు. కౌరవసైన్యమున నాతని బలమున కెదురు లేదు. భీష్ముఁడు లేచి, యదలించి, దుర్యోధనుని మందలించి యా దురాచారమును మాన్పింపవలసి యుండెను. ...ుడు పాండవుల వనవాసము జరగియుండెడిది గాదు. భయంకర మానవసంహారమైన ...ద్ధము గూడ రాకయుండెడిది. భీష్మని మౌనము లోకవంచకము."

మఱికొందఱి దీ యాక్షేపణ! "భీష్ముఁడు లోకోత్తరుఁడు, కాని ప్రయోజన మి? ఆతఁడుపజీవికకు లోంగిపోయెను. నాల్గుకాను లిచ్చువానివైపు తాళము ...యుట పామాన్యుల మాట! భీష్ములవంటివాఁడట్లు చేయరాదు! పాండవులది ధర్మమని యాతనికిఁ దెలియును. అట్టిచో నాతఁడు గౌంతేయుల వైపు పేలఁ జేరలేదు? అతఁడు పాండవుల వైపు జేరి ధార్తరాష్ట్రుల వంటి దురాచారులను వధింప వలసి యుండెను. భీష్ముఁడట్లు చేయకుండుట పొఱపాటు! పైగా సమయము ...చ్చినపుడంతయు " అర్థస్య పురుషోదాసః " అను మాట లాతఁడనుచుండెను. ...ష్మని వంటి వాఁడు గూడ ధనమునకు, జీవనమునకు లోగినచో నిఁక ...ని గొప్పతన మేమున్నది? పోనీ కౌరవులవైపుఁ జేరినాఁడు గదా! వారికైన ...తఁడు దన మనస్సును బట్టి యిచ్చెనా? ఆతఁడే మాటఁ బల్కినను దాని

నిండ నత్తియే! ఏధర్మ ముపదేశించినను "అట్లైనచో - నిట్లైనచో" నను సంరక్షక వాక్యములతోనే యారంభించును. ఇంతటి బాధఁ దానెందుకుఁ బడవలసి వచ్చినది? కౌంతేయుల నెదిర్చి తాను యుద్ధమొనర్చెనే. కాని వారిని వధించుట దన కిష్టము లేదు. ఆతఁడొనర్చిన యుద్ధము నిండ వంచనయే! ఆతని కెన్నియో మహాస్త్రములు దెలియును. కాని యొక్కదానిని గూడ నుపయోగింపలేదు. శరీరము దుర్యోధనుని వైపు. మనస్సు పాండవులవైపు. తనకీ ద్వంద్వ ప్రభుత్వ మెందులకు? భీష్ముఁ డిచ్ఛామరణము గలవాఁడు. తన్నెట్లు సంహరింపవలెనని యాతని ధర్మరాజడిగెను. ఇందులకుపాయమును భీష్ముఁడు వచించెను. ఇది దుర్యోధనున కొనర్చిన వంచన గాదా? భీష్ముని వంటి మహాపురుషుఁ డిట్టి వంచనను జేయవచ్చునా?"

రాజర్షియైన భీష్ముని విమర్శించువారిలో రెండు తెగలున్నారు. ఒకరు మహాభారతమును చదువకయే విమర్శించువారు. వీరి వ్రాఁతలకాధారము వారు వీరన్న మాటలు! మఱికొందరు గలరు. వారు భారతమును జదువుదురు కాని, చదువవలసినట్లు చదువరు. వారి విమర్శలాపాతమధురములై యుండును ఒక యుదాహరణ మిత్తును. శంతనుఁడు వయస్సు జెల్లినవాఁడు. సత్యవతి బాల యను విషయము భారతమున స్పష్టముగఁ జెప్పఁబడలేదు. "శంతనుఁడు రెండవ పెండ్లి జేసికొనుచున్నాఁడు. అందుచే నాతఁడు ముదుసలియైయే యుండవలయును." ఇది విమర్శకులు భారతముపై నెత్తిన యొక యభాండము కనుక సత్యవతీ శంతనుల పరిణయము వృద్ధ బాలవాహమనుటకు నాస్పదమే లేదు. అట్లే "అర్థస్య పురుషో దాసః" యను వాక్యమునందు 'అర్థ' శబ్దమునకు 'ధనము' అని వ్యాఖ్యానము సేయుట పొఱపాటు! భీష్ముఁడు దన ప్రతిజ్ఞను సాధించుకొనుటకై యొక మహారాజ్యమునే కాలదన్నెను. అట్టివాఁడు ధనమునకు లోఁగి దుర్యోధను నాశ్రయించె ననుట యన్యాయమైన విమర్శ! భీష్మ

చరిత్ర మెట్టిదో యతనిపై నొనర్చిన వ్యాఖ్య లెంత నిస్సారములో యింకను గొంత వివరముగఁ దెలిసికొందముగాత!

# భీష్ముని మహత్త్వము

భారత కర్తయైన వ్యాసభగవానుఁడు భీష్మున కెంతయో గౌరవ మొసఁగెను. సమకాలికులైన మహాపురుషులంద రాతనిని దమ కలంకారముగ నెంచిరి. కృష్ణుఁడు భీష్మునకుఁ బ్రతిపక్షి! తా నొనర్చిన ప్రతిజ్ఞను గూడ మఱచి ముకుందుఁ డాతని పైకిఁ జక్ర మెత్తికొని పోవుటకు సాహసించెను. అట్టివాఁడును భీష్ముఁడంప శయ్యపై నున్నపుడు "సమస్తధర్మములను శాంతనవునుండి యెఱుంగుమని" ధర్మజుని నియోగించినాఁడు. భీష్ముని యొక్క గౌరవమును సూచించుట కీ యొక్కయుదాహరణము చాలును. భారతము శాంతిపర్వము శతధా - సహస్రధా వికసించినది. లోకముల కొనఁగవలసిన సందేశముల నన్నిటిని వ్యాసుఁడీ పర్వమున మేళవించెను. ఈధర్మములను బలికిన ప్రవక్త యెవ్వఁడు? భీష్ముఁడు. ఉత్తమోత్తములైన యీ విషయములను భీష్ముని నోటినుండి బలికించుటయే వ్యాసుని కాతనిపై నున్న యనర్ఘ గౌరవమునకుఁ దార్కాణము. భీష్ముఁడు నిర్యాణము నందఁబోవుచున్నాఁడను వార్త జనార్దనునకుఁ దెలిసినది. అప్పుడతఁడు శాంతనవుని గుఱించి పలికిన వాక్యములు మనకు ధ్యేయములుగ నుండఁదగినవి. కృష్ణభగవానుఁడిట్లన్నాఁడు.

"భీష్ముని జ్యాలతానిర్ఘోష మశనివిస్ఫూర్జితము వంటిది. దేవరాజు గూడ దానిని సహింపలేఁడు. అట్టి భీష్ముని మనస్సున నేను ధ్యానించుచున్నాను. సర్వరాజమండలమును బరాక్రమముచే జయించి బలవంతముగఁ గాశీరాజు కుమార్తెలను గైకొని వచ్చెను. ఆతని పరాక్రమమున కెదురులేదు. ముప్పది దినములు ధర్మమునకై భార్గవ రామునితో నాతఁడు బోరాడెను. జామదగ్ని

భీష్ముని గెలువలేక పోయినాఁడు. గాంగేయుని ధర్మనిష్ఠ యిట్టిది. అస్త్రపాండిత్యమట్టిది. అతఁడింద్రియగ్రామమును జయించెను. మనస్సును బుద్ధిచే నిగ్రహించెను. నిగ్రహించి నన్ను శరణుఁజొచ్చెను. నే నారాజర్షినే భావించుచున్నాను. అతఁడు గాంగేయుఁడు. వసిష్ఠునికడ సమస్తవిద్యల నభ్యసించినాడు. సాంగములైన చతుర్వేదము లాతనికిఁ గరతలామలకములు. దివ్యాస్త్రము లాతని కధీనములు. విద్య లాతని ముంజేతి యుద్దము. పరశురామునకుఁ బ్రియశిష్యుఁ డాతఁడు. ధర్మజ్ఞుల కాతఁడు మేలుబంతి. త్రికాలవేది. పురుషవ్యాఘ్రుఁడైన భీష్ముఁడు స్వర్గమును జేరెను. ఇఁక భూమికి గాంతి యెట్లు వచ్చును? భూమండలము నష్టచంద్రమైన రేయివలె నగును. రాజా! యీ యవకాశమును త్యజింపకుము. నీ వడుగవలసిన ధర్మములన్నియు నాతని నడుగుము. చాతుర్వర్ణ్యము, చాతుర్హోత్రము చాతురాశ్రమ్య మయిన ధర్మసంపత్తి యాతని యధీనము! రాజధర్మముల కాతఁడాధారము. కౌరవధురంధరుఁడైన భీష్ముఁడస్తమించెనా? ఇఁక భూమండలమున జ్ఞాన మస్తమించినట్లే! అందు కే నిన్నింత తొందర జేయుచున్నాను.

ధర్మరాజును, కృష్ణుఁడును భీష్ముని దర్శించుటకు వెడలిరి. శరతల్పగతుఁడైన శాంతనవుని జూచినంతనే కృష్ణునకు భావోద్రేకము పొరలివచ్చెను. అపుడతఁడన్నమాటలు హృదయములను గరగించునవి. ఆ సన్నివేశ మిట్లున్నది.

"తతో నిశమ్య గాంగేయం శామ్యమాన మివానలం

...... ......

భవద్విధా హ్యుత్తమబుద్ధివిస్తరా విముహ్యమానస్య వదస్వ శాంతయే."

(భా. శాంతి. ప. అ. 50)

"గాంగేయుఁడు శామ్యమానమగు వహ్నివలె నుండెను. అతనిని జూచి కేశవుఁడు దీనమనస్కుఁడయ్యెను. కృష్ణుఁడిట్లు ప్రశ్నించెను. సమస్త జ్ఞానములు

ముందటివలె యధీనమున నున్నవి గదా! నీ బుద్ధి శారీరక బాధచే వికలముగలేదా? శరాభిఘాత దుఃఖమున నీ గాత్రము దూయమానము గాలేదా? మనోదుఃఖమున కంటెను దైహిక దుఃఖము ప్రాణులకు బలవత్తరమయినదిగదా! శాంతనవా! ధర్మతత్పరుఁడైన నీ తండ్రి నీకు వరమొసఁగెను. అందుచే స్వచ్ఛంద మరణము గలవాఁడ వయితివి. కాని శారీరకమైన బాధమాత్ర మెట్లు విడుచును? దేహమునకుఁ జిన్న గాయము దగిలిననే యెంతయో బాధ కలుగును. రుజ సంక్రమించును. మనస్సువికలమగును. నీవు శరసంఘాత విదీర్ణ దేహుఁడ వయితివి. ఈ స్థితిలో నీ యంతఃకరణము వికలమగుటలో నాశ్చర్యములేదు. ధర్మసంవేదీ! జన్మమృత్యువులు మానవునకు సహజములు. ఈ విషయము నేను నీకుఁ గ్రొత్తగఁ జెప్పవలయునా? అఖండ జ్ఞాన సంపన్నులయిన దేవతలకుఁగూడ నుపదేశింపఁగల మహాప్రజ్ఞానిధి వీవు. జ్ఞానవృద్ధుఁడవైన గాంగేయా! త్రికాలజ్ఞానము నీ యధీనము. జగత్తు యొక్క సంహారము, యుత్పత్తి ధర్మస్వరూపము, దాని పరిణామము, దాని యుద్దేశ్యము మొదలగు విషయములలో నీకున్న యధార్థజ్ఞాన మెవ్వరికిని లేదు. నీవు ధర్మనిధివి. ధర్మైకతత్పరుఁడవు. సత్యము నీ యధీనము. మహావీర్యవంతుఁడవు. తపస్సుచే మృత్యువు యొక్క వేగము నడ్డగించితివి. చతుర్దశ భువనములలో నిట్టివాఁడవు నీ వొక్కఁడవే! సత్యము, తపస్సు, దానము, యజ్ఞాదికరణము, అనృశంస్యము, శుచిశాంతిదాంతులు మొదలగు గుణములలో నిన్నుఁ బోలినవాఁడు ముల్లోకములలో లేఁడు. గంధర్వాసుర యక్షరాక్షసులను, దేవతలను, యెక్కిన రథమునుండి దిగక యొక్కయూకున నిర్జింపఁగల శక్తినీయది. వాసవోపముఁడవైన నీవు వసువులలో శ్రేష్ఠుఁడవు. పురుషోత్తముని వంటివాఁడవు. నీవంటి సర్వసమర్థుఁడైన మానవుని గూర్చి జగత్తున వినలేదు; చూడలేదు. లుప్తములైన సమస్త లోకములను బునస్సృష్టి యొనర్ప గలిగినంత తపస్సంపన్నుఁడవు. నీ కుత్తర లోకములు లభించుటలో నాశ్చర్య మేమున్నది. ధర్మజుని హృదయమునఁ బొడమిన శోకము

నడగించుటకు నీవే సమర్థుఁడవు. నీ వాతనికి ధర్మబోధగావింపుము. యోగసాంఖ్య ధర్మములు నీ వెఱుఁగుదువు. ప్రతిలోమప్రసూతములైన వర్ణధర్మముల తెఱఁగులు నీ వెఱుఁగుదువు. దేశజాతికులములు వాని ధర్మములు నీకుఁ దెలియనివి లేవు. వేదోక్తశిష్టోక్తములైన న్యాయములు నీ యధీనములు. ఇతిహాస పురాణార్థములు నీ స్వరూపము. ధర్మశాస్త్రములు నీ యధీనములు. సంశయకారకములైన ధర్మములు సంఘటిల్లినపుడు వానిని విడదీయుటకు నిన్ను మించిన ప్రతిభాశాలి లేఁడు. భీష్మా! ధర్మజమనస్సముత్థిత మైన శోకమును నీ మేధయే బోకార్పగలదు. నీవంటి మహాపురుషుల జీవితములు లోకక్షేమఫలములు గదా!"

భీష్ముఁడు శ్రీకృష్ణు నిట్లు ప్రశ్నించెను. "మాధవా! నీవే ధర్మరాజు సంశయము లెందుకుఁ బోగొట్టరాదు?" ఈ ప్రశ్నకు శ్రీకృష్ణుడిచ్చిన యుత్తరము బట్టి భీష్మునిపై యాతని కెంత గౌరవముండెనో మనము దెలిసికొన వచ్చును. శ్రీకృష్ణుఁ డిట్లనెను. "భీష్మా! యశస్సునకును, శ్రేయస్సునకును నేనే మూలభూతుఁడను. సదసదాత్మకములైన భావము లన్నియు నానుండియే బుట్టుచున్నవి. చంద్రుఁడు శీతాంశుఁడనుటలో నాశ్చర్య మేమున్నది. అట్లే నేను స్వయంపరిపూర్ణుఁడను. నేను సర్వధర్మముల నెఱుఁగుటలోను బోధించుటలోను గొప్పతనము లేదు. భీష్మా! భూయిష్ఠమగు యశస్సు నీ కివ్వదలచితిని. అందుకే నీ యందు సర్వోత్తమమైన బుద్ధిని నియమించుచున్నాను. ఈ భూమి యుండునంత వఱకును నీ కీర్తి శాశ్వతముగ నుండును. ధర్మజానకు నీ వొనర్చెడి బోధ వేద ప్రవాదముతో సమానమైనది. నీవు జెప్పిన బోధనల ననుసరించి వర్తించు మనుష్యుఁడు సర్వపుణ్య ఫలములందును. అజరామరములైన లోకము లందును. ఒక మహాపురుషుని కీర్తి భూమిపై నున్నంత కాలము ఆతఁడు దేవలోకముల నుండును. నీవు వయోవృద్ధుఁడవు. శ్రుతాచార సమన్వితుఁడవు. రాజధర్మకుశలుఁడవు. పుట్టినది మొదలొక్క పాపమును గూడ నొనర్పనివాఁడవు. సర్వవిదితమైనది నీ మాహాత్మ్యము.

ఋషులను దేవతలను దృప్తిగా నుపాసించితివి. నీవే ధర్మబోధ కర్తవు(డవు. ధర్మసందేహము గలిగినప్పుడు విద్వాంసు(డద్దానిని దీర్పవలెను. కాని నా(డాతని( బాపమంటునని ధర్మశాస్త్రము వచించు చున్నది. కనుక యుధిష్ఠిరునకు ధర్మము నుపదేశించుట నీ కర్తవ్యము. కౌరవ సంతతి నీ ధర్మోపదేశములచే ని(క మీ(దట( గల్యాణకరమై బ్రకాశించును.

కృష్ణుని యుద్గారముల( జదివినచో భీష్ముని యోగ్యత యెంతటిదో వే(ఱుగ జెప్ప( బనిలేదు. భగవంతు(డైన కృష్ణు(డే "పుట్టుక మొదలుకొని నీ కొక పాపము గూడ నంటలేదని" పలికెను. భీష్ముని పేరు పావిత్ర్యమునకు రూపాంతరము. చిరపుణ్యముల కాత(డు బ్రతీకము.

## భీష్ముని జన్మకథ

గాంగేయు(డు శుద్ధ క్షత్రియు(డు. గంగా శంతను లాతని తల్లి దండ్రులు. ఒకానొకనా(డు గంగాదేవి చతుర్ముఖుని గొలుచుటకై బ్రహ్మలోకమునకు( బోవుచుండెను. ఆ దివ్యజనని నడుచునప్పుడు మందమారుతవశమున నామె పైకొంగు కొంత దొల(గినది. బ్రహ్మదేవుని సభనిండుగ నెందఱో దివ్యర్షులు రాజర్షులు నుండిరి. వారెవ్వరు గూడ నీ సన్నివేశమును గమనింపలేదు. రాజర్షులలో నొక్కడైన 'మహాభిషు' డను నాత(డు జాహ్నవివైపు సాకూతముగ( జూచినా(డు. జాహ్నవి గూడ నాతనిని క్షణకాల మాకేకరదృక్కులతో( జూచినది. బ్రహ్మలోకమందు కామగంధ ముండుటకు వీలులేదు. ఈ పరస్పర ప్రేమ వీక్షణముల గమనించిన చతుర్ముఖు(డు గించిత్కుపితవదను(డై "నీవు మరల మర్త్యలోకమున జన్మింపవలసినదని మహాభిషునకు శాప మొస(గెను. గంగాదేవియు బుడమియందు జన్మించి యా రాజర్షి(కి( బత్ని యగునని యాజ్ఞ యయినది. అపుడు గంగాదేవి దనకు శాపమోక్షమెట్లని యడిగినది. "నీ వీ రాజర్షి కప్రియమొనర్తువు. దాని

నతఁడు నిషేధించును. అపుడు నీ వొడబడక యమరలోకములకు వత్తువు, పొ"మ్మని పరమేష్ఠి శాపాంతమును దెలిపినాఁడు. ఆ మహాభిషుఁడే శంతనుడై పుట్టెను. శాపభారమును మోసికొన్న గంగ భూమికి వచ్చుచుండినది. త్రోవలో నామెకష్టవసువులు గనబడిరి. వారు వసిష్ఠునకేదోయపకార మొనర్చిరి. "మీరు భూమిపై జన్మింపుఁడని వసిష్ఠుఁడు వారికి శాపమొసగినాఁడు. వసువులు గంగాదేవి నిట్లు ప్రార్థించిరి. "మాతా! మేము భూలోకమున జన్మింపవలసి యున్నది. పుడమిపైఁ జిరకాల ముండుటకు మాకిష్టములేదు. చతుర్ముఖుని శాపమున భూమి కేఁగనున్న నీ కడుపున మేము బుట్టెదము. కాని దయచేసి నీవు మా కొక యుపకార మొనర్పవలెను. పుట్టిన వెంటనే మమ్ము నదీజలముల యందుఁ బారవేయుము." గంగాదేవి యిట్లు బదులు జెప్పెను, "మీ కోర్కె నేను దీర్తును. నా కోర్కెయు నొక్కటి గలదు. దానిని మీరు దీర్పవలెను. దేవసంభవను బత్నిఁగాఁ గలిగిన శంతనుఁడు అపుత్రకుఁడగుట నాకు సమ్మతముగాదు! కనుక నాకు జన్మింపఁబోవు మీలో నొక్కఁడు దీర్ఘాయుష్మంతుఁడై వర్ధిల్లవలెను. వానియందు మీ యష్టవసువుల యంశలన్నియుఁ గలసియుండవలెను." అందులకు వారు సమ్మతించిరి. గంగాదేవియు వాగ్దానమును బాలింతునన్నది. జాహ్నవి పుడమికి దిగివచ్చెను. శంతనుఁడామెను జూచి కామోద్విగ్నుఁడైనాఁడు. ఆమెయు నంగీకరించెను. గంగ శంతను నొక్క వరము గోరెను. తా నొనర్చు నే పని నేనియు శంతనుఁడాక్షేంచరాదు. ఆక్షేపించిననాఁడు దాను తరలిపోవును. శంతనుఁడా సమయమున కంగీకరించెను. పుత్త్రులు గలుగునంత వఱకును జాహ్నవి యాతవి నెంతయో ప్రేమించెను. మొదటి సుతుఁడు గలిగెను. కలిగిన వెంటనే గంగ వానిని నీట వేసినది. శంతనున కిది కష్ట మనిపించినది. ఇచ్చిన మాటను బట్టి యాతఁడు బదులు పలకలేదు. ఏడుగురు పుత్త్రులట్లే నశించిరి. ఎనిమిదవ వానిని గూడ నామె నీట వేయ నమకట్టి నపుడు రా జాక్షేపించెను. "మాటఁ

దప్పితివ'ని గంగ మఱలి పోదునన్నెను. శంతనుఁడు శోకాకులుఁడయ్యెను. గంగాదేవి యాతని కష్ట వసువుల వృత్తాంత మెఱింగించెను. ఆమె శంతనుని వదలి వెళ్ళినది.

గాంగేయుఁడు దైవాంశసంభూతుఁడు. శంతనుఁడొక గొప్పరాజర్షి. ఆతని గుఱించి భారతమునం దిట్లున్నది,.

"సరాజా శంతను ర్ధీమాన్‌దేవరాజర్షి సత్కృత:

...... ....... ......

సమం శశాస భూతాని కామరాగ వివర్జిత:

(భా. ఆది. ప. అ. 100)

శంతనుడు మేధావి. దేవర్షి రాజర్షు లాతని నెంతయో గౌరవించుచుండిరి. సత్యసంధుఁడు. కీర్తివంతుడు. జితేంద్రియుఁడు. దానము, క్షమ, బుద్ధి, ఆభిజాత్యము, ధైర్యము, తేజస్సు, సామర్థ్యము ఇవి యాతని నైసర్గిక గుణములు. ఆనాఁడతనితో సరియగు ధర్మనిష్ఠుఁడు లేఁడు. అందుచే భారతదేశము నందలి రాజులందరు సమ్మతించి శంతనుని చక్రవర్తిగ నభిషేకించినారు. అతఁడు సార్వభౌముఁడగుట సద్గుణమాహాత్మ్యముననే! రాగద్వేషాదులకాతని హృదయము దూరము. తేజమున నాతఁడు సూర్యసదృశుఁడు. వేగమున వాయువు. క్రోధమున యముఁడు. క్షమయందు భూమి. చంద్రదర్శనము వలె నాతని యాలోకము లోకాహ్లాదకరమై యుండెను. ఆతని రాజ్యమున ధర్మము పూర్ణస్వరూపముతో వెల్గుచుండెను. ఎవ్వరు గాని పశు, వరాహ, మృగ, పక్ష్యాదులను వధించెడివారు గారు. బ్రహ్మ ధర్మోత్తర మైన దా రాజ్యము. అతఁడు కామరాగ వివర్జితుఁడై సమస్త భూతములను సమానముగఁ జూచెను. భూమండలము నందలి రాజులెల్లరు నాతని సద్గుణములను వలచి చక్రవర్తిగఁ గౌరవించిరట! ఇఁక నాతని యోగ్యత

యెట్టిదని చెప్పవలెను? భీష్మాచార్యులకుఁ దనతండ్రిపై నెంతయో గౌరవము. భారతమున నాతఁడెన్ని యో సారులీ విషయమును గూర్చి పలికెను. తండ్రిపై నున్న గౌరవమున కుపస్ఫోరకముగ శాంతనవుఁడను నామమును ధరించెను. శంతనునకు భీష్ముఁడు జనించు టొక దీపమునుండి మఱియొక దీపము వెల్గుటవంటిది. తండ్రి గుణము లన్నియు భీష్మునకు సంక్రమించినవి. ఇఁక నాతని తల్లిని గూర్చి వేఱుగ నేమి చెప్పవలె? 'గంగ ' యను మాట భారతీయవాఙ్మయమున 'బవిత్రతకు' శబ్దాంతరము. ఆ నది పేరు విన్నంతనే మనకు స్ఫురించునవి రెండు గుణములు. నిస్సీమమైన యోర్పు. నిర్వేలమైన పాతివ్రత్యము. ఆ దేవి భారతీయ వాఙ్మయమున కలంకారము. ఆర్య ఋషుల తపస్సులకుఁ గేంద్రము. ముమ్మూర్తులకు ముమ్మూర్తుల నామె యారాధ్యమైన దేవత! తల్లినుండి జాహ్నవేయునకు పావిత్ర్యము సంక్రమించినది. అలౌకిక మైన శీల మబ్బినది. శంతను నోదార్చి దేవలోకమునకుఁ బోవుచున్న గంగ కుమారునిఁ దనవెంటఁ గొంపోయినది. ఒకానొకనాడు రాజర్షి శంతనుఁడు గంగానదీ తీరమునఁ జరించుచుండెను. ఆ నదీజలము లవరుదములై యుండినవి. "గంగాజలములు దగ్గిపోయినవా? ఈ ప్రవాహమింత సన్నగిల్లినదేమి?" అని యాలోచించుకొనుచు శంతనుఁడు పైకి నడచినాఁడు. ఒకానొక దివ్యస్వరూపియైన బాలుఁడు దన మహాస్త్రసామర్థ్యముతో క్రీడగా గంగ నీటి నాపుచుండెను. ఆ బాలకుని ధనుః పాండిత్యమునకు శంతనుఁ డబ్బురపడినాఁడు. అతని యెదుట గంగా దేవి గనుపించినది. ఆమె యన్నది. "నృపాలా! వీఁడు నీ సుతుఁడు. వీనికి విద్యాభ్యాసము బూర్తియైనది. ఇక నీ కుమారుని నీవు దీసికొనిపొమ్ము." శంతనుని దేహమంతయు ముత్పులకితమైనది. ఆతఁడా కుమారుని గైకొనివచ్చెను.

మాతృదేవి యొక్క పర్యవేక్షణము క్రింద బాల్యమున భీష్మాచార్యు లెందరి కడనో విద్య నభ్యసించెను. ఆ గురువుల పేరులు భారతమున నుల్లేఖింపబడినవి. ఎవ్వరెవ్వరి కడ భీష్ముఁడు విద్య నభ్యసించెనో శంతనున కెఱిఁగించుచు జాహ్నవి యిట్లన్నది.

"యం పుత్ర మష్టమం రాజన్ త్వపురామయ్యవిందథాః

........ ........ .......

మయా దత్తం నిజం పుత్రం వీరంవీర! గృహం నయ.

(భార, ఆ, ప, అ, 100)

"రాజా! వీఁడే నీ యష్టమ కుమారుఁడు. వీఁడిప్పుడు సర్వాస్త్రముల రహస్యము లెఱుఁగును. వసిష్ఠుల నుండి సాంగములైన వేదము లభ్యసించినాఁడు. దేవేంద్రున కెనయైన విక్రమము వీనిది. సురాసురు లిర్వురు వీనిని గౌరవింతురు. దేవగురువైన బృహస్పతి, దైత్యగురువైన శుక్రాచార్యుఁడును నీ కుమారునకు దమ జ్ఞానము నంతయు బోధించిరి. చతుర్దశ భువనము లందును సాటిలేని మహాతపస్సంపన్నుఁడైన జామదగ్న్య మహర్షి యీ కుమారునకు శస్త్రాస్త్ర పాండిత్యమును గఱపెను. ఇదిగో! నీ కుమారుని నీకు నేఁడు వెనుక కొసఁగుచున్నాను. వీనిని గైకొని పొమ్ము!"

భీష్ముఁడు, వసిష్ఠుఁడు, బృహస్పతి, శుక్రాచార్యుఁడు, పరశురాముఁడుఁ అను గురువులకడ విద్యలను నేర్చెను. వీరందరలౌకికులే!

## రాజుగా భీష్ముని యోగ్యత

గృహమునకు వచ్చి శంతనుఁడు భీష్ముని యౌవరాజ్యమున నభిషేకించెను. కాని తరువాత విధి వక్రించి యాతఁడు రాజ్యపరిత్యాగమొనర్చినాఁడు. ఆతఁడే

రాజుగా నిలచి పరిపాలించియుండెడి యదృష్టమే భారతదేశమున కున్నచో నెంత బాగుండెడిది! ఆతఁడు రాజ్యకార్యములు నిర్వర్తించిన ఘట్టము భారతమునం దొకచోట వచ్చును. ఆ సన్నివేశ మిది. విచిత్రవీర్యుఁడు మరణించెను. ధృతరాష్ట్రుఁడు విదురుఁడు, పాండురాజు వీరింకను లేఁబ్రాయమున నుండిరి. వారు పెరిగి పెద్దయగు వరకును రాజ్యమును బరిపాలింప వలసిన బాధ్యత భీష్మునిపైఁ బడినది. అప్పు డాతఁడెంత ప్రశస్తముగ రాజ్యమేలెనో యీ క్రింది వర్ణనము దెలుపును.

"ఊర్ధ్వసస్యా z భవ ద్భూమిః సస్యాని రసవంతి చ

........ ..... ......

భీష్మేణ విహితం రాష్ట్రే ధర్మచక్ర మవర్తత!"

(భా. ఆది. అ. 109)

"సస్యములు భూమినుండి బాగుగా నెదిగి వచ్చుచుండెను. అవి రసవంతములు. పర్జన్యుఁడు క్రమముఁ దప్పక వర్షించుచుండెను. వృక్షములు పుష్పఫల భారములతో వంగియుండెడివి. వాహనములు ప్రహృష్టములు. మృగపక్షులు సంతోషముతో నుండెను. మాల్యములు వాసనాశోభితములు. ఫలములు రసవంతములు. నగరములు వణిక్పురి శోభితములు, శిల్పులు సమృద్ధిగ నుండిరి. ప్రజలందఱును శూరులు. విద్వాంసులు. సత్పురుషులు. సుఖవంతులు. ప్రజలు ధర్మమార్గానువర్తులు. చోరులు బొత్తిగా లేరు. రాష్ట్రములయం దంతయుఁ గృతయుగ ధర్మములే జెల్లుచుండినవి. ప్రజల మనస్సులు. యార్థిక పరిస్థితులు వికసించి యుండినవి. ఆ ప్రజలు ధర్మశూరులు, యజ్ఞశీలురు. సత్యవ్రతులు అన్యోన్యప్రీతి సంయుక్తులు. కామక్రోధాది విహీనులు. లోభవివర్జితులు. పరస్పర మైత్రియు గౌరవమును గలిగియుండిరి. నగరములు మహోదధులవలె జనపూర్ణమ

యుండెను. ఆ నగరములయం దెటుఁజూచినను బ్రాసాదములే! నిత్యసమ్ముదితులైన ప్రజలు, నదులు, వనములు, వాపీపల్వములు సానుదేశములు, రమ్యకాననములు మొదలగువానియందు రమించుచుండిరి. ఉత్తర కురుభూములు, దక్షిణ కురుభూములు, దేవభూములు, బోటీకిఁ బడుచుండెను. వృత్తులలో క్షుద్రుఁడైనవాఁడు లేఁడు. స్త్రీలలో విధవలు లేరు, ఆ రాష్ట్రమున నిరంతర ముత్సవములే! బ్రాహ్మణ నివాసములు కూపారామ పరిశోభితములై యుండినవి. ఆ ప్రజల వైభవముల కంతులేదు. ఈ విభవముల కన్నిటికిని రాజైన భీష్ముని యొక్క ధర్మబలమే గారణము. ఆ రాజ్యమున నెచ్చటఁ జూచినను చైత్యములు యూపములు వెల్గుచుండెను. భీష్ముఁడు ధర్మస్వరూపుఁడై ధర్మచక్రపరివర్తనము నొనర్చెను."

భారతీయ సాంస్కృతికదృష్టితో రామరాజ్య మాదర్శభూతము. రామరాజ్య మనఁగా నేమో వాల్మీకి రామాయణమున వర్ణించెను. భీష్ముని రాజ్యము గూడ నా రామరాజ్యమునకు సరిపోవుచున్నది. రాజకీయ వాదులలోఁ గొన్ని విచిత్రములైన సిద్ధాంతము లున్నవి. "పరిస్థితుల ప్రభావమే మానవుడు గొప్పవాఁడగుటకుఁగారణ" మని కొందఱందురు. మానవుఁడే పరిస్థితులను నిర్మించుకొను ననియు అతఁడు స్వతంత్రుఁడనియు మఱికొందఱి యభిప్రాయము. దీనిపైని వాదోపవాదములు సమాజ శాస్త్రమునఁ బుష్కలముగ నున్నవి. నవయుగ సిద్ధాంత వాదులలోఁ బ్రముఖులైన 'మార్క్స్' రాజకీయ వాదులు మర్త్యుఁడు గొప్పవాఁడో యధముఁడో యగుటకుఁ బరిస్థితుల ప్రభావమే గారణమని చెప్పుదురు. కాని యీ వాదమునకు విరుద్ధముగ వారి రాజకీయ చరిత్రమే సాక్ష్యమిచ్చుచున్నది. ప్రాచీనులు, రాజే కాలమునకుఁ గారణమని నమ్మిరి. కృతయుగమున సామాజిక వికాసము బరిపూర్ణముగ నుండెను. "రాజే కృతయుగమును తన 'ధర్మ బలముతో' సృష్టింపవలెను. అట్టి కాలమును సృష్టింపక పోయినచో నా నృపాలుఁడసమర్థుఁడు." అని భీష్ముఁడు శాంతిపర్వమున

ధర్మజునకు బోధించెను. అట్టి కాలమునే భీష్ముఁడు దన కాలమున సృష్టించి చూపెను. భీష్మడే రాజై యుండెడి యదృష్టము బట్టినచో నా వంశాచార మెంత గొప్పగ రాణించియుండెడిదో! భీష్మని జ్ఞానము, ధార్మికత మొదలైన వాని విషయమున గృష్ణుఁడు జెప్పిన పొగడ్త లింతకుముందే యుద్ధృతీకరించి యుంటినిగదా! అన్నియు సద్గుణములే యున్నంత మాత్రమున యతఁడు గొప్పరాజని యర్థముగాదు. రాజున కింకను గొప్ప గుణములు గావలెను. అవి పరాక్రమము సామర్థ్యము మొదలైనవి. ఈ గుణములు గూడ భీష్మన కుండెను. అతని కర్మనిష్ఠ కఠోరమైనది. ఎట్టి కఠోరమైన శక్తి యెదిరించినను దలవంచి లోఁగక పర్వతశిఖరము వలె దురుద్ధరుఁడై నిలచు సాహసమాతనిది. ఆ మృత్యుంజయ ప్రవృత్తి యెదుట నాటి రాజులెల్లరుఁ దలలువంచిరి. కులాభిమానము, ధర్మనిష్ఠ గాంగేయునకు వెన్నతోఁ బెట్టినవి. భీష్మనియం దున్న మహాగుణములను వ్యక్తమొనర్చు సన్నివేశములలోఁ బరశురామునితో నాతనికి జరగిన యుద్ధ మొక్కటి. అపుడే భీష్ముఁడు జూపిన విక్రమమునకు దిక్కు లల్లాడెను. లోకైక వీరుల కోవలో నాతని నామము జిరస్మరణీయమై నిలచినది.

## ఒక విచిత్ర సన్నివేశము

శంతనునకు రెండవ భార్య యందు చిత్రాంగద విచిత్రవీర్యులు జన్మించిరి. వీరిలో చిత్రాంగదుఁ డల్ప వయస్సుననే మరణించెను. వానినొక యుద్ధమున గంధర్వులు జంపిరి. అపుడు భీష్ముఁడు విచిత్రవీర్యునకు వివాహ మొనరింప నెంచెను. అనురూప వయోగుణములు గల రాజకుమారికల నాతఁడు వెదకుచున్నాఁడు. ఇంతలో నొక్క విషయ మతనికిఁ దెలిసెను.కాశీరాజునకు ముప్పురు బిడ్డలుండిరి. వారు చక్కనిచుక్కలు. సులక్షణ సంపన్నలు. విచిత్రవీర్యున కెంతయును

దగినవారుగ నుండిరి. కాశీరాజు దన బిడ్డలకు స్వయంవర మేర్పాటు జేసెను.దేశమునందుఁబ్రసిద్ధులైన రాజులందఱచ్చట జేరినారు. చేరిన వారిలో నధిక బలవీర్య సంపన్నుఁడైన రాజకుమారుఁడు దన కుమార్తెలను వరింపవచ్చునని కాశీరాజు విన్నవించెను. ఆ స్వయంవరమునకు భీష్ముఁడు గూడఁ బోయెను. కాశీరాజు యీ మాట లన్నంతనే గాంగేయుడు లేచి యా ముగ్గురు కన్యకల నెత్తికొని తన రథమునఁ బెట్టికొన్నాఁడు. ఈ సన్నివేశమును జూచి యచటఁ జేరిన రాజు లందఱకును గన్నులెఱ్ఱవారినవి. "భీష్ముని వధింపుఁడు, వధింపుఁడని' యా నృపాలచక్రమంతయు నాతనిపై బడెను. ఏకైక ధనుర్ధరుఁడైన భీష్ముఁడు వారందఱి నొక్కఁడే యెదిర్చినాఁడు. శత్రువు లాతని యెదుట దూదిపింజల వలె నెగిరిపోయిరి. రణక్షేత్ర మంతయు రక్తప్రవాహమయ్యెను. భీష్మునెదిర్చిన రాజులలో ముఖ్యుఁడు సాల్వుఁడు. ఆతఁడును బరాక్రమవంతుడే! సాల్వుఁడు గాంగేయుని ద్వంద్వ యుద్ధమున నెదిర్చెను. వెంటనే గాంగేయుని పరాక్రమ మాతనిఁ గవిసినది. సాల్వుఁడు విరథుఁడయ్యెను. విశస్త్రుఁడయ్యెను. సాల్వుని భీష్ముఁడు సంహరించియుండెడివాఁడే! కాని యాతనిపై నాతనికి గరుణ పొడమినది. సాల్వునకు భీష్ముఁడు జీవదాన మొనర్చెను. ముగ్గురు కన్యకలతో గూడ శాంతనవుఁడు రాజధాని కేతెంచి వారిని సత్యవతి కొప్పించెను. ఆ ముగ్గురను విచిత్రవీర్యున కొసఁగి వివాహ మొనర్చుటకు భీష్ముఁడు గృతసంకల్పుఁడైనాఁడు. వివాహ ప్రసంగములు జరగుచుండగా వారిలో నొక్కతె యైన యంబ భీష్మున కిట్లు మనవి జేసినది.

"సత్యవత్యాస్త్వనుమతే వివాహే సముపస్థితే

....... ....... .......

త్వం హి సత్యవ్రతో వీర! పృథివ్యామితి నః శ్రుతః!

"శాంతనవా! నీవు ధర్మజ్ఞుఁడవు. సర్వశాస్త్ర విశారదుఁడవు, నీ కంటెను ధర్మాధర్మ నిర్ణయ మొనర్పగల వలఁతులు లేరు. నా మనవిని మన్నించి ధర్మనిర్ణయ మొనర్తువని యాశింతును. నేనింతకుముందే సాల్వుని వరించితిని. అతఁడు గూడ నన్ను వలచెను. ఈ విషయము మా తండ్రి యెఱుఁగడు. అన్యసంలగ్న మనస్కయైన యువతిని, కౌరవాంతఃపురమున నుంచికొనుట నీ వంటి వానికిఁ దగదు. నాకొఱకై సాల్వరా జెదురు సూచుచుండును. కనుక నన్నాతని కడ కంపుదువని యాశింతును. నన్నుఁ గరుణింపుము. నీవు సత్యవ్రతుఁడవు. నీ కీర్తి పొలివోవరాదు."

భీష్ముఁడామె మాటలు విని యంబను సాల్వుని కడ కంపినాఁడు. ఈ సందర్భమునఁ గొందఱు విమర్శకులు భీష్మాచార్యునిది దోషమని వాదింతురు. వారి యూహ మపోహ యని నిరూపించుటకే భారతమునందలి పై భాగము నుద్ధృతీకరించితిని. తర్వాత జరిగిన కథను గూడ కేవలము నా పాడిమాటలతోఁ గాక వ్యాసభగవానుని వచనానుసారమే మనవి సేయుదును. భీష్ముఁ డుద్యోగపర్వమున దుర్యోధనున కంబావృత్తాంతము నెఱింగించెను. అప్పటి శ్లోకము లివి.

"తతో ऽహం సమనుజ్ఞాప్య కాళీం గంధవతీం తదా

....... ....... .....

నిశ్చక్రామ పురాద్దీనా రుదతీ కురరీ యథా!

(బా. ఉ, ప, అ, 175)

"అంబ యీ మాట లన్నంతనే నేను నా తల్లియైన సత్యవతి యభిప్రాయమును విచారించితిని. ఆమె యీ కన్య ప్రార్థన మంగీకరించెను. మంత్రి పురోహితులు గూడ నట్లే యభిప్రాయ మొసఁగిరి. వారి యనుమతివి నేను సాల్వుని కడ కంబ నంపితిని. వృద్ధులైన ద్విజాతులఁ గొందఱు నామె

వెంట పంపితిని. పరిచారికల నామెకుఁ దోడొసఁగితిని. అంబ సాల్వరాజును దరిసి యిట్లనెను. "మహారాజా! నేను నిన్ను వలచి యింత దూరము వచ్చితిని. నన్నుఁ బరిగ్ర హింపుము." ఈ మాటలు విని సాల్వుఁడాశ్చర్య పడినాఁడు. ఆతఁడు బదులువలికెను. "వరవల్లినీ! నిన్ను భీష్ముఁడు బలవంతముగఁ గైకొని పోయెను. అతనిచే నీ వితరుల కొఱ కుద్దేశింపబడితివి. కనుక నీ విప్పుడన్యగృహీతవే! నేను ని న్నిపుడెట్లు గ్రహింతును? నేను రాజును గదా! ఇతరులు ధర్మమును దప్పినప్పుడు శిక్షించుట నా పని. మఱి తెలిసి తెలిసి యన్యగృహీతవైన నిన్ను గ్రహించినచో నా జనులు నవ్వరా! కనుక నీవు మఱల భీష్ముని వద్దకే పొమ్ము. నిన్ను నేను గ్రహింప నొల్లను. " ఈ మాటల కంబకు దుఃఖము వచ్చెను. అనంగ శరపీడిత యగు నామె మరల సాల్వునితో నన్నది. "మహారాజా! నీ విట్లు బలుకరాదు. నేనై సమ్మతించి భీష్ముని వెంటఁ బోలేదు. ఆతఁడు రాజుల నందఱ జయించి యేడ్చుచున్న నన్ను బలవంతముగ రథముపై వెట్టుకొని పోయెను. దీనిలో నా తప్పేమి గలదు? నేను నిన్ను మనసారఁ బ్రేమించితిని ఇట్టి నన్ను వదలుట నీకు ధర్మము గాదు. హస్తినాపురమునకుఁ జేరినపిదప "నేను సాల్వునం దనురక్తన"ని భీష్మునకుఁ దెలిపితిని. ధర్మవిదుఁడైన యాతఁడు "అట్లైనచో మీరు సాల్వుని కడ కేగవచ్చు" నని సమర్యాదగఁ బంపెను. ఇపుడు నేను వెనుకకు బోయినచో నాతఁడు గ్రహించునా? నా చెల్లెండ్రైన యంబికా - అంబాలిక లిరువురును విచిత్రవీర్యుని వరించిరి. నా మనస్సు నీ యందే లగ్నమై యున్నది. ఈ విషయము నిక్కమని నిరూపించుట కెటువంటి ప్రతిజ్ఞనైనను జేయుదును. నీవే నా భర్తవు. ఇది సత్యము. నీ ప్రసాదము నాకాంక్షించి వచ్చిన కన్యను బరిగ్రహింపుము. రాజా! నే ననన్యపూర్వను."

అంబ యెంత ప్రార్థించినను సాల్వరాజు వినలేదు. ఆమె నాతఁడు సృము జీర్ణత్వచము వలె వదలివేసెను. ఎంత ప్రార్థించినను లాభము లేకపోఁగ

గాశీరాజ దుహితకుఁ గోపము వచ్చినది. సాశ్రునయన యైన యామె సాల్వునితో నిట్లనెను. "నీ చేత విడువబడిన నేను దిక్కులేనిదాననై తోఁచినయెడకుఁబోయెదను. పాపలేశము లేని నా కుత్తమలోకములు సిద్ధించుగాక!" ఈ మాటలకు సాల్వుఁడు బలుకనేలేదు. "పొమ్ము! పో"మ్మను పల్కుల మాత్రమే యాతని గన్నుల దెల్పుచుండెను. నిరాశ యయిన గాశీరాజు దుహిత కురరి వలె దీనముగ నేడ్చుచు నా చోటు వాసెను."

పై ప్రకరణము నంతయు సునిశితముగ విచారించినచో జరగిన కథలో భీష్మునిదోష మావంతయు లేదనుట స్పష్టము. స్వయంవరమునం దనన్య సామాన్యమైన పరాక్రమము బ్రదర్శించిన వారి సొత్తే యా కన్య! ఇది యానాటి సామాజిక నియయము! ఈ నీతి ననుసరించి భీష్ము డా కన్యలను విక్రమముతో గెల్చికొన్నాఁడు. దీన నాతని దోషమేమున్నది? అంబ సాల్వునయం దనురక్తయని భీష్మునకుఁ దెలియదు. అందుచే నాతఁడు తక్కిన యిరువురతోఁబా టామెను గూడ హరించినాఁడు. అంబ తన వృత్తాంతము నాతని కప్పుడే తెలుపవలసి యుండెను. కాని యా కన్య భయంకరమైన యా రణసంరంభమును గాంచి చకితయైనది. అందుచే నాతని కామె యప్పుడు దెలుపలేదు. ఆమె తెలుపనిది భీష్మునకు సాల్వరాజ ప్రణయ వృత్తాంతము దెలియుట కవకాశము లేదుగదా! సాల్వుఁడైనను గాంగేయున కా విషయ మెఱుక పఱుపవలసి యుండెను. అతఁడు జెప్పియుండినచో సర్వమును సమరసముగ జరగిపోయి యుండెడిది. సాల్వుఁడా పని యొనర్పలేదు. మహావీరుని వలె భీష్ము నెదిర్చి పరాభవము నంది పజీతుబట్టెను. మార్గమధ్యమున నైనను కాశీరాజ కుమారి దన గోడును గాంగేయునకు వెల్లడించెనా? లేదు. వివాహప్రసక్తి వచ్చినపుడే యామె దన ప్రణయ వృత్తాంతము జెప్పినది. వెంటనే యామెను భీష్ముఁడు సాల్వునికడ కంపెను. సాల్వునికడ కేగుచున్న యంబపై యాతఁడే యనాదరము జూపించినవాఁడు

గాఁడు. ఆమెకు దోడుగ వృద్ధబ్రాహ్మణుల నంపెను. పరిచారికల నంపెను. మఱి సాల్వుఁ డామె నన్యగృహీతయని నిరాదరించుటలో నెట్టి కారణమున్నది? తన మనస్సునందు గలిగిన సంశయము వాపికొనుటకు సాల్వుఁడొక్కపని యొనర్పవలసి యుండెను. హస్తిపురముకు దూతలబంపి యతడు సత్యమును దెలిసికొని యుండిన బాగుండెడిది. కాని సాల్వునకు భీష్మునిపై గూఢద్వేషము గద్దు. తన్నతఁడు యుద్ధమున బరాభవించెను. దానికి బ్రతీకారమొనర్పు శక్తి సాల్వునకు లేదు. జయాపజయములు రాజులకు సామాన్యములే యని యోర్చుకొను వివేకమును సున్న! వాడు దురభిమాని! ఈ విషయమున దోషమెవరిదైన నున్నచో నది సాల్వునిదే! భీష్మునిది గాదు. అందుకే వ్యాసులు సాల్వరాజును 'అదీర్ఘదర్శి' యని వర్ణించిరి.

అంబ యేడ్చుచు నచ్చటినుండి గదలెను. ఆమె యరణ్యములు బ్రవేశించెను. దారిపొడుగున నామె తన దురదృష్టమును నిందించుకొన్నది. సాల్వుని మూర్ఖత్వమునకు శోకించెను. స్వయంవరము నేర్పాటు జేసిన తన తండ్రి యవివేకుఁడనెను. భీష్ము డొనర్చిన పని యక్రమమని వాపోయెను. వనమున నామె కనేక తపస్వులు దర్శన మొసగిరి. వారిందఱి కామె తన గోడును వెళ్ళఁబోసి కొనెను. ఆమెపై నందఱు సానుభూతిఁ జూపిన వారే! కొందఱు భీష్ముని, కొందఱు సాల్వుని యెవరి యిష్టము వచ్చినట్లు వారు నిందింపసాగిరి. అంబ వారితో జేరి తప మొనర్తుననెను. వారందులకు సమ్మతింప లేదు ఆమె యందము సామాన్యమైనది గాదు. పైగాఁ జిన్న వయస్సు. అడవులలో వసించుటనగా బాలక్రీడ కాదుగదా? అంతేగాదు, అడవులలోని కెవ్వరెవ్వరో రాజులు మృగయా యాత్రలకై వత్తురు. వారామెను జూచుట దటస్థించినచో, బ్రమాదము గదా! తాపసులామెను దిరిగి పితృగృహమును జేరఁబొమ్మన్నారు.

కాని యామె వారి వాక్యములకు సమ్మతింప లేదు. ఈ వ్యవహారము నెట్లో దేల్చి కొన వలెనని యామె హఠముబట్టినది. ఆమె తపస్వులతో నిట్లనెను.

"న శక్యం కాశినగరం పునర్గంతు పితుర్గృహాన్

...... .......... ......

దౌర్భాగ్యం తాపసశ్రేష్ఠాః తస్మాత్తప్స్యా మ్యహం తపః !

(భా. ఉ. ప. అ. 176)

"నేను పితృగృహమును మఱల జేరలేను. పోయినచో మానము దప్పదు. బాల్యమున జనకుని కడ వసించితిని. అపుడు వారల్లారు ముద్దుగ నన్ను బెంచిరి. అట్టి యింటిలో బాంధవుల నుండి పరాభవమునందుచు నే నెట్లు మన నేర్తును? నేను మీతోఁ గూడి దపశ్చర్య సాగింతును. నా యైహిక జీవనము జెడినది. ఆముష్మిక జీవనమును జెడుట నాకిష్టము లేదు."

ఇంతలో నా యాశ్రమమునకు హోత్రవాహనుఁడను రాజర్షి వచ్చెను. ఆతని కంబ దనవృత్తాంతమును దెల్పెను. హోత్రవాహనుఁడెంతయో దుఃఖించెను. పరశురాముని సందర్శించి తన దుఃఖమును జెప్పికొన వలసినదని హోత్రవాహనుఁడంబతో నన్నాఁడు. జామదగ్న్యుఁడు దయబెట్టినచో నామె దుఃఖము దూరమగుననియు నాతఁడు బలికెను. ఈ సన్నాహము లిట్లు జరగుచుండగనే యచ్చటి కకృతవ్రణుఁడరుఁగుదెంచెను. ఇతఁడు పరశురాముని శిష్యుఁడు. హోత్రవాహనుఁడాతనితో నంబ యొక్క వృత్తాంతము నంతయుఁ జెప్పెను. హోత్రవాహనుని యభిప్రాయము ననుసరించి భీష్ముఁడే యపరాధి. సాల్వుని నిరాకరణమునకు మూలకారణము గాంగేయుఁడు. పరశురాముఁడు గూడ నింతలో నచటికి వచ్చుననియు, దన కష్టములు వేరుగా నంబ యెఱిఁగించుకొనవచ్చు ననియు నకృతవ్రణుఁడు దెలిపినాఁడు. అంబ యభిప్రాయము ననుసరించి

దోషి యెవ్వఁడో నిర్ణయించికొన వలెనని అకృతవ్రణుని యూహ! అందుచేనాతఁడామె నడిగెను. ఆమెకు భీష్ముఁడే యపరాధి యను భావము లేదు. అందుచే నంబ గాంగేయునిపై మాత్రము దోషము మోపక "మీరే యెట్లో యొకరీతి యోచించి యీ వివాదమును బరిష్కరింపుఁడ"ని మనవి జేసినది. కాని భీష్ముని పరాక్రమము విని, కని యకృతవ్రణుఁడోర్వలేకపోయెను. ఈ సందర్భమున నెటులైనను భీష్ముని వలలో దగిలింపవలెనని యాతఁడెంచెను. గొప్పవారికి నిట్లే లోకమున నకారణ శత్రువు లేర్పడుచుందురు. అకృతవ్రణునకును, అంబకును జరగిన సంవాదము భారతముని నిట్లున్నది.

అకృతవ్రణ ఉవాచ:

"దుఃఖద్వయ మిదం భద్రే! కతరస్య చికీర్షసి

....... ...... ........

తస్మాత్ ప్రతిక్రియా యుక్తా భీష్మే కారయికుందవ!

(భా. ఉ. ప. అ. 177)

అకృతవ్రణుఁడిట్లు పలికెను. "అమ్మా ! నీ దుఃఖము రెండు విధములు, ఒకటి సాల్వుని నుండి ప్రాప్తించినది. మఱియొకటి భీష్ముని నుండి గలిగినది. సభపతియైన సాల్వుని పై నీకు బగయున్నచోఁ జెప్పుము. మహాత్ముఁడైన జామదగ్న్యుఁడు సాల్వునకుఁ దగిన శాస్తి యొనర్చును. లేక భీష్మునిపై నీకుఁ మా! అదియైన వచింపుము. పరశురాముఁడు భీష్ముని రణమున నిర్జించి సంతోషము గల్గించును."

అంబ యన్నది. "భగవన్! సాల్వుని యందు నే ననురక్తనని భీష్ముఁడెఱుఁగఁడు. ఎఱిగి - యెఱిగి కైకొనిపోయి యున్నచో నాతనిది దోషమే యగును. కనుక యీ వివాదమును మీరే బరిష్కరింపుఁడు. కురుశార్దూలుఁడైన భీష్ముఁడో, లేక సాల్వుఁడో, కాక యిర్వురో దోషు లెవ్వరో నేను నిర్ణయింపలేకున్నాను.

మీరే యుక్తి యుక్తముగ దీనిని బరిష్కరింపవలెను."

అకృతవ్రణుఁడామె కిట్లు ప్రతివచించెను. "అంబా! నీ వీ విషయమున ధర్మసూక్ష్మ మడిగితివి. ఒకవేళ భీష్ముఁడు రాజుల నందఱ జయించినను ఆతఁడు నిన్ను గజపురమునకు గొనిపోకయున్నచో సాల్వుఁడు నిన్ను వరించి యుండెడివాఁడే! నిన్ను గాంగేయుఁడు హస్తిపురమునకుఁ దీసికొనిపోవుట తోడనే సాల్వునకు సందేహము గలిగినది. సాల్వుని సందియమునకు భీష్ముని సాహసమే కారణము. నిన్ను గైకొనిపోయిన భీష్ముఁడు ని న్నే మైనను జేసియుండవచ్చును గదా! జితమైన వస్తు వాతని స్వత్వము. మఱి సాల్వుఁడు సందేహపడుటలో నాశ్చర్య మేమున్నది. ఇంతకును భీష్మునికి దన విక్రమమును గుఱించి గొప్ప యహంకార మున్నది. తన్నెవ్వరును జయింపలేరని యాతని తలఁపు. కనుక న న్నడిగితివా! భీష్ముఁడే ప్రతీకారమునకు యోగ్యుఁడు."

అకృతవ్రణుని యీ వాదము తామసిక మైనది. దీనికి మూలకారణము శాంతనవునిపై నాతనికి గల యసూయ ! భీష్ముఁడామెను గజపురమునకు గొనిపోకయున్నచో సాల్వునకు సందేహము గలుగుటకు వీలేది? కనుక గాంగేయుడు దోషియను టంతయు నకృతవ్రణుని కల్పనే! బ్రాహ్మణున కయుక్తమైన ద్వేష మాతని మనస్సు నాక్రమించినది. మఱుదినమున బరశురాముఁడాశ్రమమునకు వచ్చెను. సర్వ వృత్తాంత మాతని కెఱింగింపఁబడినది. ఆ తరువాత కథ యిది

"తస్యాశ్చ దృష్ట్వా రూపం చ వపు శ్చాభినవం పునః

....... ...... .....

కాయేషు విదితం తుభ్యం పురా క్షత్రియసంగరే !

(భా. ఉ. ప. అ. 178)

అంబ యొక్క రూపమును, సౌకుమార్యమును, అభినవమైన శరీరము

జూచి భార్గవరాముని కెంతయో జాలి కలిగినది. ఆమె వృత్తాంత మంతయు నామె నోటనే విందమని పరశురాముఁడు నీ దుఃఖమేది యని యడిగెను. ఆమె బూసఁగ్రుచ్చిన ట్లంతయు వివరించినది. రాముఁడనెను. "అమ్మా! కురుశ్రేష్ఠుఁడైన భీష్ముని కడకు వర్తమాన మంపెదను. వాడు నాకు శిష్యుఁడు. నా మాట జవదాటఁడు. జవదాటెనా! దాని ఫలమనుభవించును. నా క్షాత్ర తేజస్సుతో వాని జీవితము నింకింతును. లేదా! సాల్వునే యొప్పించుమందువా! అట్లే యొనర్చెదను. వీ రిర్వురును నా మాట మన్నించెడివారే! నా కొక్క నియమ మున్నది. బ్రాహ్మణ కార్యమునకు దప్ప శస్త్రమును నేను ధరించుటలేదు. నా వచన మన్నచో భీష్ముడు నీ పాదములను బట్టికొని క్షమాపణ వేడుటకును జంకడు.

అకృతవ్రణుని బోధ లంబ కప్పుడే బాగుగా నాటియున్నవి. ఆమె పరశురామున కిట్లు విన్నవించెను. "భార్గవరామా! భీష్ముఁడే యీ విషయమున నపరాధి యని నా యభిప్రాయము. గర్జించుచున్న యసురుని వలె నీ వాతనిని రణమున సంహరింపుము. ఇదియే నాకు ప్రియము." ఇంతలో సమయమునకుఁ గాచికొని యున్న యకృతవ్రణుఁడు భార్గవరామున కిట్లు విన్నవించినాడు. "గురూ ! యీమె నీ పాదములఁ బట్టినది. శరణాగతురాలై వచ్చిన యీమెను విడనాడకుము. నీవు భీష్ముని యుద్ధమున కాహ్వానించినచో నాతఁడు నీ నియోగమునైన నంగీకరించును. లేదా నీ కోడితి నని యైన బదులుపలుకును. ఈ రెంటిలో నేదిగాని యంబ కిష్టమే! నీ వింతకుముందు క్షత్రియ కులముల నెల్ల నిఱువది యొక్క మారు వధించితివి. వధించి యిప్పుడు శాంతుఁడవైనావు. కాని నాలుగు వర్ణములలోను యెవడు బ్రాహ్మణుని ద్వేషించునో వానిని సంహరింతు నని నీ ప్రతిజ్ఞ యున్నది. శరణాగత పరిపాలనము గూడ నట్టి కార్యమే! ఈమె నిన్ను శరణుజొచ్చినది. క్షత్రియుఁడైన గాంగేయుడు దన్నెవ్వడు జయించలేడని విఱ్ఱవీగుచున్నాడు. కనుక

నీమె కొఱకై వానికి శాస్తి యొనర్పుము." రాముఁడు శిష్యుని సూచనకు సమ్మతించినాడు. అతఁడు వలికెను. "అకృతవ్రణా! నీ వాక్యములకు సమ్మతించితిని. భీష్ముడు రణకోవిదుఁడే! సందేహములేదు. కాని వాడు నా యానతిని మన్నించి తీరవలెను. మన్నింపకుండెనా! రణభూమి యందు గాంగేయుని శిరస్సు రక్తమునఁ దేలియాడును. నా బాణము లమోఘములని నీ వెఱుఁగుదువు. క్షత్రియులతో జరగిన యుద్ధములు నీవు జూచినవే గదా !"

అంబను వెంట బెట్టికొని జామదగ్న్యుడు హస్తినాపురికి వచ్చెను. భీష్మన కాతఁడు జెప్పిపుత్తెంచినాఁడు. గురుభక్తుఁడైన భీష్మఁడు జామదగ్న్యుని దర్శనమునకై వచ్చెను. అతనిని బరశురాముఁడి ట్లాజ్ఞాపించెను. "భీష్మా! కాశీరాజు దుహితయైన యంబను నీవు హస్తినాపురికిఁ గొనివచ్చితివి. ఆ కారణమున నామె సాల్వరాజుచేఁ దిరస్కృత యైనది. ఈమెను నీవు మరల ప్రతిగ్రహింపుము. ఇది నా యాజ్ఞ." కాని భీష్మఁ డిందులకు సమ్మతింపలేదు. అతఁడు గురువున కొసఁగిన యుత్తరము భారతమునం దిట్లున్నది.

"గురూ! ఈమెను మరల నా తమ్మునకు వివాహ మొనర్పలేను. నేను సాల్వరాజును వరించితినని యీమెయే ముందు నాతోఁ బలికినది. నే నా గోర్కె కడ్డు రాలేదు. సమ్మతించి సాల్వునికడ కంపితిని. క్షాత్రధర్మము నాకుఁ బ్రాణసమానమైనది. భయపడి గాని, యను క్రోశముతో గాని, యర్థలోభముతో గాని,గామ్యముతోఁ గాని నా ధర్మమును వదలను."

రామునకుఁ గన్ను లెఱ్ఱవారినవి. "నీవు నా నియోగము నొనర్పకున్న సహామాత్యముగ హస్తినాపుర మంతయు నాశన మొనర్తును. నీవే, యు బరిగ్రహించి తీరవలెను." భీష్మఁడనెను. "భార్గవరామా! నీవు, నన్ను రొ కాహ్వానించుట దగదు. నీవు నా కస్త్రాచార్యుఁడవు. చిన్నతనమున నీ

సమస్తము లైన యస్త్రముల నెఱింగితిని."

"నేను నిక్కముగ నీకు గురువు నైనచో నా యనుజ్ఞతో నీ కన్యకను బరిగ్రహింపుము. లేనిచో నా కోపము శాంతింపదు. నీ వొనర్చిన పనివలన యంబ జీవనము బాడైనది."

"భార్గవరామా! నీ పాదములకు సవినయముగ నమస్కరించి విన్నవించికొనుచున్నాను. ఆమె యన్యాసక్త యని స్పష్టముగఁ దెలిసియు నే నెట్లు మరల గ్రహింతును? భగవన్! పరాసక్తయైన పడతి యంతఃపురమున కభాగ్యము గదా!"

"నీవు గ్రహించియే తీరవలెను."

"జామదగ్న్యా! వాసవుఁ డెదిర్చినను నా ధర్మమును నేను వదలను. మరుత్తుఁడను రాజు పలికిన నీతివాక్యమని పురాణములం దొక శ్లోకము గలదు. కార్యాకార్యము లెఱుఁగక యుత్పథములందు బ్రవర్తించువాఁడు గురువైనను వానిని వదలవలెనని దాని భావము. నీవు నా కాచార్యుఁడ వని వదలితిని. ఆ గౌరవమును నీవు నిలిపికొన లేకపోయితివి. నీవు నా గురువవు. అందునను బ్రాహ్మణుఁడవు. విశేషించి తపోవృద్ధుఁడవు. నిన్ను వధించుట లోపమే! కాని రణభూమినెదిర్చి నిలిచి పారిపోక యుద్ధమొనర్చినచో బ్రాహ్మణు నైనను వధింపవచ్చునని ధర్మశాస్త్రము బలుకుచున్నది. అట్లు వధించినచో బ్రహ్మహత్య రాదు. నేను క్షత్రియుఁడను. నా ధర్మమును బరిపాలింపవలయును. కృతమునకుఁ బ్రతికర్తవ్యము సనాతనమైన నీతి. అర్థము నకు హాని యేర్పడినప్పుడు దానిని రక్షించుకొనుటకై నరుఁడు సాహసింప వచ్చును. నా ధర్మమనెడు నర్థమున కిప్పు డపాయము సంభవింప నున్నది. కనుక నీతోఁ బోరుదును. అతి మానుషమైన నా విక్రమమును బాహువీర్యమును నీవే గ్రహింతువు గాక! కురుక్షేత్రమున

మన మిరువురమును ద్వంద్వయుద్ధ మొనర్తుము. సన్నద్ధుఁడవు గమ్ము. కురుక్షేత్ర యుద్ధమున నాతో వధింపఁబడిన వాఁడవై యుత్తమ లోకములఁ బొందెదవు గాక! నీ వింతకుముందు క్షత్రియుల నందఱ వధించి జనకునకు రక్తతర్పణముల నొనర్చితివి. ఆ చోటనే నిన్ను వధించి నా ధర్మమ్మును నిలిపికొందును. అది నీకు శోభ! ఇది నా కలంకారము. నీ వింతకుముం దనేక క్షత్రియుల నోడించితివి. ఆ విషయమునే యందఱి తోడను గొప్పఁగ జెప్పికొనుచుందువు. నాఁడు భీష్ముఁడు పుట్టలేదు. అందుకే నీ యాటలు సాగివచ్చినవి. అటు తరువాత క్షాత్రతేజస్సు లొక్కటై నేను జన్మించితిని. యుద్ధమయమైన నీ దర్పము నడగింతును. పరపురంజయుఁడనైన గాంగేయుఁడను భూమిపై నున్నాను.ఇఁక క్షాత్రధర్మము నీకుఁదలయొగ్గ వలసినది లేదు."

భీష్ముని మాటలకు పరశురాముఁడు ఫక్కుమని నవ్వినాఁడు. అతడిట్లు బదులు పలికెను. "ఓయి గాంగేయా! నీతో యుద్ధము గలుగుట యొక రీతిగా నదృష్టమే! ఇప్పుడే నేను కురుక్షేత్రమున కేగుచున్నాను. అచట నిన్నవశ్యము నాశనమొర్తును. మద్బాణవిక్షతమై కంకగృధ్రములు భక్షించుచున్న నీ శరీరమును నీ మాతయైన గంగాదేవి కన్నులార గనుగొను గాక! సిద్ధచారణ సేవిత యైన గంగాదేవి కంట గన్నీరు దెప్పించుట నా కనుచితమే! కాని విధిలేదు. మందుడు, ఆతురుడవు నైన నిన్ను గర్భమున ధరించిన దోషమునకు జాహ్నవి యీ దుఃఖము ననుభవింపవలసినదే! రథమును సిద్ధపఱచికొని రమ్ము."

భీష్మ పరశురాముల యుద్ధము ముప్పది దినములు సాగినది. ఆ ద్వంద్వయుద్ధమునఁ బరశురాముడోడినాడు. భీష్ముని యీ మృత్యుంజయ ప్రవృత్తి భారతమున ననేకసారులు ప్రదర్శితమైనది. సభాపర్వమునందు రాజులందఱు దనపైకి చెలరేగి నప్పుడు. మిమ్మందఱను గడ్డిపోచవలెఁ జూతునని పలికిన సాహసి యాతడు. అన్నంత పనిఁ జేయగలవాడు. వయస్సు గడచుకొలది

యాతని బలము రెండింతలు మూడింతలు నయ్యెను. అట్టి దాతఁడు పట్టిన బ్రహ్మచర్యవ్రత ఫలితము. యోధ, తపస్వి మహాపరాక్రమి, తేజస్వి, జ్ఞానసంపన్నుఁడు. ఇట్టివాఁడు ద్రౌపదీవస్త్రాపహరణ సందర్భమున మౌనము నేల వహించెను? కురురాజ్యముపైఁ దన యధికారము వదలుకొన్నాడు. తానింత కష్టపడి పోషించిన కురువంశము దన కన్నుల యెదుటనే యస్తమించి పోవుచుండగా 'బెల్లముగొట్టిన ఱాయి' వలె నేల యూరకుండెను? ఒకానొక న్యాయమును. ధర్మమును సాధించికొనుటకై గురువంతటివానితో గూడ నాతఁడు బోరెను. యుధిష్ఠిరునిది ధర్మపక్షమని యాతనికి స్పష్టముగఁ దెలియును గదా! మఱి యాతని పక్ష మవలంబించి దుర్యోధనాదుల నెందుకు మందలింపలేదు. ఇట్టి ప్రశ్నలనేకములు గాంగేయునిపై, విమర్శకులు వర్షించిరి. వీనికి సమాధానములు భారతములో వేమైన నున్నవేమో జాతము గాక!

## భీష్మ ప్రతిజ్ఞ

శంతనుఁడు గాంగేయుని యువరాజుగ నొనర్చి నిశ్చింతగ నుండెను. నాలుగు వర్షములు గడచినవి. ఒకనాఁడాతఁడు యమున గట్టుపై నలవోకగా దిరుగుచుండెను. దాశకన్య యాతని కంటబడినది. ఆమె శరీరమం దుండిన సువాసనలు పరిసరముల ఘుమఘుమితము లొనర్చుచున్నవి. ఆమె యందముల చందములు మేనితావులు శంతనుని హృదయమును గలచినవి. ఆ కన్యనుఁ దనకుఁ బరిణయమొనర్పవలెనని దాశరాజు నర్థించినాఁడు. దాశరా జిట్లనెను. "నీవు సత్యవంతుఁడవు. కాని నా కుమార్తెను వివాహమాడుటకు ముందు నా కొక్క ప్రతిజ్ఞ సేయవలెను."

శంతనుఁడనెను "అదేదియో వచింపుము. నీవడుగునది నాకు సమ్మతమైనచో 'నౌ' నందును. కానినాడు 'గా'దందును." "నాకుమార్తెయగు సత్యవతికి జనించు

తనయుఁడే రాజసింహాసనమున కుత్తరాధికారి గావలెను. ఇది నీకు సమ్మతమైనచో నీకు నేను నా కన్నె నిత్తును."

శంతనున కీ కోర్కె సమ్మతము గాలేదు. సత్యవతిపై నున్న మోహము నాతఁడు బలవంతముగ నడఁచికొని వెన్కకు మఱలినాఁడు. ఈ కథ భారతమున నిట్లు గలదు.

శంతను రువాచ:

శ్రుత్వా తవ వరం దాశ । వ్యవస్యేయ మహం తవ ।
దాతవ్యం చే త్ప్రదాస్యామి । న త్వం దేయం కథంచన ।

దాశ ఉవాచ:

అస్యాం జాయేత యఃపుత్రః సరాజా పృధివీపతే ।
త్వదూర్ధ్వ మభిషేక్తవ్యో నాన్యః కశ్చన పార్థివ ।

వైశంపాయన ఉవాచ:

నా కామయత తం దాతుం వరం దాశాయ శంతనుః
శరీరజేన తీవ్రేణ దహ్యమానోపి భారత !

(భా. ఆది. ప. అ. 100)

చింతామగ్న మనస్కుఁడు శంతనుఁడు హస్తినాపురమునకుఁ దిరిగివచ్చె నంటిమి. వచ్చెనే గాని యాతనికి మనస్సులో మనస్సు లేదు. తండ్రి విచారమును భీష్ముఁడు గనిపెట్టినాఁడు. కాని ఆతని కేవిషయమై చింతయో బుత్త్రునకుఁ దెలియలేదు. వారిని వీరిని విచారించెను. కడకు నేరుగాఁ దండ్రినే యడిగినాఁడు. ఆతఁడిట్లనెను. "నాయనా ! నీవంటి యోగ్యపుత్త్రుఁడుండగా నాకుఁ జింతపడవలసిన యవసర మేమున్నది. కాని నీవు నా కేకైక పుత్త్రుఁడవు. ఇఁక నీవందమా ! నిరంతరము శస్త్రములగాని క్షత్రియోచితములైన పురుషార్థములను సాధించుటకై బ్రయత్నించుచుందువు. శతావధి కుమారుల కంటెను నీ వంటి సమర్థుఁడైన పుత్త్రుఁడొక్కఁడే దండ్రికిఁ జాలును. ఇది నిజమే! కాని క్షాత్రధర్మ నిమగ్నుఁడవైన నీ

ప్రయత్నములలో నేదేని యొక్కటి సంఘటిల్లిన మన వంశమే యంతరించును గాదా! నీ కొక్క తమ్ముఁడున్నచో మరి విచారమే లేదు."

తండ్రి యాడిన యీ మాటలను బట్టి కుమారుఁడు సచివుఁడు మొదలైన వారినుండి జరగిన కార్యము నంతయు గడ్డకుఁ దీసెను. తండ్రి యెడదలోని దుఃఖము మంత్రులు భీష్మునకుఁ దెలిపిరి. తెల్లవారుటయే తడ వాతఁడు దాశరాజు కడ కేఁగి తన తండ్రికై సత్యవతిని యాచించినాఁడు. దాశరాజు భీష్మునితో మరల నవే మాటలుగా నిట్లు బలికెను. "శాంతనవా! నీ కోరిక మన్నించకపోవుట నా చేతఁగాదు. కాని దన కుమార్తె సుఖపడవలెనను చింత ప్రతి తండ్రికి నుండును. ఇది సహజమే! శంతనునకు నా కన్నె నిచ్చుటలో నా కసమ్మతి లేదు. నా కున్న బాధ యొక్కటే! దానిని జెప్పెదను వినుము. నీవు సర్వవిధముల కురురాజ్య సింహాసనమున కర్హుఁడవు. నీ తండ్రి యొక్క ద్వితీయ వివాహము నీకు సమ్మతమైననే శోభించును. అట్లుగాక నీ వెదిర్చి నిల్చితివా యిప్పుడు దేవాసురు లైనను నిన్ను దాకి నిలువలేరు. మఱి యిట్టి స్థితిలో నీ కెఱుకలేక మీ తండ్రికి కన్నె నొసఁగి యామె దుఃఖమునకు బాధ్యుఁడ నగుటకు నా కిష్టముండునా? ఈమె కడుపునఁ బుట్టు సంతానమే రాజ్యమున కుత్తరాధి కారి గావలెనని శంతనుని యాచించితిని. ఈ విషయమున నీ యభిప్రాయ మెట్టిదో!"

విషయ మంతయు గాంగేయున కవగత మైనది. తన రాజ్యాధికారమునకై తండ్రి యైన శంతనుని దుఃఖపఱచుట భీష్ముని కిష్టము లేదు. కురురాజ్యసింహాసనము పైఁ దాను గూర్చున్నను దన తమ్ముఁడు గూర్చున్నను నొక్కటియే గదా! ఇందులో భేద మేమున్నది? మహామనస్కుఁడైన భీష్మునికీ రీతిగనే దోఁచినది. తోఁచుటయుయుక్తమే! ఈ కథను వ్యాసుఁడిట్లు చెప్పెను.

"ఏవ ముక్త స్తు గాంగేయ స్తద్యుక్తం ప్రత్యభాషత

........ ........ ........

త్వత్తో హ్యనుజ్ఞాం సంప్రాప్య మృత్యుః ప్రభవితా నఘ!

(భా. ఆ. ప. అ. 1)

దాశరాజునకు సర్వరాజ సమక్షమున భీష్ముఁడిట్లనెను. "దాశరాజా! నే నెప్పుడసత్యమును బలుకను. ఇదిగో! నా ప్రతిజ్ఞను వినుము. సత్యవతీదేవి గర్భమున నుదయించు కుమారుఁడే మాకు రాజగును. ఇట్టి ప్రతిజ్ఞను ముందెవ్వ రొనర్పలేదు. సమకాలికు లెవ్వరిట్టి దంగీకరింపలేదు. అయినను నే నొనర్చుచున్నాను. ఈ మాటఁదప్పను. రాజ్యముపై నాకున్న యధికారమును వదలుకొన్నాను."

దాశరాజు పేరాస యింతటితో నాగలేదు. ఆతఁడు మరల నిట్లు వచించెను. "గాంగేయా! నీ కఠోరమైన ప్రతిజ్ఞ ప్రశంసార్హము. సత్యధర్మ పరాయణుఁడవైన నీ కీర్తిస్థిరముగ నిలుచును. కాని నాకు మఱియొక్క చిన్న సంశయ మున్నది. నీ వీ కల్యాణమున కంగీకరించుటచే నీ నుండి సత్యవతి కుమారుల కేమియు భయములేదు. కాని నీ పుత్త్రు లెదిరించినచో?"

వెంటనే శాంతనవుఁడు రెండవ ప్రతిజ్ఞ నొనర్చెను. "దాశ రాజా! నీ వన్నమాట నిజము. నా రెండవ ప్రతిజ్ఞను వినుము. నాకు సంతానము గల్గిన గదా నీ దౌహిత్రులకు బాధ! నేను వివాహమే యొనర్చికొనను. బ్రహ్మచర్యమును బాలింతును. అపుత్త్రకుఁడ నైనను తపోమహిమచేఁ బుణ్యలోకముల సంపాదించికొందును."

గాంగేయుని మాటలు విని దాశరాజు శరీరము రోమాంచకంచుకిత మైనది. ఆతఁడు మఱుమాట పలుకలేదు. వెంటనే కన్నెను భీష్మున కొప్పించెను. శాంతనవుని కర్తవ్య నిష్ఠను జూచి దేవత లాకాశము నుండి పూలవానలఁగురిపించిరి.

"భీష్మ" మైన ప్రతిజ్ఞ నొనర్చుటచే "భీష్ముఁ" డని యాతని పొగడిరి. తల్లిని రథముపై గూర్చుండఁబెట్టికొని శాంతనవుఁడు హస్తినాపురికి దోడ్కొనివచ్చి తండ్రికి సమర్పించెను. భీష్ముని యతిలోకమగు నీ త్యాగమును రాజర్షులు, బ్రహ్మర్షులు బ్రశంసించిరి. శంతనుఁడు కుమారున కిట్లు వరదాన మొసఁగెను. "కుమారా! నీవు స్వచ్ఛందమరణుఁడ వగుదువు. నీ పై మృత్యువున కధికారము లేదు. నీవే మృత్యువును నియమింతువు,"

రాజర్షి భీష్ముఁ డొనర్చిన ప్రతిజ్ఞ ధర్మశాస్త్ర దృష్టితో నమూల్యమైనది. వైయక్తికముగను మానవుఁ డందికొనదగిన మహాదర్శములలో గొప్పది. భారతీయ సంస్కృతిలో పితృగౌరవ మొక యనర్ఘమైన విషయము. పితృగౌరవముతో మహాత్యాగము నొనర్చిన చిరధ్యేయులు మన సాంస్కృతిక చరిత్రలో నెందఱో యున్నారు. భగవంతుఁడైన శ్రీరామచంద్రుఁడు తండ్రి కిచ్చిన మాట కై రాజ్యమునే వదలి చనెను. భీష్ముఁడంతకన్న నొక్క యడుగు ముందునకు వేసినాఁడు. రాజ్యమును మాత్రమే గాదు. శారీరక సుఖములను గూడ వదలినాడు. ఇట్టి భీష్మ ప్రతిజ్ఞ నొనర్చుమని శంతనుడు కుమారుని యడుగలేదు. ఆతనికిఁ దెలిసియుండినచో కుమారుని యీ భీషణ ప్రతిజ్ఞకు సమ్మతించి యుండెడివాడు గాడేమో! తండ్రి కెఱుక లేకయే కుమారుఁడా ప్రతిజ్ఞ నొనర్చెను. తన వివాహమునకై యింతటి ఘోర ప్రతిజ్ఞ నచ్చుకొని వచ్చునని శంతనుఁడూహింపలేదు. దాశరాజు శంతను నీ మాట యడిగినప్పుడే స్పష్టముగ "నాచేతఁ గాదని" వాక్రుచ్చెను. శంతనుఁడు ద్వితీయ వివాహము నెందులకు గోరెను? ఈ ప్రశ్న కుత్తర మిచ్చుట చాల కష్టము. ప్రేమ నొసఁగవలసిన వెల యెట్టిదైనను యిట్టి సంఘటనలు లోకమందలి సర్వ సమాజము లందును జరగినవి, జరుగుచున్నవియు. ఏకపత్ని వ్రతము గొప్పదే! దాని నొక్కఁడు బరిపాలించినచో అతఁడు విశిష్టమైన సద్గుణములు గలవాడు. కాని రెండవ వివాహ మాడినంత మాత్రమున వానిని నీతిలేని

వాఁడని నిందించుటకు వీలులేదు. ఏ సమాజశాస్త్రమును దీనిని నిందింపలేదు. కొన్ని సందర్భములలో రెండవ వివాహమును ధర్మశాస్త్రము లంగీకరించినవి. సమాజశాస్త్రము సమ్మతించినది. నీతి శాస్త్రము గర్హింపలేదు. ఇంకను గొంత తీక్ష్ణముగ నాలోచించినచో సామాజిక సువ్యవస్థకు యిది యావశ్యకము గూడ! గంగాదేవి దన్ను శాశ్వతముగ వదలిపోయినది. ఆమె మరల లభించునను నాశ శంతనునకు లేదు. అప్పుడాతఁడు ద్వితీయ వివాహమునకై యుద్యుక్తుఁగుడటలో దోషమేమున్నది? ఈ నాటికిని దాము గొప్ప నాయకులమని విఱ్ఱవీగుచున్న వారెందఱో యిట్టి పనులను జేయుచున్నారు.

అట్టిచో నైదువేల సంవత్సరముల క్రిందట నాటి సామాజిక నీతి శాస్త్రముల నియమముల ప్రకారము దోషముగాని రెండవ వివాహ మొనర్చికొనుటకై శంతనుడంగీకరించుటలో దోషమేమి? అందుకై యాతని నేలఁ దిట్టిపోయ వలయునో నా కర్థముగాదు. రామచంద్రుఁడేకపత్నీ వ్రతుఁడు. అతని వందఱు గౌరవింతురు. విశిష్టగుణుఁ డందురు. కాని, యిది యొకటే యాదర్శము గాదు. వేఱొక్క వ్యక్తి రాముని వలె లేకున్నచో నాతఁడెంత గొప్పవాఁడైనను వానిని నిందించుట మన యవివేకమే గాని వేఱుగాదు. శంతనుడు సంపాదించికొన్న యితర గుణము లెన్నియో యున్నవి. అతఁడు రామునకు వచ్చిన కీర్తితవకు రావలెనని యాశించలేదు గూడ. సత్యవతిని వివాహమాడునప్పటికి శంతనుడు వలీపలితుడు గాడు. కొందఱు విమర్శకు లన్నట్లు గళితగాత్రుఁడు, ముదుసలియు గాదు. సత్యవతి కేవలము బాలయు గాదు. మఱి వా రిరువురును వివాహ మొనర్చికొనుటలో వీరి యాక్షేపణ మేమి? రెండవ వివాహమునకై భీష్మని యధికారము శాంతనుడు బలవంతముగ లాగికొని యున్నచో నాతడు దోషియే! తన వివాహమునకై యట్టి ప్రతిజ్ఞ నొనర్పుమని యాతఁడు గోరలేదు. తెలిసి మౌనము వహింపలేదు. భీష్ముఁడు ప్రశ్నించినపుడు దనకింకను గొంతమంది సంతానము గావలెనని మాత్రమే

శంతనుడు వచించెను. కనుక శంతనుని రెండవ వివాహము వైయక్తికముగ దోషమని చెప్పుటకు వీలులేదు. నాటి సామాజిక శాస్త్రము గూడ దాని నాక్షేపింపలేదు.

## భీష్మని భూమిక

భీష్ముఁడొక యలౌకిక మహాపురుషుడు. స్వార్థము లేశము గూడ నాతని కంటలేదు. రాజ్యలోభము సామాన్యవ్యక్తిని లోఁబఱచి కొనుటలో నసాధ్యము లేదు. కాని భీష్మునివంటి వాని హృదయము నది లోబఱచికొనఁ జాలునా? శ్రీరామచంద్రు డిట్లే రాజ్యమును ద్యజించెను. భీష్ముఁడును రామచంద్రునే యనుసరించినాడు. వారిర్వురకు నీ త్యాగము కేవల నైసర్గికముగ నేర్పడినది. ఈ పని యొనర్చుటలో మే మొక గొప్ప త్యాగ మొనర్చుచున్నామన్న భావన వారికి దట్టనేలేదు. ప్రతిజ్ఞ యొనర్చుటలో గాంగేయు నాకర్షించిన సమస్య యొక్కటి. తన తండ్రి సుఖము. సామాజిక దృష్టితో నీ ప్రతిజ్ఞ యలౌకికమే గావచ్చును. కాని భీష్ముఁడు వైయక్తికమైన ధర్మమునే యెక్కువ గమనించెను. పైగా రాజ్యమును దనుగాని, దన తమ్ముడు గాని పరిపాలించుటలో నాతని కేమియు భేదము గన్పడలేదు. శ్రీరాముడు గూడ భరతుని పాలనమును సమ్మతించెను. తన తమ్ముఁడల్పాయుష్కుడై మరణించునని భీష్ముఁడూహింపలేదు. అటు తరువాత దమ్ముని వంశమువఁ గలుగబోవు భయంకర సంగ్రామ విషయము నాతఁడె ట్లభ్యూహింపఁ గల్గును? తండ్రికొఱకై భీష్ముడు సామ్రాజ్యమును పరిత్యజించుటలో భారతీయ సాంస్కృతికమైన గొప్ప యాదర్శము సఫలీకృతమైనది. సంపత్తియే సంసారమునకు ధ్యేయముగ జన్మకు దారాపుత్రులపై మోహమే పరమార్థముగా భావించు సామాన్య హృదయములకు గాంగేయుని త్యాగములోని మాహాత్మ్యము గల్పనకుఁగూడ నందదు. కాని యీ ప్రతిజ్ఞతో నొక్క క్రొత్త బంధము భీష్మునకు దగుల్కొన్నది, రాజ్యమును బరిత్యజించిన యాతఁడు

యంతటితో జేతులు గడిగికొని యుండిన బాగుండెడిది. కాని యాతడు "స నో రాజా భవిష్యతి" యని ప్రతిజ్ఞ యొనర్చెను. "అతఁడు మాకు రాజై పరిపాలించుగాక!" యని దాని భావము. ఈ మాటతో కౌరవరాజ్యములో దానొక సామాన్య పౌరుఁడుగ నుండి కొలుతునన్న జవాబ్దారీని నెత్తిన వేసికొన్నాఁడు. ఆ పనినే యాతఁడు కౌరవసభలో మంత్రిగనుండి నెఱవేర్చెను. నైతిక దృష్టితో నాతని త్యాగము గొప్పది. కాని ఘటనాత్మక దృష్టితో భీష్ముడు గౌరవ రాజ్యమున నొక సామాన్య పౌరుడుగ మిగిలెను. రాజ్యము నాతఁడు నియమింపక నియమింపఁబడు వారిలో నొక్కడైనాడు. భీష్మునిపై శతవిధముల నభాండముల నెత్తు మహానీయు లీ విషయములను జ్ఞాపకముంచికొని యాతని విమర్శించిన బాగుండును.

## భీష్ముని సత్యసంధత : విధిదురాగతము

సత్యవతిని దన తల్లిగ భావించి భీష్ముఁడామెను దన ప్రాసాదమునకుఁ గొనివచ్చెను. అంతే! నాటినుండి యాతడామెకు వినమ్రుఁడుగనే యాజ్ఞాంకితుఁడుగనే మెలగెను. కౌటుంబిక విషయముగాని, రాచకార్యము గాని, సత్యవతికి దెల్పక భీష్ముఁడొనర్పలేదు. ఆమె సమ్మతి లేనిది యాచరింపలేదు. అందుకే వ్యాసుఁడాతని గూర్చి "సత్యావత్యా మతే స్థితః" యని పలికెను. తాను పరశురాముని పైకి యుద్ధమునకు వెళ్ళునప్పుడు గూడ ముందుగ సత్యవతికి నివేదించియే భీష్ముఁడు వెళ్ళెను. మాతృభక్తుడైన భీష్ముఁడు కురురాజ్య సంరక్షకుఁడు. సేవకుడు. ఇంతలో విధి తన దుర్విలసితముల నారంభించినది. సత్యవతి కిర్వురు కొడుకులు గదా! వారిలోఁ జిత్రాంగదుడమిత పరాక్రమవంతుఁడు. రణలంపటుఁడు. శంతనుని యనంతరము భీష్ముడు జిత్రాంగదుని సింహాసనముపై నెక్కించెను. కాని కొన్నాళ్ళకే వాఁడు గంధర్వులతో యుద్ధము పెట్టికొని పోరి మరణించినాఁడు. భీష్మునకే వియోగము

భరింపరానిదైనది. కాని యేమి సేయును. ఇక మిగిలిన తమ్ముఁడు విచిత్రవీర్యుఁడు. వాఁడు బాలుఁడు .భీష్ముఁడాతనినే గద్దె పై నెక్కించెను ఆతనికి బదులు తాను సంరక్షకుఁడుగ నుండి రాజ్యకార్యముల నడపుచుండెను. విచిత్రవీర్యుఁడు భీష్ముని యదుపులో నుండి పరంపరా ప్రాప్తమైన రాజ్యము ననుభవింప మొదలు పెట్టినాఁడు. ధర్మశాస్త్ర కుశలుఁడైన గాంగేయుఁడు గౌరవ రాజ్యమునఁ గృతయుగ నిర్మాణ మొనర్చెను. మహోత్సాహముతో నాతఁడు విచిత్రవీర్యునకు వివాహ మొనర్చినాఁడు. కాశీరాజ బిడ్డలయిన యంబికా యంబాలికలను గొనితెచ్చి దమ్మునకు వివాహ మొనర్చెను. ఇంతటితో దన చింతలు తొలుగునని భీష్ముఁడు దలంచినాఁడు. కాని సంసారమును వదలి నిలిచిన భీష్మునిపైఁ బ్రపంచసంసారమే బడినది. ఇదియే యాతనికి విధి యేర్పరచిన జీవనము. తరువాతి కథ యిట్లు నడచెను.

"అంబి కాంబాలికే భార్యే ప్రాదాత్ భ్రాత్రే యవీయసే

...... ....... ..........

ఋత్విగ్భి స్సహితో భీష్మః సర్వై శ్చ కురుపుంగవైః !

(భా. ఆది. ప. అ. 102)

"కాశీరాజ దుహిత లతిలోకసుందరులు. విచిత్రవీర్యుఁడు తరుణవయస్కుఁడు, రూపయౌవన దర్పితుఁడు. ఆ వధువులు నీల కుంచిత కుంతలలు. రక్తతుంగనఖోపేతలు. పీనశ్రోణిపయోధరలు. అనురూపుఁడైన వరుఁడుదొరకినందులకు వారికి గలిగిన యానందమునకు మితిలేదు. ఆ ముగ్గురి విహారము లతిరేకములై జెలంగెను. దేవతుల్య పరాక్రముఁడు నారీచిత్త ప్రమథనుఁడైన విచిత్రవీర్యుఁడు పగలురాత్రు లెఱుఁగఁడు. వాని కంతఃపురమే నివాసమైనది. ఏడేండిట్లు గడచెను. అధికకామముచే వానికి క్షయరోగము సంక్రమించినది. వైద్యులెన్నియో వైద్యము లొనర్చిరి. అవి యన్నియు "చవుట విత్తిన విత్తనము" లైనవి. విచిత్ర వీర్యుడంతఃపురమును వలెనే యమసదనము

నలంకరించెను. భీష్మునకు మఱలఁ జింత యారంభమైనది. కౌరవవంశ మంతరించిపోవు స్థితి యేర్పడినది. కౌరవులలో నిఁక మిగిలిన వాఁడు భీష్ముఁడే! అతఁడు దప్ప సింహాసనమున కుత్తరాధికారి లేఁడు.

## భీష్ముని సత్యసంధత

భీష్ముఁడు రాజ్యాధికారమును వదలి బ్రహ్మచర్యమును స్వీకరించినాఁడు గదా! మరి వంశము నిలచుటెట్లు? ఆరిపోవుచున్న వంశమును నిలుపుటకు గృహస్థాశ్రమమును స్వీకరింపు మని సత్యవతి గాంగేయుని దీనముగ యాచించినది. ప్రజలు గూడ సింహాసన మెక్కి తమ్ము పరిపాలింపవలసినదని ప్రార్థించిరి. ఒక వైపు ప్రతిజ్ఞ, మఱియొక వైపు గర్తవ్యము. భీష్ముని పాలికి రెండు గండక త్తెరలైనవి. పైకథభారతమున నిట్లున్నది.

వైశంపాయన ఉవాచ:

తత స్సత్యవతీ దీనా కృపణా పుత్రగృద్ధినీ

........ ...... .....

ఆపద్ధర్మార్థకుశలై: లోకతంత్ర మవేక్ష్యచ!

(భా. ఆది. అ. 103)

పుత్రవత్సల యైన సత్యవతి కోడండ్రతోఁ గూడి పుత్త్రుల కౌర్ధ్వదైహికముల నిర్వర్తించినది. ఆమె కోడండ్ర నూరార్చి సర్వశ్రేష్ఠున కిట్లన్నది. "గాంగేయా! ధర్మనిత్యుఁడైన శంతనుఁడు దన సంతానమునకు రక్షకుఁడుగ నిన్ను నియమించెను. ఆ రెండు సంతానములను, బండియు పొల్లుపోయినవి. వేదవేదాంగములను, ధర్మములను నీ వలె నెఱిఁగినవారు లేరు. నీ బుద్ధియందు శుక్ర బృహస్పతుల రెండు యంశములును గలవు. నా మాట వినుము. నీ తమ్ముఁడైన విచిత్రవీర్యుఁడపుత్రకుఁడై గతించెను. వాని భార్యలు రూపయౌవన సంపన్నలై పుత్రకుల నపేక్షించుచున్నవారు. మన్ని యోగమున నీవు వారియందు సంతానమున బడయుము. సింహాసనము నెక్కి ప్రజలఁబాలింపుము. వివాహ మొనర్చికొనుమ

పితృవంశమును నిలుపుము." ఈ మాటలకు భీష్ముఁడిట్లు జవాబు చెప్పెను. "మాతా! నా ప్రతిజ్ఞ నీ వెఱుఁగుదువు. నీ వివాహ సమయమున నా ప్రతిజ్ఞ నీకు శుల్కమయ్యెను. త్రైలోక్య రాజ్యమును విడుతును. అంతకన్నను గొప్ప పురుషార్థము నైనను విడుతును. సత్యమును మాత్రము వదలలేను. పృథివి గంధమును ద్యజింపవచ్చును. నీరు రసగుణమును విడువవచ్చును. జ్యోతిర్వాయువులు రూప. స్పర్శ గుణములనుండి విడివడ వచ్చును. శబ్దగుణకమైన యాకాశము శబ్దగుణమును, శీతాంశుఁడు జల్లదనమును వదలవచ్చును. వృత్రహుఁడైన దేవేంద్రుఁడు విక్రమమును. ధర్మరాజు ధర్మమును వదలవచ్చు గాని భీష్ముఁడు మాత్రము సత్యమును వదలలేఁడు." భీష్ముఁడాడిన యీ మాటలకు సత్యవతికి నోరాడలేదు. ఆమె కొంత సంబాళించికొని యిట్లు వాక్రుచ్చినది. "శాంతనవా! నీ యౌదార్యమును నే నెఱుఁగుదును. సత్యవ్రతుఁడవైన నీ నిష్ఠ నాకు దెలియనిది గాదు. స్వతేజస్సుతో మూగు లోకములను బొలియించి వెలయింపగలవాడవు నీవు. కాని నే నిప్పుడు నీకు జెప్పినది యాపద్ధర్మము. ఇపుడు నీ వూరకున్నచో గౌరవ వంశమే యంతరించును. పితరులను క్షోభపెట్టుట యుక్తముగాదు గదా! భీష్మడన్నారు మాతా! నీమీటలు ధర్మయుక్తములు. కాని క్షత్రియునకు సర్వధర్మములకన్నను సత్యముత్తమము. శంతనుని వంశము నశింపక, నా ప్రతిజ్ఞ దప్పక యుండు మూడవ మార్గమును నీకు నివేదించుచున్నాను. నే వచింపబోవు ధర్మము సనాతనమైనది. ఇంతకుముందున్న క్షత్రియ లనుసరించినది. ధర్మవిదులైన పురోహితులతో యాలోచించి యా మార్గము ననుసరింపుము. అది యాపద్ధర్మము. లోకతంత్రమున కనురూపమైనది."

తరువాతి కథ యుద్యోగ పర్వమున వచ్చును. భీష్ముఁడే కౌరవ సభలో దరువాతి వృత్తాంతమును దెల్పినాఁడు. అదియిట్లు:

"స్వర్యాతేzహం పితరి తం స్వరాజ్యే సన్యవేశయం

....... ........... ..........

ఏవం తా మనునీయాహం మాతరం జనమేవచ!

(భా. ఉ. ప. అ. 147)

"చిత్రాంగదుని యనంతరము విచిత్రవీర్యుని గద్దియపై నిలిపి నేను భృత్యుఁడనై రాజకార్యముల నిర్వర్తించితిని. అతనికి నేనే వివాహ మొనర్చితిని. పిదపఁబరశురామునితో నాకు యుద్ధము సంఘటిల్లెను. నేను యుద్ధమున మునిగియుండుటచే రాజకార్యములఁ జూచి కొన లేకపోతిని. ప్రజలు హస్తినాపురమును వదలిపోయిరి. విచిత్ర వీర్యుఁడు కామపరవశుడై, క్షయరోగమునకుఁ జిక్కి గతించెను. రాజ్యమున నరాజకత్వ మేర్పడినది. అది క్షామమునకు దారితీసినది. అప్పుడు సమస్త ప్రజలును నేనే వారి కాధారమని నమ్మి నాతో మొఱవెట్టికొనిరి. నేను రాజునై వారి దుఃఖములఁ దొలఁగింపవలెనని ప్రార్థించిరి. "ఓ శంతను కులవర్దనా! దారుణ వ్యాధులు వ్యాపించినవి. ప్రజలు వానిచే నానా యాతనలు బడుచున్నారు. మమ్ము సంరక్షించుట నీ కర్తవ్యము. మా సర్వదుఃఖముల నివారించి ధర్మశాస్త్రానుసారము మమ్ముఁ బాలింపుము. నీవు జీవించి యుండగనే యీ రాష్ట్ర వినాశమగుట మంచిదిగాదు" అని విన్నవించిరి. కాని వారి యాక్రోశము నా ప్రతిజ్ఞనుండి నన్ను మరలింపఁజాలకపోయినది. శీలవంతుఁడైన క్షత్రియుఁడు తన ప్రతిజ్ఞ నుండి చలింపరాదుగదా! భృత్యులు, పురోహితులు, ఆచార్యులు,బహుశ్రుతులైన బ్రాహ్మణులు, మా తల్లి సత్యవతీదేవి ఒక్కరేమి సమస్త జనులను పదింబదిగ నన్ను రాజ్య స్వీకారమున కై యొత్తిడి చేసిరి. మా తల్లికి నమస్కార మొనర్చి నేను "తల్లీ! న తండ్రికొఱ కీ బ్రహ్మచర్యము నవలంబించితిని. ఎట్టి పరిస్థితిలో నైనను దీనిని నే వదలుటకు వీలులేదు. తల్లిదండ్రులను దైవములుగ భావించు కులమున నేన జన్మించితిని. శంతనుని వంటి తండ్రికి నేను ద్రోహ మొనర్పలేను. ; సత్యవ్రతమును వదలలేను." అని వినయముతో బలికితిని.

భీష్ముని సత్యసంధత యిట్టి యగ్ని పరీక్షలకు దాళి నిలిచినది. ఈ

ప్రతిజ్ఞ వలననే సింహాసనారూఢుఁడై రాజ్యమును బాలింపవలసిన యాతఁడు భృత్యపదవిని స్వీకరించెను. తాను భృత్యుఁ డగుటచే వయోవృద్ధుఁడైనను అతనికి రాజకీయములలో దీర్పు చెప్పు నధికారము లేకపోయినది. అతని జీవితములో వివాదగ్రస్త విషయముల నాలోచించుటకు ముందు మన మీ విషయమును జ్ఞాపక ముంచికొన వలయును.

## భీష్ముఁడు - పాండవులు

సత్యసంధుఁడైన భీష్ముఁడు తన ప్రతిజ్ఞను వదల నిష్టపడడయ్యె నంటిమి. అందుచే నతఁడా కాలమునందు బహుళప్రచారమున నున్న నియోగ పద్ధతి ననుసరించి కురువంశమును వృద్ధి నొందించుటకు నిశ్చయించెను. వేదవ్యాసులను బ్రార్థించెను. ఈ విషయమును తానే యుద్యోగపర్వమున నిట్లు చెప్పెను.

"అయాచం భ్రాతృదారేషు తదా వ్యాసం మహామునిం

....... ....... .......

....... ....... ........

త్రీన్సపుత్రా నజయత్తదా భరతసత్తమ !"

(మహాభార. ఉ. అద్యా. 147)

వంశక్షయమగు సమయములందు ఉత్తమ బ్రాహ్మణులతో పుత్రోత్పాదనము నందెడి యాచార మానాఁడు రూఢముగనుండెను. భీష్ముఁడీ పద్ధతినే యనుసరించెను. ధృతరాష్ట్ర. పాండురాజ, విదురులు జన్మించిరి. ధృతరాష్ట్రుఁడు పుట్టంధుడు అగుటచే రాజ్యమునకనర్హుఁడు. విదురుడు దాసీపుత్రుఁడు. కనుక రాజు గాలేఁడు. అందుచే పాండురాజు రాజ్యాధికారి గావలసివచ్చెను. భీష్ముఁడీ ముువ్వురకును విద్యాభ్యాసమున కేర్పాటు గావించినాఁడు. నీటితోఁ బద్మపత్రము వలె భీష్ముఁడు సంసారముతో నంటక మహావశియై కురువంశమును నడపినాఁడు. మహాభారతకారుఁడిట్లనెను.

"ధృతరాష్ట్రశ్చ పాండుశ్చ విదురశ్చ మహామతిః

.......

...... ...... ......

వేద వేదాంగతత్త్వజ్ఞాః సర్వత్ర కృతనిశ్చయాః"

(భారత. ఆదిప. అధ్యా. 109)

ధృతరాష్ట్ర పాండు విదురులను చిన్నతనమునుండి భీష్ముఁడు పుత్రప్రేమతోఁ బెంచెను. కావలసిన సంస్కారము లొనర్చెను. వ్యాయామాది విద్యల నేర్పించెను. ధనుర్వేదాది యుద్ధకళానిపుణులఁగావించెను. ఇతిహాస పురాణాదుల నేర్పించెను. నీతిశాస్త్రపారంగతుల జేసెను. యోగ్యరీతిని వివాహముల నొనర్చెను. ఈ ముప్పురిలో పాండురాజు మహాపరాక్రమి యైనాఁడు. అతఁడు దిగ్విజయమొనర్చి సామ్రాజ్యమును విస్తరింపజేసెను. భీష్మన కాతనియం దెంతయో ప్రేమ. ఒకసారి పాండురాజు ధృతరాష్ట్రునకు రాజ్య మొప్పించి తాను మృగయాసక్తుఁడై హిమాలయముల కేగెను అతడడవిలో నున్నప్పుడు ధృతరాష్ట్రుఁడే రాజు. అతని రాజ్య మెట్లుండెనో వ్యాసభగవానుఁడిట్లు వర్ణించినాఁడు.

"తత స్సర్వాః ప్రజా స్తాత! ధృతరాష్ట్రం జనేశ్వరం

...... ...... ......

...... ...... ......

అన్వాస్యమాన స్సతతం విదురేణ మహాత్మ!

(భారత. ఉద్యో. అధ్యా. 148)

పాండురాజును వలెనే ప్రజలు ధృతరాష్ట్రుని మన్నించిరి. విదురుఁడ విధేయుఁడై యుండెను. అతఁడే ప్రధాన కార్యసంచాలకుడుగ గూడ నుండినాడు. సంధి విగ్రహాదులు, పరరాష్ట్రముల తోడి వ్యవహారములు మొదలగు కార్యముల భీష్ముని పాలబడినవి. అనగా ధృతరాష్ట్రుఁడు రాజైనపుడు విదురుఁడు మంత్రి భీష్మాచార్యుఁడు రాజ్యాంగములోని కేవల మొక యంశమునకు మాత్రమే యధికారి

సింహాసనమునందు రాజును గూర్చుండబెట్టునంత వఱకే యాతని యధికారము. అటుపైని యాతఁడొక భృత్యమాత్రుఁడుగనే వ్యవహరించుచుండెను. విచిత్రవీర్యుని కాలమున రాజకీయములలో దన చొఱవ కొంత యెక్కువగనే యుండెను. కాని, పాండురాజు కాలమున విదురుని సామర్థ్యమును గమనించిన భీష్ముడు సర్వకార్యముల నాతని కొప్పించి తాను ప్రక్కకు తప్పుకొన్నాఁడు. పరరాష్ట్రములతో వ్యవహరింపవలసిన విషయములలో మాత్రమే తాను చేయి గలిగించి కొనుచుండెను. ఇంతలో పాండురాజు గతించినాడు. మాద్రిసహగమునము చేసెను. కుంతి యైదుగురు కుమారులతో హస్తినాపురము చేరినది. పాండురాజు మృతికి భీష్మాదు లెంతయో దుఃఖించిరి, పాండురాజు మరణానంతరము ఆతఁడొనర్చిన రాజ్యవ్యవస్థలో నే మార్పును రాలేదు. యుధిష్ఠిరుఁడెదిగి పెద్దవాఁడై తన పిత్రీయమగు రాజ్యమునకు వారసుఁడుగ బరిగణింపబడు వఱకును యే మార్పును దెచ్చుట కవసరము గూడ నుండలేదు. ధృతరాష్ట్రుని నూటేసి కొడుకులు, పాండవులు కృపాచార్యుల కడ విద్య నభ్యసించుచుండిరి. వారెప్పుడెప్పుడెట్లెట్లు నేర్చుకొనుచుండిరో భీష్మాచార్యులు పర్యవేక్షించుచుండిరి. మహాభారతమున నీ విషయ మిట్లు గలదు.

"విశేషార్థీ తతో భీష్మః పౌత్రాణాం వినయేప్సయా

....... ........ .......

...... ...... .........

బభూవుః కౌరవా రాజన్ పాండవా శ్చామితౌజసః

(భారత. ఆది, 130)

తన పౌత్రు లందరును విద్యలలో నిస్సీములు కావలెనన్న తలపుతో నాతఁడు ధనుర్వేద విశారదులై పరాక్రమవంతులైన యాచార్యుల కొరకు వెదుక నారంభించినాఁడు. కౌరవ రాజకుమారుల నెదిరించువాడు ప్రపంచమున నుండరాదని భీష్ముని యాశ. అతడు భారద్వాజ ద్రోణుని కడ నీ కుమారులను శిష్యులుగాఁ జేర్చెను. అతడు ద్రోణాచార్యులను యథాశాస్త్రముగ సర్వోత్తమముగఁ

బూజించినాడు. ద్రోణుఁడు సంతుష్టుఁడై విద్యాశిక్షణమునకు గడంగెను. తత్ఫలముగ కౌరవ పాండవు లిర్వురును ధనుర్విద్యలలో నిష్ణాతులైరి.

ఇంతలో యుధిష్ఠిరునకు యౌవరాజ్యాభిషేక మొనర్పవలసిన సమయము వచ్చినది. అంతవరకు కౌరవ పాండవులు కలసికట్టుగనే యుండిరి. ఇంతలో భీమునిపై విషప్రయోగము జరిగెను. విదురుని కోరికపై కుంతీదేవి దానిని గుప్తముగ నుంచినది. భీష్ముఁడు ఆ దురాగతము నప్పుడు పసికట్టలేదు. ధర్మరాజు యువరాజయ్యెను. విదురుఁడే సకల కార్యములను జూచికొనుచుండుటతో పాండవుల విషయమై ధృతరాష్ట్రుని మనస్సులో నే యాలోచనలు బారాడుచున్నవో భీష్ముఁడు గమనింపలేదు. విదురుఁడాతని చెవిలో వేయలేదుఁ. విదురుఁడు ధృతరాష్ట్రుని ముఖభంగిమలతోనే యాతనికి పాండవులపై గల యభిప్రాయమును కనిపెట్టి వారిని రక్షించెడి దృష్టితో ధర్మరాజునకు సూచన యొసగెను. ధర్మరాజుకు దప్ప నే వార్త మరెవ్వరికినిఁ దెలియదు. ధృతరాష్ట్రుని కార్యము లతి గూఢములై యుండెను. దుర్యోధనునకు రాజ్యమును దక్కించెడి యుహతో నాతఁడు భీష్మవిదురుల కన్నుగప్పి సమస్త సన్నాహము లొనర్చికొనుచుండెను.వారణావతమునకు బాండవుల దరలించెడి యత్నమును గుప్తముగనే జరిగెను. దుర్యోధనుఁడు పురోచనునితోఁ జేరి కావించిన యాలోచనములును ధృతరాష్ట్రునకు సవసవగా దెలిసినవనియే చెప్పవలెను. లాక్షాగృహ ప్రకరణానంతరము భీష్మలకీ సన్నాహము అర్థమైనవి. ఈ విషయమునతడాలోచించెను. తన తీవ్రమగు నసమ్మతి నాతఁడెఱుకపఱచినాఁడు. కులమున బుట్టిన యీ ముసలమును ఛేదించివేయు తలపుతో నాతడు రాజ్యమును రెండుగా విభాగించి ఒక భాగము కౌరవులకును మరియొకటి పాండవులకు నొసగెను. భీష్ముడిట్లన్నాడు.

"దిష్ట్యా ధ్రియంతే పార్థా హి దిష్ట్యా జీవంతి సా పృథా
...... ......"

....... ....... ...... ......

క్షేమం చ యది కర్తవ్యం తేషా మర్థం ప్రదీయతాం"

(మహాభా. ఆదిప. అధ్యా. 203)

"కుంతియును పాండవులును బ్రతికినది చాల యదృష్టము. పురోచనుని పాచిక పారలేదు. ఓ గాంధారీ పుత్రుఁడా! పాండవులు తల్లితో గూడ దగ్ధులైరన్న వృత్తాంతము విన్నప్పటినుండియు సిగ్గుతో లోకమునకు మొగము చూపలేకపోవుచున్నాను. లోకము పురోచను నెంతగా నిందించుచున్నదో నిన్ను గూడ నంతగా నిందించును. ఈ యపకీర్తి బోగొట్టుకొనుట కొక్కటే మార్గము. పాండవులను సమ్మతిపఱచుట. వారు మహావీరులు. వారి పిత్ర్యంశమును వారి కివ్వక దక్కించుకొనుటకు దేవేంద్రునకును గుండెలు లేవు. వారు వీరులే కాదు. ధార్మికులును. వారి న్యాయమును నీవే త్రోసిరాజంటివి. వారి కర్ధరాజ్య మిచ్చివేయుము. నాకును, లోకమునకును సంతోషమగును." భీష్ముల యభ్యర్థన మంగీకరింపబడెను. ధృతరాష్ట్రుఁడు ధర్మరాజాదులఁబిలిపించి యర్ధరాజ్యము నిచ్చెను. మహాభారతములో నిట్లున్నది.

"ప్రతిగృహ్యాతు తద్వాక్యం నృపం సర్వే ప్రణమ్యచ

....... ....... .....

....... ....... ......

నగరం మాపయామాసుః ద్వైపాయన పురోగమాః

(మహాభా. ఆదిప. అధ్యా. 207)

ధృతరాష్ట్రుఁడే ధర్మజునకు రాజ్యమునొప్పించి ఖాండవప్రస్థమున నుండుమని యానతిచ్చెను. దేవరాజ్యము నింద్రునివలె అర్జునుఁడు నిన్ను రక్షించుచుండగా నందు నీ కేమియు భయముండదని యాతని యుద్బోధ. ఈ రీతిగా కౌరవ పాండవులవి రెండు స్వతంత్ర రాజ్యములు. భీష్ములు హస్తినలోనే నిలిచిరి. ధృతరాష్ట్రుని రాజ్యాధికారమున నాతడొక సామంతుడు. పాండవుల రాజ్యమున

నాతఁడెవ్వడును గాడు. అతని కక్కడ గొప్ప ప్రతిష్ఠయు లేదు. పాండవులే సర్వసమర్థులు. వారికి భగవంతుడైన కృష్ణుఁడు మాన్యతముడు. మంత్రి. నెచ్చెలి. పాండవులు గూడ చీటికి మాటికి భీష్ములను సలహాలడిగినట్లు లేదు. సుభద్రాహరణ సమయమున గూడ నర్జునుఁడు యుధిష్ఠిరుని యభిప్రాయము నడిగెనే కాని భీష్ములను సమీపింపలేదు. రాజసూయమును గావించినప్పుడును ధృతరాష్ట్ర, భీష్ములతో సంప్రతించలేదు. వారు కృష్ణుని యనుమతి వేడిరి. తక్కిన రాజ్యములకు బంపినట్లే కౌరవులకు గూడ నాహ్వానమును బంపినారు. భీష్ముడు ధర్మజ్ఞుఁడన్న ప్రసిద్ధిని బట్టి ఆ యజ్ఞమున గృతాకృతముల నిర్ణయించుపని కై యుధిష్ఠిరుఁడు శాంతనవుని నియమించెను. పాండవులు భీష్ముల నెప్పుడును తమకు గర్తవ్యాకర్తవ్య బోధకులుగా నియమించుకొనలే దనుట స్పష్టము. వారికి సర్వస్వమును గృష్ణుడే యయ్యెను. అందుచే భీష్ముఁడు హస్తినలోనే రాజభృత్యుఁడుగా నుండవలసి వచ్చినది. ద్రౌపదీవస్త్రాపహరణ సందర్భమును గూడ నీ దృష్టితోనే జూడ వలయును.

## ద్రౌపదీ వస్త్రాపహరణము

ఈ సంఘటనకు జూదము బీజము; ఈ జూదము తమతమ భాగములు బంచికొన్న యిరువురు స్వతంత్ర రాజ్యాధిపతుల నడుమ నడచినది. ధృతరాష్ట్రుఁడు పాండవులను జూదమునకై నిమంత్రించెను. దీనిని భృత్యమాత్రుఁడైన భీష్ముఁడెట్లు నివారింపగలఁడు? ఆ యాహ్వానము నంగీకరించుటయో, త్రోసిపుచ్చుటయో, యుధిష్ఠిరునకు సంబంధించినది. అతనికి శకుని కపటి యని తెలియును. తెలిసియు ద్యూతమున కంగీకరించినాఁడు. అతఁడు తన సర్వస్వము వోడెను. పాండవులందరును దాసులైరి. ద్రౌపదిని గెలిచినట్లు ఘోషించెను. ఈ సందర్భమున భీష్మాదులకు, భయముతో చెమ్మటలు వోసినట్లు మహాభారతకారుఁడు వర్ణించినాఁడు.

"ఏవ ముక్తే తు వచనే ధర్మరాజేన ధీమతా

నాతఁడెవ్వడును గాడు. అతని కక్కడ గొప్ప ప్రతిష్ఠయు లేదు. పాండవులే సర్వసమర్థులు. వారికి భగవంతుడైన కృష్ణుఁడు మాన్యతముడు. మంత్రి. నెచ్చెలి. పాండవులు గూడ చీటికి మాటికి భీష్ములను సలహాలడిగినట్లు లేదు. సుభద్రాహరణ సమయమున గూడ నర్జునుఁడు యుధిష్ఠిరుని యభిప్రాయము నడిగెనే కాని భీష్ములను సమీపింపలేదు. రాజసూయమును గావించినప్పుడును ధృతరాష్ట్ర, భీష్ములతో సంప్రతించలేదు. వారు కృష్ణుని యనుమతి వేడిరి. తక్కిన రాజ్యములకు బంపినట్లే కౌరవులకు గూడ నాహ్వానమును బంపినారు. భీష్ముడు ధర్మజ్ఞుఁడన్న ప్రసిద్ధిని బట్టి ఆ యజ్ఞమున గృతాకృతముల నిర్ణయించుపని కై యుధిష్ఠిరుఁడు శాంతనవుని నియమించెను. పాండవులు భీష్ముల నెప్పుడును తమకు గర్తవ్యాకర్తవ్య భోధకులుగా నియమించుకొనలే దనుట స్పష్టము. వారికి సర్వస్వమును గృష్ణుడే యయ్యెను. అందుచే భీష్ముఁడు హస్తినలోనే రాజభృత్యుఁడుగా నుండవలసి వచ్చినది. ద్రౌపదీవస్త్రాపహరణ సందర్భమును గూడ నీ దృష్టితోనే జూడ వలయును.

## ద్రౌపదీ వస్త్రాపహరణము

ఈ సంఘటనకు జూదము బీజము; ఈ జూదము తమతమ భాగములు బంచికొన్న యిరువురు స్వతంత్ర రాజ్యాధిపతుల నడుమ నడచినది. ధృతరాష్ట్రుఁడు పాండవులను జూదమునకై నిమంత్రించెను. దీనిని భృత్యమాత్రుఁడైన భీష్ముఁడెట్లు నివారింపగలఁడు? ఆ యాహ్వానము నంగీకరించుటయో, త్రోసిపుచ్చుటయో, యుధిష్ఠిరునకు సంబంధించినది. అతనికి శకుని కపటి యని తెలియును. తెలిసియు ద్యూతమున కంగీకరించినాఁడు. అతఁడు దన సర్వస్వము నోడెను. పాండవులందరును దాసులైరి. ద్రౌపదిని గెలిచినట్లు ఘోషించెను. ఈ సందర్భమున భీష్మాదులకు, భయముతో చెమ్మటలు వోసినట్లు మహాభారతకారుఁడు వర్ణించినాఁడు.

"ఏవ ముక్తే తు వచనే ధర్మరాజేన ధీమతా

నంగీకరింపకు" మని భీష్ము లే మొగము వెట్టుకొని చెప్పుదురు? జూదమునందోడిపోవుటచే నీవు దాసి కాలేదు. కాని ధర్మరాజు కౌరవులకు దాసుఁడైనాఁడు. అతఁడు తప దాస్యము నంగీకరించెను. నీ కతఁడు పతి. ఈ సంబంధమును బట్టి మాత్రమే నీవు కౌరవులకు దాసివని భీష్ముఁడనెను. అనగా నీ ఘటన కంతయు కర్తృత్వము ధర్మరాజుదే యని భీష్మని యభిప్రాయము. ఇంతమాత్రమే గాదు. ధర్మజుని యీ ప్రవర్తన తనకు దుఃఖదాయకముగ నున్నదని గూడ నతఁడు తన మాటలలో ధ్వనింపజేసినాఁడు. లోభమోహ పరాయణులైన కౌరవులు, వినష్టులగుట తప్పదని యాతఁడు వల్కెను. ఆయన మాట లివి.

"న ధర్మ సౌక్ష్మా త్సుభగే వివేక్తుం
శక్నోమి తే ప్రశ్న మియం యథావత్
..... ..... .....
...... ...... .....
న మన్యతే తాం నికృతిం యుధిష్ఠిరః
తస్మా న్న తే ప్రశ్న మిమం బ్రవీమి.
(భార. సభా. అధ్యా. 67)

ఉక్తవానస్మి కల్యాణి ! ధర్మస్య పరమా గతిః
....... ...... ......
....... ...... .....
అజితాం వా జితాం వేతి స్వయం వ్యాహర్తు మర్హతి.
(భార. సభా. అధ్యా. 68)

"అమ్మా! ధర్మ మత్యంతసూక్ష్మమైనది. అగుటచే నీ ప్రశ్నకు స్పష్టముగా నుత్తర మొసఁగుటకు నాకు సాధ్యము గాలేదు. యుధిష్ఠిరుఁడు దొలత తన్నోడెను. తరువాత నిన్నొడ్డెను. అప్పుడు నీపై యాతనికి స్వామిత్వము లేదు. ఈ దృష్టితో నీ వాతనికి దాసివి గావు. కాని, నీ వాతని పత్నివి. పతికి పత్ని సర్వరీతుల నధీన. ఈ దృష్టితో నతఁడు దాసుఁడైనప్పుడే నీవును దాసివైనావు. యుధిష్ఠిరుఁడు నిజముగా

దాసుఁడా, కాదా యన్న ప్రశ్న మాకు సంబంధించినది గాదు. అతఁడు మహాధర్మనిష్ఠుఁడు. సమస్త భూమండలము నైనను ధర్మరక్షణకై వదలుటకు జంకువాఁడు గాఁడు. అతఁడే స్వయముగ నేను జితుఁడ నైనానని యొప్పికొన్నాఁడు. పతి యే యవస్థలోనుండునో సతికి గూడ నదే యవస్థగనుక, యీ ప్రశ్న కుత్తరమిచ్చుటకు నాకు శక్తి లేదు. శకుని ద్యూతక్రీడలో నద్వితీయుఁడు. ఈ సత్యమును ధర్మజుఁ డెఱుఁగును. ఎఱిఁగియు జూదమాడుట కంగీకరించెను. అంతమాత్రమే గాదు. శకుని మాయతో గెలిచెను. కనుక, ధర్మజుఁడు దాసుఁడు గాలేదు: కాని, ఈ విషయమును ధర్మరాజంగీకరించుటలేదు. ఆతఁడే నేను జితుఁడనైతినని యొప్పికొను చున్నాఁడు. అట్టిచో నాతని ధర్మపత్ని విషయమై నే నేమని చెప్పగలను? కల్యాణీ! ధర్మగతి యత్యంత సూక్ష్మమైనది. లోకము పలుమారీ నిర్ణయమున మోహిత మగుచుండును. ఒక్కొక్క సారి బలవంతులకు లోఁబడి ధర్మమే వైకల్యము నందుచున్నది. ఇట్టి పరిస్థితులలో "ధర్మమిదియే" నని నిర్ణయించి తేల్చుట చాల కష్టము. ఒకటి మాత్రము నిజము. లోభమోహావిష్టులైన కౌరవులకు నాశము తప్పదు. నీ వెవ్వరి పత్నివో, వారు సుఖవంతులగుదురు. భయంకర పరిస్థితి యందును వారు ధర్మమునుండి విచలితు లగుటలేదు. పాంచాలీ! నీవును వారివలెనే విలక్షణపరిస్థితిలో నున్నావు. ఉండియు, "నేను దాసినా, కానా" యని ప్రశ్నించుచున్నావు. అత్యంతక్లిష్టమగు పరిస్థితిలో నుండియు, ధర్మమార్గమునే యనుసరింప జూచుట నీ యుదాత్తతనే జూపుచున్నది. ద్రోణాదు లీ సభలో తన్యము లేక చూచుచున్నారు. వారు నీ ప్రశ్న కేమియు సమాధాన మివ్వలేదు. నికి సమాధాన మొసగుటకు యుధిష్ఠిరుఁడొక్కఁడే సమర్థుఁడు." తనకున్న ఎధికారముతో నెంత చెప్పవచ్చునో భీష్ముఁడంతియే చెప్పెను. ద్రోపదిది ధర్మదృష్టి తఁడు గూడ ధర్మదృష్టితోనే యుత్తర మొసంగెను. ద్రౌపదిని భీష్ముఁడు క్షంపవలసిన యావశ్యకత లేదు. ఆమె పతులే యందుకు సమర్థులు. వారు శకుని

కాపట్యమును గుర్తింపనేరక తాము దాసులని యంగీకరించిరి. వారి పతిత్వమును ద్రౌపది యంగీకరించుచున్నది. మరియీ విషయమున నితరులేమి చెప్పఁగలరు? దుర్యోధన పక్షీయులలో వరిష్ఠుడైన ధృతరాష్ట్రుఁడు మాత్రమే యీ యాపదను నివారింపవలసిన వాఁడు. భీష్ముని యధికారము దుర్యోధనునకు సమ్మతము గాదు, ద్రౌపదీ వివాహానంతరము కౌరవుల సభలో పాండవుల ప్రస్తావన వచ్చినది. అప్పుడు కర్ణుఁడు "నీవు మా రాజుకడ భృత్యుఁడ" వని భీష్ములను నిందించెను. అవమానించెను. దానికి దుర్యోధనుడు సమ్మతించి యూరకుండెను. భీష్ముఁడిక దన పెద్దఱికము చెల్లదనుకున్నాఁడు. తా నొనర్చిన ప్రతిజ్ఞకు మాత్రము కట్టుబడి బ్రదుకుచుండెను. అందుచే నతఁడెందునను, నెక్కువ జోక్యము గల్పించికొనుట లేదు. భీష్ముల యీ యౌదాసీన్యము సమాజకల్యాణ దృష్టితో, నీతిసంరక్షణా దృష్టితో నయోగ్యము కాదా! యనవచ్చును. ఆతని జీవితధ్యేయము సత్యసంధత యొక్కటే. సమాజకల్యాణము వంటి బాధ్యత నాతఁడు నెత్తిపైవేసికొనలేదు. "స నో రాజా భవిష్యతి" అనెడి ధర్మమునుమాత్రమే యాతఁ డనుసరించినది. అతనికి గేవల మయిష్టమయిన సన్నివేశములలో సభను విడిచిపోయెడి వాఁడు. అంతగాక మఱియేమి సేయును? ఆదుష్కార్యమును నిలుపుటకుఁ దనకధికారము లేదు. ఆ పని తనకు సమ్మతము గాదు. భారతమునందే యిట్లున్నది.

"ప్రాతిష్ఠత తతో భీష్మో ద్రోణేన సహ సంజయ!
కృపశ్చ సోమదత్తశ్చ బాహ్లీకశ్చ మహామనాః
(సభా. ప, అధ్యా. 81)

భీష్ముని వెంటనే సోమదత్తాదులు గూడ వెళ్ళిపోయిరి. రెండవ సారి జూదమాడుటకు దుర్యోధనుఁ డుద్యోగించినపుడు ఆక్షేపించిన వారిలో భీష్ముఁడు గూడ నున్నాఁడు. ఆ సన్నివేశ మిది.

"తతో ద్రోణ స్సోమదత్తో బాహ్లీకాశ్చైవ గౌతమః

....... ........ .......

....... ........ .......

అకరోత్పాండవాహ్వానం ధృతరాష్ట్ర స్సుతప్రియః

(సభా. అధ్యా 74)

అనంతరము, ద్రోణ, సోమదత్త, బాహ్లీక, కృపాచార్య, విదుర, అశ్వత్థామాదులు, భీష్ముఁడు, ద్యూతము వలదని నివారించిరి. ఇంత మంది యసమ్మతి ప్రకటించినను ధృతరాష్ట్రుఁడు పాండవులను బిలిపించినాఁడు; భీష్ముఁడు ధర్మవిరుద్ధముగ బ్రవర్తించిన దెన్నఁడును లేదు. ఆ కార్యములకు దోడ్పడిన దెన్నఁడును లేదు. పాండవులు వనవాసమును ముగించిన తర్వాత దుర్యోధనుని సచివమండలి, కాలము పూర్తిగాకముందే పాండవు లగుపడిరన్న వాదమును లేవదీసిరి. అప్పుడు భీష్ములు స్పష్టముగ కాలపరిమితి గడచిపోయిన దనియు, పాండవులెప్పుడును ధర్మపథము నుండి దప్పరనియు, వారికిఁ బాలొసగుట న్యాయమనియు నొక్కిచెప్పెను. యోగ్యమగు నిర్ణయమును గైకొన వలసిన దని ధృతరాష్ట్రునితో ఘంటాఘోషముగ వచించినాఁడు. దుర్యోధనుఁడు సంధి కంగీకరింపలేదు. ఇక భీష్ముఁ డేమి సేయును? ఆతఁడు రాజభృత్యుఁడుగ సేనావ్యూహరచనకు దొఱకొన్నాఁడు. అప్పుడు గూడ నతడు దుర్యోధనునకు హిత ముపదేశింపక పోలేదు. భారతమున నిట్లు గలదు.

"సర్వం యథావ చ్చరితం యద్య దేభిః ప్రతిశ్రుతం

...... ........ ......

....... ........ ......

క్రియతా మాశు రాజేంద్ర! సంప్రాప్తశ్చ ధనంజయః

దుర్యోధన ఉవాచ:-

నాహం రాజ్యం ప్రదాస్యామి పాండవానాం పితామహ!
యుద్ధోపచారికం యత్తు తచ్ఛీఘ్రం ప్రవిధీయతాం

భీష్మ ఉవాచ:-
అత్ర యా మామకా బుద్ధి: శ్రూయతాం యది రోచతే
సర్వధా హి మయా శ్రేయో వక్తవ్యం కురునందన!
(విరా. ప. అధ్యాజ 52)

"పాండవులు ప్రతిజ్ఞాప్రకారము అజ్ఞాతవాసమును నెఱవేర్చిరి. అందుకే కవ్వడి తన్ను దాను పొడసూపికొన్నాఁడు. పాండవులు, లోక వ్యవహారములందును ధర్మ వ్యవహారములందును సమర్థులు, ధర్మజుఁ డెవ్వరికి నృపాలుఁడో వారెన్నడైనను ధర్మ విషయమున పొరపడుదురా! వారెన్నడును లోభులు గాదు. దుష్కరకర్మములనైన నశ్రమమున సాధింతురు. ఇంతకుముందు సాధించియే యున్నారు. అధర్మమున రాజ్యమును గొనుటకు వారంగీకరింపరు. కేవల పరాక్రమముచేతనే రాజ్యము గొనుట వారి కిష్టమైనచో వారాపని నింతకుముందే యొనర్చియుండెడివారు. పాండవులు ధర్మపాశబంధితు లగుటవలననే సత్యమునకు గట్టువడి యింతవఱకును నిలచిరి. సత్యరక్షణకై వారు మరణమునకును వెఱవరు. కాలము సమీపించినచో గర్తవ్యవిముఖులు గారు. వారు తమ భాగమును యింద్రుఁడు నాచికొన్నను అతనితో నైనను బోరుటకు సంసిద్ధులు. వారి శస్త్రపాండిత్య మట్టిది! అర్జునుఁడు లోకైక వీరుఁడు. ఊరక చెడిపోక పెద్దల మాటలు విని సంధి కొడంబడుము. యుద్ధమున నర్జుననివంటి వీరుని జయించుట కష్టము. యుద్ధమున జయాపజయము లుయ్యాల తూగువంటివి. ఇవన్నియు బాగుగ నాలోచించికొని గర్తవ్యమును నిర్ణయించికొనుము"

దుర్యోధనుఁడు బదులు వలికెను. " తాతా! పాండవులకు రాజ్యమొసఁగను. యుద్ధ సంరంభమును శీఘ్రముగా నొనర్పవలెను."

భీష్ములిట్లనిరి: "నాబుద్ధి నీకు రుచించెనేని నేను జెప్పు మార్గమున బొమ్ము. నీవు విన్నను వినకున్నను ధర్మమును వివరించుట నా కర్తవ్యము. వినుటయో, విడచుటయో నీ పాలికిఁ జెందినది." భీష్ముని దేహము దుర్యోధనాదుల కప్పుపడి యున్నది. కాని యంతమాత్రముతో శాంతనవుఁడు ధర్మవిముఖుఁడు గాలేదు. కౌరవులు విన్నను వినకున్నను సమయము దొరకినపుడెల్ల ధర్మాధర్మములను వింగడింపుచునే వచ్చెను. ఉద్యోగ పర్వమున భీష్ముఁడు ధృతరాష్ట్ర దుర్యోధనులకు సంధి చేసికొనవలసిన దని యుపదేశించిన ఘట్టము లెన్నియో యున్నవి. సేనాధిపత్యమును స్వీకరించునప్పుడు తన శరీరము పరతంత్ర మైనను మనస్సు మాత్రము స్వతంత్ర మైనదని భీష్ముఁడు దుర్యోధనునితో నన్నాఁడు. దుర్యోధనుఁడు కురువంశజుఁడగుటచే భీష్ముఁడాతని వధింపలేదు. అట్లొనర్చుట తన ప్రతిజ్ఞకు భంగము. యుద్ధమును నిలుపుట కాతఁడు జేసిన ప్రయత్నములలో రాధేయు నర్ధరథునిగా వర్ణించుట ప్రధానమైన ఘట్టము. కౌరవ కులమునకు ముసల మతఁడే నని భీష్ముఁడెఱుగును. కాని యీ ప్రయత్నము ఫలింపలేదు. ఆ ఘట్ట మిట్లు నడచినది:

"సఖా తే దయితో నిత్యం య ఏష రణకర్కశః

....... ....... .......

నైష ఫాల్గున మాసాద్య పునర్జీవన్ విమోక్ష్యసే

(ఉద్యో. అధ్యా. 169)

"రాజా! ఈ కర్ణుఁడు నీ కత్యంత ప్రియుఁడు; రణకర్కశుఁడు. వీఁడే నిన్ను మాటిమాటికిని పాండవులపై కెక్కబెట్టును. వీఁడే నీకు మంత్రి. నాయకుఁడు. బంధువుకన్నను నాప్తుఁడు. వీఁడు గర్వోరుఁడు; ఆత్మస్తుతిపరుఁడు. ఉద్ధతుఁడు. మర్యాదాతీతుఁడు. వీఁడతిరథు డగుటకు వీలులేదు. శాపగ్రస్తుఁడు. మాత్సర్యముతో వీని గుణములు కళంకితము లైనవి.కవచ విహీనుఁడు. బ్రాహ్మణ శాపముతో వీనికి

సర్వ విద్యలును బ్రాప్తించినను ప్రాప్తింపని యట్లే యైనవి. అందుచే వీడర్ధరథుఁడు. యుద్ధములో వీడర్జును నెదిరించి బ్రదుకుట కష్టము." ఈ ప్రయత్నముతో భీష్మునకు మిగిలిన దపకీర్తి మాత్రమే. దుర్యోధనుఁడు గొప్ప చమత్కారి. అతనికి భీష్ముని శక్తి తెలియును. అందుచేఁ గర్ణుని కొంత కాలము వైదొలఁగు మన్నాఁడు. భీష్ముఁడు సేనాధిపత్యము స్వీకరించు నప్పుడు గూడ నిట్లు పలికెను:

"ఏవమేత న్మహాబాహో! యధా వదతి భారత!

....... ....... ........

...... ....... ........

భవిష్యామి యధా కామం, తన్మే శ్రోతు మిహార్హసి॥

(ఉద్యోగ. అధ్యా. 156)

ఏవ మేష మహారాజ స్త్రీ పుమాన్ ద్రుపదాత్మజః

....... ....... ........

...... ....... ........

నైనం తస్మా ద్ధనిష్యామి దృష్ట్వాపి సమరే స్థితం :

వైశంపాయన ఉవాచః-

ఏత చ్ఛ్రుత్వా తు కౌరవ్యో రాజా దుర్యోధన స్తదా

ముహూర్త మివ స ధ్యాత్వా భీష్మే యుక్త మమన్యత ॥

(ఉద్యో. అధ్యా. 192)

"రాజా! నీ వన్నట్లుగనే నేను సేనాధిపత్యమును స్వీకరింతును. కాని నాకు నీ వెంతయో - పాండవులు గూడ నంతే. నీకు మంగళకర మగు పద్ధతిని బోధించుటకు నా కెట్లు స్వాతంత్ర్యము గలదో అట్లే పాండవులకు బోధించుటకును నే నర్హుఁడను. వారడిగి నప్పుడు చెప్పుట నా కర్తవ్యము. నేనాడిన వచన ప్రకారము నీ పక్షమున నుండి పోరెదను. కాని కల్యాణకరమగు మార్గమేదో నీకు వలెనే

పాండవులకును దప్పక చెప్పెదను. కుంతీ పుత్రుఁడై నరవ్యాఘ్రుఁడైన ధనంజయుఁడు దప్ప మరెవ్వరు గూడ భూమండలమున నన్నెదిరింపలేరు. అతఁ డెఱుఁగని దివ్యాస్త్రములు లేవు. కాని నాపైగల పూజ్యభావముతో నన్నాతఁడెదిరించి పోరఁడు. నేను నా శస్త్రబలముతో ససురాసుర రాక్షసముగ నీ సర్వ ప్రపంచము నొక్కక్షణములో నిర్మూలింప గలను. కాని పాండవులను వధించుట నాకు ధర్మముగాదు. వారు దప్ప యా వైపున గల సైనికులఁ బరి మార్తును. ప్రతి దినమును పదివేల మంది సైనికుల జంపెదను. ఈ నియమము గూడ వారు తొలుతనే నన్నుఁ జంపకున్ననే. నా మరియొక్క నియమము గూడ కలదు. అదియును జెప్పెదను వినుము. ద్రుపదుని కొడుకైన శిఖండితో నేను యుద్ధమొనర్పను. వాడు స్త్రీయే పురుషుడుగా మారినవాడు. కాశీపతి కన్య యైన యంబయే ద్రుపద కులమున శిఖండిగా జన్మించినది. అట్టివారు ధనుర్బాణములు ధరించుట, వారిని చూచుట నా కిష్టము లేదు. కనుక నేను శిఖండి వైపు జూడను. వానితో బోరను. స్త్రీ - పురుషుఁడు, స్త్రీనాముఁడు, స్త్రీరూపుఁడు నగువారితో నేను యుద్ధ మొనర్పనని ప్రతిజ్ఞ యొనర్చితిని. నా యీ ప్రతిజ్ఞ లోక విశ్రుతము. కనుక నేను శిఖండిని జంపలేను. ధర్మాభిమానియైన భీష్ముఁడు స్త్రీహత్య యొనర్చినచో సత్పురుషులు నిందింపకుందురా! కనుక యుద్ధ భూమిలో శిఖండి నా యెదుటికి వచ్చి నిలిచినను నేను వానివైపు జూడనని స్పష్టముగఁ జెప్పుచున్నాను. వాఁడు ప్రయోగించు బాణములకుఁ బ్రతిప్రయోగ మొనర్పను."

క్షత్రియ శిరోమణి యైన భీష్ముఁడు, సత్యసంధులలో నగ్రగణ్యుఁడైన భీష్ముఁడు, తా నాడిన మాటకు విరుద్ధముగ సంచరింపలేక పాండవుల పైకి కత్తిగట్టెను. కురుకుల సత్యధర్మ పతాక యైన భీష్మాచార్యులు యుద్ధభూమికి వచ్చుటతో యుధిష్ఠిరునకుఁ జిత్తక్షోభమేర్పడినది. ఆతఁడు భీష్ముల యాశీర్వాదము గొనుటకై వారిని సమీపించినాఁడు. ఆ ఘట్ట మిది:

"సోఽవగాహ్య చమూం శత్రోః శంశక్తి సమాకులాం
......... ......... .........
......... ......... .........
వతావ వ్యృత్యుకాలో 2 పి. పునరాగమనం కురు.
(భీష్మప. అధ్యా. 43)

శరశక్తి సమాకుల మైన సైన్యమును బ్రవేశించి ధర్మరాజు తమ్ములతో గూడ భీష్ముని దర్శించెను. యుద్ధమునకు సిద్ధమైన భీష్ముని రెండు పాదములను బట్టికొని ధర్మరా జిట్లు వలికెను:

"ఓ దుర్ధర్షా! నీకు నమస్కారము. నీతోడి యుద్ధమునకు ధిగు చున్న మా కనుజ్ఞ యొసఁగుము. దివ్యము లగు నీ యాశీర్వాదముల దయసేయుము."

"ధర్మజా! యుక్తమగు పని నొనర్చితివి. నీ విపుడు నా కడకు రాకున్నచో పెద్దల యెడ నొనర్చిన పరాభవమునకై నిన్ను శపించియుందును. పుత్రా! నీ ధర్మజ్ఞతకుఁ జాల సంతోషించితిని. యుద్ధమున జయము బొందుదువు గాక! నీ కోర్కె లీడేరునుగాక! నీ కేమి వరము గావలెనో కోరికొమ్ము. ధర్మజ్ఞునకెందును బరాభవము లేదు. మానవుఁడర్థమునకు దాసుఁడు; అర్థము వాని ననుసరించదు. నేను పొట్టకొఱకై కౌరవుల కడ నుండవలసివచ్చినది. అందుచే నేను క్లీబుని వలె మాట లాడుచున్నాను. యుద్ధ విషయము దప్ప తక్కిన యే వరమైనను గోరికొమ్ము; ఇచ్చెదను."

"పితామహా! నీవు సర్వదా మా హితైషివి. కౌరవుల కడ నుండియే పోరుము."

"అట్లే చేయుదును. కాని నీ కోర్కె యేదో చెప్పుము. దానిని

తీర్తును."

"యుద్ధమున నీ వపరాజితుఁడవు. నా పై దయ యున్నచో సంగరమున నిన్ను జయించెడి యుపాయ మేదో తెలుపుము."

"ధర్మజా! నేను పోరాడుచుండగా నన్ను శతక్రతుఁడు గూడ నెదిరింప లేడు."

"తాతా! యందుకే యడుగుచున్నాను. నీ వధోపాయ మేదో తెలుపుము."

"యుధిష్ఠిరా! నన్ను సమరమున జయింపగలవాఁ డెవ్వడో నాకుఁ దోచుటలేదు. మృత్యుకాలము సమీపించినదిగను భాసించుట లేదు. నీవు మరల నింకొకసారి రమ్ము." ఇట్లు దుర్యోధనున కిచ్చిన మాట ప్రకారము భీష్ముఁడు ధర్మరా జడిగినప్పుడు ఆతనికి హితమార్గమును బోధించినాఁడు.

## భీష్మాచార్యుల యుద్ధము

శస్త్రము బట్టిన తరువాత భీష్ముఁడు దన పరాక్రమ ప్రదర్శనములో నే వంచనమును జేయలేదు. మహాభారతమునందు భీష్ముఁడొనర్చిన పది దినముల యుద్ధము అశబలితమైన వీరరసావిష్కారము. అతని మనస్సున గేవలము క్షత్రియోచితమైన యుద్ధోత్సాహమే యుండినది గాని క్రోధ మణువును లేదు. ఉభయ పక్షముల యందలి ప్రముఖ నాయకులును ఆతని దృష్టిలో బాలకులు. అందుచే భీష్ములకు వారందరిపై వాత్సల్యమే యెక్కువ. అట్లైనను నాతఁడు భయంకరముగ విజృంభించెను. తొలుతటి దినమే మహావీరుల నెందఱినో జంపెను. భీష్ముల యీ విక్రమముతో ధర్మజుని యుద్ధోత్సాహము క్షుబ్ధ మైనట్లైనది. ఆ ఘట్టము భారతమున నిట్లు గలదు:

"కృతే వహారే సైన్యానాం ప్రథమే భరతర్షభ!

...... ...... ......

...... ...... ......

కేవలం బాహు వీర్యేణ క్షత్ర ధర్మ మనుస్మరన్.

(భార. భీష్మ. అధ్యా. 50)

"సైన్యములు సన్నద్ధము లైనవి. యుద్ధమారంభ మయ్యెను. భీష్ముని యుద్ధసంరంభ మమోఘముగ నుండెను. దుర్యోధనుని యానందమున కంతు లేదు. అప్పుడు ధర్మరాజు అనుజులతోడను. జనేశ్వరులతోడను జనార్దనుని సమీపించినాఁడు. అతని ముఖము దుఃఖోద్విగ్నమైనది. ధర్మరాజు పరాజయము నాశంకించుచుండెను. అతఁడు కృష్ణునితో నిట్లనెను: "కృష్ణా! మహేష్వాసుఁడగు భీష్ముని వైపు జూడుము. అతని పరాక్రమము భయంకరముగ నున్నది. ఎండకాలమున కాఱుచిచ్చు తృణసంతతిని దహించినట్లు నా సైన్యమును దహించివేయుచున్నాఁడు. ఆతని వైపు దేరిచూచుటకును భయమగుచున్నది. హవిస్సులను గ్రోలి భయంకరముగ నాల్కలు జాచుచున్న యగ్నివలె నతఁడు నా సైన్యము నాహరింగొనుచున్నాఁడు. భీష్ముని బాణముల కాగలేక మనసైన్యములు పరువెత్తిపోవుచున్నవి. కోపము గొన్న యముని జయింపవచ్చును. వజ్రపాణి నదలింపవచ్చును. పాశమును ధరించిన వరుణుని లోఁగొనవచ్చును. గదాధరుఁడైన కుబేరునణకింపవచ్చును. కాని యీ భీష్ము నెదిరించి యోర్చుటకు సాధ్యముగాదు, ఈ భీష్మ పరాక్రమ మను నగాధజలమునందు నా జయ మనెడి యోడ మునిగిపోవుచున్నది. ఏమి సేయుదును? వనముల కేగి శాంతముగ జీవింత మనుకొనుచున్నాను. నా వైపు రాజుల నందఱిని భీష్ముని బాణములకు బలివెట్టుటకు నా మనస్సంగీకరించుటలేదు. ఆతఁడు సర్వాస్త్రవిదుఁడు. ప్రజ్వలితము లైన మహాగ్నిని జొచ్చిన శలభముల వలె నా సైనికు లా వీరుని పరాక్రమమున జొచ్చి నామరూపములు లేక పోవుచున్నారు. రాజ్యము పైని యాశతో నింత జేసికొంటిని. నా తమ్ము లాతని బాణములకు నలఁగిపోయిరి. నా కొఱకై వీరనుభవించిన దుఃఖములకు లెక్క లేదు. నామాట

లాలించి సుఖవంచితులును, రాజ్యవంచితులు నైరి. ఇంక నేమి జేయనగును? మేము జీవించినచో నదియే పదివేలనిపించుచున్నది. జీవించుటయే కష్టముగాఁ గన్పించుచున్నది. అడవులలో నుండి తీవ్రతపము వట్టెదను. ఇఁక నా సైన్యము నాతనితో జంపింపలేను. నేనేమి చేయవలయునో చెప్పుము. ఈ యుద్ధమును నర్జునుఁడు మనసార పరాక్రమించున ట్లగుపించుటలేదు. భీముఁడొక్కడే తెగించి పోరుచున్నాఁడు."

## "భీష్మలకుఁ దగిన ప్రతిపక్షి శ్రీకృష్ణుఁడొక్కడే

యుధిష్ఠిరుఁడు అర్జునుఁడు సరిగా విక్రమింపలేదని యుద్విగ్నుఁడయ్యెను. కాని భీష్మనకుఁ దగిన ప్రతివీరుఁడు గృష్ణుఁడొక్కడేయనుట మూడవనాటి యుద్ధమున స్పష్టమైనది. ఆనాఁడు భీష్ముఁడు ద్విగుణీకృతముగ విజృంభించినాఁడు. పాండవ సైన్యముల మరలింపఁజూచెను. కాని యాతని మాటల నవి పెడచెవినిబెట్టినవి. జగత్సూత్రధారి యైన కృష్ణుఁడొక్కడే భీష్మని పరాజితునిఁగావింప సమర్థుఁడు. మానవీయ శక్తి యంతయు దివ్యాస్త్రవేది యగు భీష్మనెదుటఁ గవ్వకు గొఱరాని దయ్యెను. ఈ స్థితిని జూచి శ్రీకృష్ణుఁడు దన ప్రతిజ్ఞను గూడ మఱచి శస్త్రమును గైకొనుట కుద్యతుఁడైనాఁడు. మహాభారత మిట్లు వర్ణించినది:

"ఉవాచ శైనేయ మభిప్రశంసన్
ధృష్ట్వా కురూ నాపతతస్సమగ్రాన్
......  ......  ......
......  ........  .....
సంకంపయన్ గాం చరణై ర్మహాత్మా
వేగేన కృష్ణః ప్రససార భీష్మం"

(భీష్మ. అధ్యా. 59)

సాత్యకి ప్రయత్నమును జూచి కృష్ణుఁడు ప్రశంసించెను. కౌరవ సైనికులు పైపైని యొత్తికొనివచ్చుట యాతఁడు చూచినాఁడు. కృష్ణుఁడిట్లు సాత్యకితోఁ బలికెను. "సాత్యకీ! పారిపోవువారి నడ్డగింపకుము. వారిని పోనిమ్ము. తక్కినవారు పోయినను బోనిమ్ము. భీష్మునిప్పుడే వధించెదను. ద్రోణాచార్యులను గూడ సానుచరముగ సంహరింతును. ఈ కౌరవ సైనికులలో నొక్కని గూడ నీనాఁడు మిగులనీయను. చక్రాయుధమును దరించి భీష్మ-ద్రోణుల నిర్వురను వధించి తీరుదును. నా యీ విక్రమముతో ధర్మజ, భీమార్జున, నకుల, సహదేవులకు సంతోషము గలిగింతును. ధార్తరాష్ట్రుల నందఱ వధింతును. అంతమాత్రమే గాదు, ఆ దెసఁగల వీరవరుల నందఱ వధింతును. ధర్మజుని గద్దెపైనుంతును." ఇట్లు పలికి కృష్ణపరమాత్ముఁడు చక్రమును ధరించి రథమునుండి క్రిందికి దూకెను. ఆతని చరణ వేగమునకు భూమికంపించుచుండెను. ఆతఁడు భీష్మునిపై బోసాఁగెను." అర్జునుఁడతి కష్టముతో గృష్ణుని క్రోధమును మరలించెను. సత్యసంధుఁడైన భీష్ముఁడు దన పరాక్రమముతో గృష్ణుని వంటి మహాపురుషుని గూడ ప్రతిజ్ఞావిచలితుని గావించెను. ఒకసారి గాదు, రెండుసార్లు. తొమ్మిదవ నాటి యుద్ధ మీ క్రిందిది:

"ప్రతపంత మివాదిత్యం, మధ్య మాసాద్య సేనయోః
....... ....... ........
...... ....... ........
శుశుభే విద్రవన్ భీష్మం, విద్యున్మాలీ యథాంబుదః"
(భార. భీష్మ. అధ్యా. 106)

మధ్యాహ్న సూర్యుని వలె భీష్మాచార్యులు ఉభయ సేనలనడుమ బ్రకాశించెను. ఆతఁడు రథిక శ్రేష్ఠులను లెక్కకు మిక్కిలిగ వధించుచుండెను. ప్రళయకాలము నాతఁడు సృష్టించుచున్నట్లున్నది. భగవంతుఁడిక సహింపలేకపోయెను. రజతప్రఖ్యములైన పార్థుని హయరశ్ములను వదలి

యోగీశ్వరేశ్వరుఁడైన మాధవుఁడే మహారథమునుండి క్రిందికి దూకినాఁడు. అతఁడు భీష్మని వైపు బరువెత్తుచుండెను. ఆతని పాదఘట్టనచే భూమి వణకిపోవుచుండెను. క్రోధతామ్రేక్షణుఁడైన కృష్ణుఁడు కౌరవసైనికుల యాయువునుమ్రింగి వేయువాని వలె బరువెత్తి వచ్చుచుండెను. కృష్ణుని యీ మహాసంరంభమును గాంచిన సైనికులు "భీష్మఁడు చచ్చె చచ్చె" నని యఱచిరి. పీతకౌశేయ సంవీతుఁడై మణిశ్యాముఁడైన శ్రీకృష్ణుఁడు, విద్యున్మాలి యగు మహాంబుదము వలె గర్జించుచు చారుభీషణముగ నొప్పెను. "తనతో దప్ప మరెవ్వరిచేతను భీష్మఁడు మరణింపడనుట శ్రీకృష్ణునకు స్పష్టము. తొమ్మిదవనాటి రాత్రి ధర్మరాజు శిబిరమున సభ దీరినది. అప్పుడు కృష్ణుఁడిట్లు వలికెను.

"మాంవా నియుంక్ష్వ సౌహార్దా, ద్యోత్స్యే భీష్మేన పాండవ

...... .......... .......

....... .......... .........

విముంచంతం మహాస్త్రాణి, పాతయిష్యామి తం రథాత్"

(భీష్మ....... అధ్యా. 107)

"మహారాజా! నన్ను సేనాపతిగా నొనర్పుము. నేను భీష్మనితోఁ బోరెదను. నీవు గోరినచో నేనేపని యొనర్పను? అర్జునున కయిష్టమయినను భీష్మని నే యుద్ధమున కాహ్వానించెదను. ధార్తరాష్ట్ర సమ్ముఖముననే యాతనిని ఘోరముగ వధింతును. భీష్మఁడు మరణించినచో నీకు జయము దప్పదు. ఒక్కటే పూటలో భీష్మని మట్టుపెట్టెదను. మహేంద్ర విక్రముఁడ నగు నా పరాక్రమము నీవు గమనింపుము. అనర్ఘాస్త్రముల నీనుచున్న యా కురుసత్తముని రథమునుండి యురలఁద్రోసెదను." కృష్ణుఁడు శస్త్రధారి యగుటకు ధర్మరాజంగీకరింపలేదు. మరి శాంతనవుని జంపునుపాయము! మొదటి దినము భీష్మఁడన్న పల్కును నవకాశముగ దీసికొని పాండవు లాతని మరణోపాయమును దెలిసికొనుటకై యాతని శిబిరమున కేగిరి.

# భీష్ముని యౌదార్యము

భీష్మాచార్యులు వారికిఁ బ్రీతితో స్వాగతమిచ్చెను. ఆతని యౌదార్యమునకు ధర్మజుఁడు చకితుఁడయ్యెను. శాంతనవులను గెల్చుట తమ కసాధ్యమనియు ఆ యుపాయమును జెప్పవలెననియు ధర్మరాజు మనవి యొనర్చెను. ధర్మవిజయమునకై యే శౌర్యము వెచ్చపెట్టఁబడవలెనో యది తాను ప్రతిజ్ఞాబద్ధుఁడగుటచే నా శౌర్యము కుత్సిత రాజకీయములకుఁ జిక్కి యధర్మపక్షమునకు దోహదమొనర్చుచుండెనని భీష్ముల మనస్సు విషాదాక్రాంత మయ్యెను. కాని యాతని దృష్టిలో ప్రతిజ్ఞయు, బ్రదుకును రెండును నొక్కరూపే. ఆ ప్రతిజ్ఞాగ్నియందు తన జీవిత సమిధనే హోమించు వరకు నది శాంతించునట్లు లేదు. కడకు భీష్ముఁడా నిశ్చయమునకే వచ్చెను. అతఁడు ధర్మరాజుతో నిట్లన్నాఁడు.

"సత్య మేత న్మహాబాహో! యథా వదసి పాండవ!

....... ....... .......

........ ........ ........

సంగ్రామే ధార్తరాష్ట్రాంశ్చ హన్యాః సర్వాన్సమాగతాన్"

(భా. భీష్మ. అధ్యా. 107)

"ధర్మరాజా! నీవు సత్యమునే పలికితివి. యుద్ధమునందు నన్ను జయించుటకు సురాసురులు చాలరు. ఇంద్రుఁడైన నెదురింపలేడు. నా చేత శస్త్రమున్నంతవఱకును యే మహారథుఁడుగాని నా యెదుట నిలువలేడు. నేను శస్త్రసన్యాస మొనర్చిననే యెవ్వరైన జయింపఁగలరు. శస్త్రములు వదలినవానిని, పతితుని, కవచధ్వజములు భగ్నములైనవానిని, శరణాగతుని, భీతుని నేను జంపను. స్త్రీని గాని, స్త్రీనామధేయుని గాని, యేకపుత్రకుని గాని, అప్రశస్తుఁడైన మనుష్యుని గాని నేను వధింపను. అట్టివానితో యుద్ధము నాకు రుచింపదు. అమంగళధ్వజము గలిగిన రథికునితో నేను బోరను. నన్ను జంపుటకు సాధనము మీ నొక్కఁడున్నాఁడు. అతఁడు ద్రౌపదేయుఁడు.మహారథుఁడు గూడ. సమితింజయు

సమరామర్షి. తొలుత స్త్రీగా నుండి పురుషత్వము నందినవాఁడు. పేరు శిఖండి. అర్జునుఁడాతని ముందుంచికొని దంశితుఁడై నాపైని బాణములను బ్రయోగించు గాక. వాఁడమంగళధ్వజుఁడు. స్త్రీపూర్వుఁడు. ఆ శిఖండితో నేను యుద్ధమాడను. వానిని ముందుంచికొని ధనంజయుఁడు నన్ను బాణములతోఁ బ్రహరించినచో నా మరణము సుసాధ్యమగును. నన్ను గృష్ణార్జునులు దప్ప మరెవ్వరును జయింపలేరు. అర్జునుఁడీ పని జేయుగాక. ఇది యొకటే మీకు విజయోపాయము. నేను బడిన తరువాత కౌరవు లందరును వరుసగా జత్తురు."

భీష్ముఁడు క్షత్రధర్మము యొక్క ధీరోదాత్తమగు నవతారము. అతని యా పలుకులు విని యర్జునునకు విషాదమయ్యెను. శస్త్రసన్యాస మొనర్చిన పరమపూజ్యుఁడగు భీష్ముని పై దాను శస్త్రప్రయోగమెట్లొనర్పవలెనో యాతని కల్పనకు గూడ నందని యొక మహాపాపముగ నుండెను. అతని శరీరము వణక నారంభించినది. కాని భీష్ముఁడిదియే మార్గమని యాతని నిర్బంధించెను. కృష్ణుఁడు ,సమ్మతించెను. తరువాతి దినపు యుద్ధ మొనర్పవలసివచ్చెను. శిఖండిని ాచినదే భీష్ములస్త్రసన్యాస మొనర్చినారు. శిఖండి యొనర్చిన బాణప్రయోగము ాతని మర్మముల భేదించివేసెను. శిఖండి బాణములకు భీష్ముఁడు మథనపడుచున్నాఁడని దుశ్శాసనుఁడు తలఁచెను. అప్పుడాతనితో భీష్మ డిట్లనెను.

"ఏవం తయో స్సంవదతో ఫాల్గునో నిశితై శ్శరై:

...... ..... .......

...... ...... .......

వీరం గాండీవధన్వానం, ఋతే జిష్ణుం కపిధ్వజం"

(భీష్మ. అధ్యా. 119)

అర్జునుని తీక్ష్ణములైన బాణములతో బాధపడుచున్న భీష్ముఁడు దుశ్శాసనునితో నిట్లు పలికెను.

"దుశ్శాసనా! ఇవి శిఖండి ప్రయోగించు బాణములు గావు. గాండీవమునుండి వెడలుచున్నవి. ఇవి ముసలముల వలె నన్ను భేదించుచున్నవి. వజ్రదండ సమస్పర్శములు. వజ్రవేగ దురాసదములు. ఈ బాణములు సన్నిహితులైన యమదూతలవలె నా ప్రాణముల నీడ్చుచున్నవి. లేలిహానములగు భుజంగముల వలె నా శరీరమును క్షోభపెట్టుచున్నవి. ఇవి యర్జునుని బాణములు తప్ప యితరులవి గావు."

ఇంతలో భీష్ములకు మూర్ఛ వచ్చినది. కొంతవడి కా యలౌకిక పురుషుఁడు తెప్పరిల్లి నేత్రములు దెఱచెను. ఆకాశము వైపు దృష్టి బఱపినాఁడు. అది దక్షిణాయన మన్నది జ్ఞాపకమునకు వచ్చెను. అతఁడు స్వచ్ఛందమరణము గలవాఁడు. ఉత్తరాయణము వచ్చునంతకు శరతల్పమున నట్లే యుండఁదలఁచెను. తన తేజమును బరమాత్మలోఁ గలుపదలఁచెను. ఆతఁడు నిత్యముక్త పురుషుఁడు. మరి యుత్తరాయణము వచ్చునంతవరకు నాతఁ డెందుకాగెను? శరఘాతముల వలన గలిగిన బాధ నంతవఱకు సహింపవలసిన యవసర మాతని కెందుకేర్పడినది? దీనికి సమాధానము భారతమందే యున్నది.

"పత న్ స దదృశే చాఽపి, దక్షిణేన దివాకరం

....... ....... .........

....... ....... .........

జప న్ శాంతనవో ధీమా న్ కాలాకాంక్షీ స్థితోఽభవత్"

(భీష్మ అధ్యా. 119)

భీష్ము లాకాశము వైపు జూచిరి. అది దక్షిణాయనమని గుర్తించిరి. ఇంతలో నాకాశమున దివ్యవాణి యిట్లు వినిపించినది. "భీష్ముఁడు కాలకర్త. శస్త్రధారులలో నగ్రగణ్యుఁడు. ఇట్టివాఁడు దక్షిణాయనమున నెట్లు మరణించుచున్నాఁడు?" " అట్లయినచో నుత్తరాయణమువఱకును నే నిట్లే

యుందునని భీష్ముఁడు బదులువలికెను. యోగశక్తితో బ్రాణముల నుగ్గబట్టిన భీష్ముఁడు వేదాంత కాలక్షేపముతో నుత్తరాయణమున కెదురు చూచుచుండెను. భీష్ముల స్థితి చెవిని బడి నంతనే ద్రోణాచార్యులు మూర్ఛిల్లిరి కృపాచార్యాది మహారథులు తమకుఁగూడ నంత్యకాల మాసన్నమైనట్లు దలఁచిరి. శరదంష్ట్రలతో గూడిన ధను స్సెవ్వని ముఖమో, ఖడ్గ మెవ్వని జిహ్వాయో అట్టి నరసింహుఁడైన భీష్ముఁ డెవ్వరి కాశాజనకుఁడు గాడు! భీష్ముల నిధనమును విన్న పాండవ కౌరవు లిర్వురును సంక్షోభించిరి. వారికేమి చేయుటకును దోయలేదు. భీష్ముని యంపశయ్య కడకుఁ బరువెత్తికొని వచ్చిరి.

## దివ్యశర శయనము

తమతమ కవచములను విప్పివేసికొని నతమస్తకులై కురు, పాండవ వీరులు భీష్ముని పాదములకు మోకరిల్లినారు. అప్పుడు శాంతనవుఁడు వారితో నన్నమాటలు భారతమున నెంతయో హృదయస్పర్శములుగ వర్ణింపఁబడినవి. ఆ సమయమున భీష్ముని మహానుభావత యర్జునుని వినీతి అద్దమున వలె స్పష్టముగ గోచరించుచున్నది. మహాభారతములో నా ఘట్టమిది.

"నివృత్తేషు చ సైన్యేషు, పారంపర్యేణ సర్వశః

..... ....... .....

...... ....... .....

తతస్తే విస్మయం జగ్ముః నానాజనపదేశ్వరాః"

(భీష్మ. అధ్యా. 120)

కురుపాండవ వీరులందరును ప్రజాపతి నమరుల వలె భీష్ముఁ బరివేష్టించిరి. పాండవులు గూడ గౌరవులతో బాటు ఆతనికి నమస్కరించి నిలచిరి. అతఁడు పాండవ కౌరవ వీరులనుఁ జల్లగా బలుకరించి నాఁడు.

"మహాభాగులారా! మీకు స్వాగతము. మహారథులారా! మీకు స్వాగతము. అమరోపములైన మిమ్ము దర్శించి నా మనస్సునకుఁ దృప్తి గలిగినది". ఆతఁడు కురుకుమారుల వైపు దిరిగి తన శిరమొఱగుచున్నదనియు నొక యుపధానము గావలెననియుఁ గోరెను. పరిజనులు వెంటనే మృదువులైన యుపధానములఁ గొనితెచ్చిరి. భీష్ముఁడు వాని నంగీకరింపలేదు. అతఁడు చిఱునవ్వునవ్వుచు శరశయ్యపై నున్న తన కిట్టి యుపధానములు పనికిరావన్నాఁడు. భీష్ముఁడు సర్వలోక మహారథుఁడగు నర్జునుని వైపు దిరిగి తన కుపధానము సముచితమైనది తెచ్చిపెట్టుమని యాచించెను. ఆ శ్లోక యెంతయో రమణీయముగ నున్నది. అది యిది:

> "ధనంజయ మహాబాహో! శిరో మే తాత! లంబతే
> దీయతా ముపధానం వై, యద్యుక్త మిహ మన్యసే."

భీష్ముని పల్కులను విని యర్జునుఁ డాతని కభివాదన మొనర్చెను. అతని కన్నులనిండ నీరు!! అర్జునుఁడు ధనువు నెక్కిడి "యేమి చేయవలె" నన్నట్లుగా భీష్ముల వైపుఁ జూచెను. భీష్ముఁడు నవ్వుచు తన కుపధానమును దయారుసేయుమన్నాఁడు. క్షత్రధర్మవిదుఁడైన తనకుఁ దెలుపవలసినది లేదన్నాఁడు. ఆతఁడు భీష్ములకు నమస్కరించి మూఁడు బాణములను భూమిలోనికి విడిచెను. అవిభీష్ముల కుపధానమైనవి. పరమసంతుష్టుఁడైన భీష్మాచార్యులు చిఱునవ్వు నవ్వినాఁడు. "అర్జునా! నాకు యోగ్యమగు నుపధానమును యేర్పఱచితివి. అన్య యొనర్చియున్నచో నిన్ను శపించియుందును. ఇట్టి శరతల్పమే వీరులకు యోగ్యము అనెను. అతఁడక్కడ జేరిన మహావీరులతో ధర్మయుక్తముగ నేడ సంభాషించుచుండెను. ఇంతలో శస్త్రచికిత్సకులను దుర్యోధనుఁడు గొనితెచ్చెన తనకు జికిత్స వలదనియు వారి నర్హముగ సన్మానించి పంపవలసినదని

భీష్ములు సెలవొసఁగిరి. ఆ వాక్యముల కచ్చటఁ జేరిన జనేశ్వరులందఱు నాశ్చర్యపడినారు. మఱునాఁడు గూడ వీరు లాతని చుట్టుఁ జేరిరి. అప్పుడు జరగిన సంభాషణమును వ్యాసభగవానుఁ డిట్లువర్ణించెను.

"భీష్మస్తు వేదనాం ధైర్యాత్. నిగృహ్యా భరతర్షభ!

....... ...... .......

....... ...... .......

వాసుదేవసహాయస్త్వం, మహత్కర్మ కరిష్యసి"

(భీ. అధ్యా. 121)

భీష్మునకు వేదన యధికమైనది. దాని నాతఁడు ధైర్యముతో సహించుచుండెను. అతఁడు మహోరగము వలె నిట్టూర్చుచున్నాఁడు. శరాభితప్తకాముఁడైన యాతఁడు పానీయమునకై యాచించెను. చుట్టునున్న క్షత్రియులు శీతలములైన జలములఁ గొనితెచ్చిరి. ఆ జలమును జూచి భీష్ములు నవ్విరి. నరభోగ్యములైన పానీయములను నేను గోరను. శరతల్పగతుఁడనైన నేను మానవలోకమును గడచిపోయి నట్లే; నాకు దివ్యభోగ్యములైన జలములే గావలెను. అతఁడు వారి యశక్తతను నిందించుచు నర్జునుని గొనిరావలసిన దనెను. అర్జునుఁడు వచ్చి భీష్ములకు నమస్కరించి "ఏమి సెల" వని యడిగినాఁడు. "నాయనా! నీ బాణములచేఁ బరితప్తుఁడనైన నాకు దాహ మగుచున్నది, నా కిన్ని జలము లిమ్ము. ఈ పనికి నీవే యర్హుఁడవు." అర్జునుఁడు భీష్ములకు నమస్కరించి రథస్థితుఁడై ధనువు నధిజ్యము గావించి కొని క్రిందికి వచ్చి భీష్మునకు నమస్కరించి బాణమును భూమిలోనికి వదలినాఁడు. అది పర్జన్యాస్త్రము. భీష్మునకు దక్షిణముగా నాతఁడు బాణమును వదలెను. తోడనే భూమినుండి జలధార పుట్టుకొనివచ్చినది. ఆ జలములు దివ్యగంధోపేతములు. అమృతకల్పములు. అత్యంత శీతలములు. అర్జునుని యీ పరాక్రమమును గని సమస్త వీరులును దిగ్భ్రాంతులైరి. కౌరవులు శీతార్దితములైన గోవులవలె కంపించినారు. శంఖదుందుభి

నిర్ఘోషములు చెలంగెను. ఆ జలమును గ్రోలి తృప్తుడైన భీష్ముఁడు బీభత్సునితో నిట్లనెను. "అర్జునా! నీ శక్తి కిది సాధ్యముగాదు. నీవు పూర్వజన్మమున నరుఁడను ఋషివని నారదుఁడు నా కెఱిఁగించెను. వాసుదేవ సహాయుఁడవై నీవు మహాకార్యము లొనర్తువు." సర్వ వీరుల యెదుట నాడిన యీ పల్కులు అర్జునున కొనర్చిన యనర్ఘమగు పూజ వలె నుండెను. ఇట్టి రసవత్తరములై, యుదాత్తములైన ఘట్టములు భీష్ముని చరిత్రమున కోకొల్లలుగ వచ్చును.

## భీష్మాచార్యుల కఠోర కర్మనిష్ఠ

శరతల్పగతుఁడైన తరువాత భీష్మున కంతకుముందున్న యా కొలఁది మానవత్వము గూడ లేకపోయెను. ఆతని యుపధానము, జలము, వాణి సర్వమును దివ్యములైపోయెను. ముక్కులలోఁ గొనయూపిరియున్నంతవఱ కాతఁడు దన కర్మనిష్ఠను మానలేదు. ఆ జీవన సంధ్యలో గూడ నాతఁడు మహోదాత్తపురుషుఁడుగా భాసించినాఁడు.ఆ యంతిమ క్షణములలోఁ గూడ గురుకుల కల్యాణ కారకములైన ప్రయత్నముల నాతఁడు మానలేదు. అర్జునుని దివ్యకృత్యముల నాతఁడు వర్ణించుచు దుర్యోధనునితో నిట్లు వలికెను.

"దృష్టం దుర్యోధనైతత్తే, యథా పార్థేన ధీమతా
....... ....... .......
....... ....... ........
పితా పుత్రం మాతులం బాగినేయో భ్రాతాచైవ భ్రాతరం ప్రై తు రాజన్"
(భీష్మ. అధ్యా. 121)

"దుర్యోధనా! అర్జునునిచే నతి మానుషములైన క్రియలు చూపబడెను. అమృతగంధి యగు జలధార నాతడు గలిగించెను. మహాబాహువగు గృష్ణు డతనికి స్వాధీనుఁడు. ఆతనితో సంధి నీకు మేలు. యుద్ధమును మానుము.

ఈ బంధుక్షయము నిలిచిపోవుగాక! తండ్రి పుత్రునితో, అల్లునితో మేనమామ, తమ్మునితోఁ దమ్ముడు గలిసికొని సుఖముందురుగాక." కాని యీ ప్రయత్నము దుర్యోధనుని యెడ వ్యర్థమయ్యెను.

"ధర్మార్థసహితం వాక్యం, శ్రుత్వా హిత మనామయం
నారోచయత పుత్రస్తే, ముమూర్షురివ భేషజం"

"ధర్మార్థసహితమును, అనామయమును, హితమును నగు భీష్ముల యుపదేశము మరణోన్ముఖున కౌషధమువలె దుర్యోధనునకు రుచింపలేదు. దుర్యోధనుడు తన మాటలను వినఁడని నిశ్చయించికొన్న పిదప భీష్ముఁడు, కర్ణునితో నీ విషయము బ్రస్తావించెను. కర్ణుఁడు దన్ను జూచుటకు వచ్చినపు డీ విధముగ నన్నాఁడు.

సోదర్యాః పాండవా వీరాః భ్రాతర స్తే రిసూదన!

....... ....... ......

....... ....... .......

పృధివ్యాం సర్వరాజానో, భవం త్వద్య నిరామయాః"
(భీష్మ. అధ్యా. 122)

శత్రు నాశకుఁడవైన యో కర్ణా! పాండవులు నీకు సోదరులు. నీవు నాకు మనఃప్రియము సేయ నిచ్ఛగించినచో నీవు వారితోఁ జేరుము. "ఆదిత్యనందనా!! యీ యుద్ధము నాతో ముగిసి సర్వ రాజులును నిరామయులై యుందురు గాక! " కాని కర్ణుఁడీ మాటలను వినలేదు. యుద్ధోన్ముఖుఁడైన దనకు, నాశీర్వాదము నర్థించినాఁడు. ఇక లాభము లేదని తెలిసికొన్న భీష్ములు కర్ణునితో నిట్లనిరి:

"న చేచ్ఛక్య మవస్రష్టుం, వైర మేత త్సుదారుణం

...... ...... ......

...... ...... .......

నచైవ శకిత: కర్తుం, కర్ణ సత్యం బ్రవీమి తే"

(భీష్మ. అధ్యా. 122)

"కర్ణా! ఈ దారుణమగు వైరమును వదలుటకు నీకు శక్యము గాకున్నచో యుద్ధమున కనుజ్ఞ నిచ్చుచున్నాను. స్వర్గకాముకుఁడవై బోరాడుము. యుద్ధములోఁ గ్రోధావిష్టుఁడవై నిర్మర్యాదముగ వర్తింపకుము. యథోత్సాహముగ యథాశక్తిగ భండన మొనరింపుము. సమరమునఁ గర్మ యోగివై వర్తింపుము. నీవు సత్పురుషుల వృత్తముల నాఱితేరినవాఁడవు. ధనంజయునితో బోరాడి క్షత్రధర్మ జితములైన లోకములను బొందెదవుగాక! నిరహంకారుఁడవై బలవీర్య వ్యపాశ్రయుఁడవై ధర్మయుద్ధము సేయుము . ధర్మయుద్ధమున కన్నను క్షత్రియునకు మఱియొక కర్తవ్యము లేదు. నీ వైరము నణచుట కెంతయో బ్రయత్నించితిని. కర్ణా! నా ప్రయత్నములు సాఁగిరాలేదు.' యుద్ధానంతరము గోత్రజహత్యా భయముతో ధర్మరాజు కంపించిపోయెను. ఆతని జ్ఞానము మూకీభవించినది. అప్పుడు గూడ భీష్ముఁడు ధీరోదాత్తముగనే ధర్మబోధ యొనర్చెను. ధర్మరాజు కడ నుండియే తనకు మృత్యువు సంప్రాప్తించినది సత్యమైనను ఆ ధర్మమూర్తి ధర్మరాజునే యోదార్చుటకుఁ బూనుకొన్నాఁడు. యుధిష్ఠిరునకే గాదు భారత జాతికే పరమ ధ్యేయములైన వ్యక్తిగత, సామాజిక రాష్ట్రీయ ధర్మము లన్నియు నాతఁడు బోధించెను. భారతీయ సంస్కృతి యెట్టిది? వారి తత్త్వజ్ఞాన స్వభావ మేమి యనునది తెలిసి కొనవలె నన్నచో భీష్ముని బోధ నవలోకించియే కావలెను. మహాభారత గ్రంథమునందు శాంత్యనుశాసనికములకు గొప్ప ప్రశస్తియున్న వానికి కృష్ణవేదములని పేరు. ఆ ప్రశస్తి భీష్మోపదేశముల వలననే గలిగిః పరమోత్కృష్టములైన ధర్మములు వివరించుటకు వ్యాసభగవానుఁడు భీః

నండగా దీసికొనెను. ఆ భీష్ముని గురించి మనవంటి వారేమి చెప్పగలరు? భీష్ముని యస్తమానముతో జ్ఞాన సూర్యుఁడే యస్తమించెనని కృష్ణుని వంటి వాఁడు గూడ వాపోయెను. ధర్మజునకు వివిధ ధర్మము లుపదేశించి తన యనంతరము ధర్మమార్గమునకు నాయకుఁడుగ నుండవలసిన యుధిష్ఠిరునకు దానొక దీపస్తంభమువలె ప్రకాశ మార్గమును జూపించి భీష్ముఁడు విరమించి కొన్నాఁడు. అతఁడు ధర్మరాజుతో నిట్లనెను:

"ఉవాచ చైనం మధురం, నృపం శాంతనవో నృపః

....... ....... ........

...... ....... ........

వినివృత్తే దినకరే ప్రవృత్తే చోత్తరాయణే"

(అనుశా. అధ్యా. 166)

"అనంతరము మధురములైన శబ్దములతో శాంతనవుఁ డిట్లనెను: ధర్మజా! నీవు పట్టణము బ్రవేశింపుము. నీ మానస జ్వరము శమించుగాక. వివిధ యజ్ఞములతో యజింపుము. దక్షిణలతో శ్రద్ధాదమ పురస్సరుఁడవై యయాతి వలె వర్తింపుము. క్షత్రధర్మరతుఁడవై పితృ దేవతలను, దేవతలను తృప్తి పఱుపుము. నీకు సేమమగు గాక! ప్రకృతులను రంజింపఁజేయుము. ఫల సత్కారములతో యథార్థ పూజనములతో సుహృత్తులను దన్పుము. ఫలవంతమగు మహావృక్షము నాశ్రయించికొన్న పక్షుల వలె ని న్నాశ్రయించి యాశ్రితులు జీవింతురు గాక! ఉత్తరాయణ కాలమున నా కడకు రమ్ము. పొమ్ము."

భీష్ముల యాజ్ఞ ననుసరించి ధర్మజుఁడు వర్తించెనని చెప్పుటనవసరము. ఇంతలో నుత్తరాయణ మరుదెంచెను. భీష్ము లవతారము జాలించు కాల మాసన్నమైనది. శ్రీకృష్ణాదులు ధృతరాష్ట్రుని మున్నిడికొని శాంతనవుని దర్శించిరి. పుత్రశోక పరితప్తుఁడైన ధృతరాష్ట్రునకు భీష్ముఁడు శాంతి నొసఁగెను. అతని

వాక్యము లివి:

"రాజన్ విదితధర్మోఽసి, సనిర్ణీతార్థసంశయః

....... ....... ........

...... ....... ........

ఈర్ష్యాభిభూతా దుర్వృత్తాః, తా న్నశోచితు మర్హసి"

(అనుశా. అధ్యా. 168)

"రాజా! నీకు ధర్మమును వివరించు టనవసరము. బహుశ్రుతులగు విప్రుల వలన ననేక ధర్మములు విన్నవాఁడవు. ఇంకను వారినే సేవింపుము. నీ సకల సంశయములును విచ్ఛిన్నము లగును. జరగిన దానికి వగవకుము. ఇది యిట్లు గావలసి యుండెను. అయినది. ఇది దేవ రహస్యము. కృష్ణద్వైపాయనుఁడు నాకు దెలిపెను. పాండుని పుత్రులు గూడ నీ సంతానమే. వారిని ప్రేమింపుము. ధర్మరాజు గురువత్సలుడు. అనృశంసపరుఁడు. శుద్ధాత్ముఁడు. అతఁడు నీ మాట వినును. అతనిని దగ్గఱ జేర్చికొమ్ము. క్రోధ, లోభ పరాయణులైన నీ పుత్రు లందరును గతించిరి. వారికై దుఃఖింపకుము. వారి మాత్సర్యమే వారిని గాల్చినది".

## శ్రీకృష్ణుఁడు గూడ వికలుఁడైవాఁడు

ప్రళయాంతకుని వంటి మహావీరుఁడైన భీష్ముఁడు దన్నాశ్రయించిన వారి కందఱ కుపదేశము లొనరించెను. బహువిధములైన మీమాంస లొనర్చి కట్టకడకు తన కారాధ్య దైవమైన శ్రీకృష్ణునకు జేతులు మొగిడ్చి తన శరణాగతిభావమునకు మెఱుగు వెట్టికొన్నాఁడు. ఈ ఘట్టము భారతమున నిట్లు గలదు:

"ఏవ ముక్తస్తు గాంగేయః పాండవా నిద మబ్రవీత్

...... ...... ......

...... ...... ......

త్వయాzహం సమనుజ్ఞాతో, గచ్ఛేయం పరమాం గతిం"
(అనుశా. అధ్యా. 167)

"నేనిప్పుడు ప్రాణములను శాశ్వతమైన జ్యోతిలో విలీనము జేయుటకు యత్నించుచున్నాను. మీ రందఱు నా కనుజ్ఞ యొసఁగవలెను. మీరు సత్య మార్గమున బ్రవర్తింపుఁడు. సత్యమే యుత్తమమైన బలము. నియతాత్ములై వర్తింపుఁడు. ఆనృశంసపరులు గండు." భీష్ముఁడు ప్రియబంధువుల నందఱ గౌగిలించికొనెను. మరల ధర్మరాజుతో నిట్లనెను. "ధర్మజా! ప్రజలను విశేషముగ బూజింపుము. బ్రాహ్మణులను గౌరవింపుము. ఋత్విజులను, ఆచార్యులను. యథార్హముగ సమ్మానితుల నొనర్పుము. పురుషోత్తమా! వైకుంఠవాసీ! నీకు నమస్కారము. నా కనుజ్ఞ యొసఁగుము. పాండవులను రక్షింపుము. నీవే వారికి బరాయణము. నేను దుర్యోధనున కెంతయో బోధించితిని. కృష్ణుఁడున్న వైపు ధర్మముండు నంటిని. ధర్మమున్న యెడ జయ మున్న దంటిని. వాఁడు వినలేదు. నీలో నైక్య మగుటకు నాకుఁ గాలము సమీపించుచున్నది. నీవు నారాయణుడను మహాముని వని నే నెఱుఁగుదును. నరుఁడను మహామునితోఁ జేరి చాల కాలము బదరికాశ్రమమున వసించితివి. ఈ రహస్యమును నాకు నారదుఁడు దెలిపెను. వ్యాసభగవానులు దెలిపిరి. కృష్ణార్జును లిర్వురును నరాకారమున నున్న నరనారాయణులు. వాసుదేవా! నా కనుజ్ఞ యొసఁగుము. నేనీ శరీరమును వర్జింతును. నీచే ననుజ్ఞాతుఁడనై యుత్తమగతి నందుదును."

తపోనిధానమైన భీష్ముని యీ యంతిమ యుద్గారమును విని. కృష్ణ భగవానుఁడు గూడ విచలితుఁడైనాఁడు. అతఁడు భీష్మునితో నిట్లన్నాఁడు:

"అనుజానామి భీష్మ! త్వాం, వసూన్ ప్రాప్ను హి పార్థివ!

........ ........ .........

...... ........ .........

తేన మృత్యుస్తవ వశే, స్థితో భృత్యఇవానతః"

(అనుశా. అధ్యా. 168)

"తేజోభాస్కరుఁడవైన యో భీష్మా! నీ జీవనమున నొక్క యణువు కళంకము లేదు. నీవు మార్కండేయుని వంటి పితృ భక్తుఁడవు. అందుచే మృత్యువు నీకు దాసునివలెనైనది. రాజర్షీ! నీ కనుజ్ఞ యొసఁగుచున్నాను. పోయిరమ్ము. అష్టవసువులలోఁ జేరికొమ్ము."

## మహానిర్యాణము

భీష్ముఁడు మాటలు చాలించెను. యోగశక్తిచే సర్వచైతన్యము నవరోధించెను. అతఁడు మెల్ల మెల్లగాఁ బ్రాణోత్సర్జనము గావించు చుండెను. ఆ సమయమున లోకముల నాశ్చర్యపఱచెడి దృశ్య మొకటి జరగినది. ఏ యే యవయవములనుండి యాతఁడు ప్రాణశక్తిని లాగుకొనుచుండెనో అవియవి వికలములగుచుండెను. ఈ దృశ్యము కృష్ణుని గూడ నాశ్చర్యపఱచెను. ప్రాణశక్తిని బ్రహ్మరంధ్రములో గూర్చికొని బ్రహ్మరంధ్రమును భేదించికొని భీష్ముని యాత్మ దివ్యలోకముల కేగినది. ఒక మహాజ్యోతి యాకసమున వెలఁగి శాశ్వతముగ నంతర్ధానము నందినది. దేవదుందుభులు మ్రోగెను. దివ్యవృష్టి గురిసెను. సిద్ధులు, బ్రహ్మర్షులు జయకారము లొనర్చిరి. యుధిష్ఠిరుఁడు, విదురుడు భీష్ముని శరీరముపై పట్టాంబరములను గప్పినారు. పాండవులు చితినేర్పఱచిరి. యుయుత్సువు శ్వేతచ్ఛత్రమును బట్టెను. నకులసహదేవులు భీష్మునకు శిరోభూషణములను దొడిగిరి. రాజ స్త్రీ లాతని శరీరమును వ్యజనములతో వీచిరి. తపస్సంపన్నమైన భీష్ముని శరీరము అగ్నిలో నిమగ్నమైపోయెను. అతనికిఁ దిలాంజలి యొసగునప్పుడు జాహ్నవి మూర్తిమతియై నిలచినది.

లోకముల దుఃఖముల బోకార్చు నా జగన్మాత గూడ భీష్మని వంటి పుత్రుని పోగొట్టుకొన్నందులకు గోడుమని యేడ్చినది. కడకు కృష్ణభగవానుఁడు వ్యాసుల సాయముతో నామె నూరార్పవలసి వచ్చినది.

మహర్షి యైన వ్యాసభగవానుఁడు క్షత్రధర్మమున కవతారముగా భీష్మని మలచినాఁడు. మానవుని యుత్తమాదర్శ మెట్లుండవలెనో భీష్మఁడు తన జీవితముతో బోధించెను. ఒకసారి నిశ్చయించి కొన్న ధర్మమును వేయికొండలు నెత్తిపై బడునట్లున్నను మార్చరాదనుటయే యాతని బోధ. ఈ కర్తవ్య నిష్ఠను గూర్చి యాతఁడే యొక సారి యిట్లు దెలిపెను.

"పితా మమ మహాతేజాః, శంతను ర్నిధనం గతః

....... ....... ......

....... ....... .......

విజ్ఞానేన తవానేన, యన్నముహ్యాసి ధర్మతః"

(అనుశా. అధ్యా. 94)

"నా తండ్రి గతించిన వెనుక నే నాతనికి శ్రాద్ధ మొసఁగుట కై గంగా ద్వారమున కరిగితిని. నా తల్లి జాహ్నవి నాకుఁ దోడ్పడెను. పరమర్షులను మున్నిడికొని శ్రాద్ధకర్మ నాచరించితిని. దర్భలపై నేను పిండము లుంచుచుండగా నవి ప్రక్కకు జరగి భూమిని భేదించికొని నా తండ్రి హస్తము గడ్డకు వచ్చినది. నే నాశ్చర్య మందితిని. నా తండ్రియే స్వయముగ పిండముల సంగీకరించుటచే ధన్యుఁడనైతిననుకొన్నాను. వెంటనే నన్ను మరియొక సందేహ మావేశించినది. నరుఁడు పితృదేవతల హస్తములోఁ బిండప్రదాన మొనర్చుట శాస్త్రములలో జెప్పఁబడలేదు. వేదములలో లేదు. దర్భలపైఁ బిండము లుంపవలెనని యే శాస్త్రములందున్నది. నే నా హస్తమును నిరాదరించి దర్భల పైననే పిండము

నుంచితిని. రాత్రి స్వప్నమున నాకు బితృదేవతలు సాక్షాత్కరించి నా కార్యమునకు బ్రియమానులై యిట్లు పలికిరి. "శాంతనవా! నీ ధర్మనిష్ఠ గొప్పది. నీకు ధర్మవిషయమున నెన్నడును. మోహము లేకుండుగాక!"

శాస్త్రనిష్ఠ-సత్యనిష్ఠ యీ రెండే భీష్ముని జీవన సూత్రములు. సూత్రములు. సుఖదుఃఖములలో మానవుఁడవిచలితుఁడై యెట్లుండవలెనో యాతడు బోధించెను. అట్లు బ్రదికెను. ఇట్టి మహావ్యక్తి యుద్ధమున విధికి జిక్కి మరణమందినను విధి గూడ నాతనికి నమస్కరించినది. భీష్ముఁడు స్థితప్రజ్ఞుఁడు. కర్మయోగమునకుఁ బ్రతీకము. భీష్ముఁడు జన్మించిన సమాజము పతనోన్ముఖమై యుండెను. అతడు తన యాదర్శముతో దానికి వెలుగు బాటలు జూపించినాఁడు. భారతములోని పదునెన్మిది పర్వములను సూర్యప్రకాశము చేత జగత్తును భీష్ముని ప్రకాశముచే నావృములైనవి. ఇట్టి మరియొక యంశానాంతరవే భారతములోని విదురుఁడు.అతనిని గూర్చి మరికసారి యాలోచింతము.

ఆచార్యులవారు పధ్నాలుగు భాషాసాహిత్యాలలో ప్రజ్ఞాధురీణులు. ఆయా భాషా సాహిత్యాలలో గతంలోనూ వర్తమానంలోనూ ప్రవర్తిల్లిన సాహితీధోరణులూ, ప్రక్రియలూ, కవితాశైలులూ, కవుల సాహితీ వ్యక్తిత్వాలూ, చారిత్రక విశేషాలై, కళామార్మిక శిల్పాలూ వారికి కరతలామలకాలుగా ఉండేవి. ఆ అనంత పరిజ్ఞానం తులనాత్మక అనుశీలన విధానాన్ని తెలుగులో వెలుగురేఖలు చిమ్మటానికి పుష్కలంగా తోడ్పడేది. అందువలన ఆచార్యులవారు ఏ అంశం మీద మాట్లాడుతున్నా, వ్రాస్తున్నా, భారతీయ భాషా సాహిత్య విజ్ఞాన సర్వస్వం ఆ అంశంలో ప్రతిఫలిస్తున్నట్లు ప్రత్యక్షమౌతుంది. అంతకు ముందు సాహితీవిమర్శకులు దర్శించని ఎన్నో దృక్కోణాలు వారి అనుశీలనతో ప్రత్యక్షమయ్యేవి. పరంపరగా, గతానుగతికంగా విద్వాంసుల మెదళ్ళలో గూళ్ళు కట్టుకొన్న ఛాందస భావాలను వారి విమర్శలు బూజు దుల్పుతున్నట్లుండేవి. ఒక జలపాతంలో స్నానం చేసిన క్రొత్తదనం పఠితలకు, శ్రోతలకు అనుభూతమయ్యేది. విశేషమేమంటే గతాన్ని ఈనాటి వర్తమానానికి అనువుగా వ్యాఖ్యానిస్తున్నట్లు తోచేది.

– డాక్టర్. జి.వి. సుబ్రహ్మణ్యం

"సరస్వతీపుత్ర" 'పద్మశ్రీ'

# 'పుట్టపర్తి' నారాయణాచార్యులవారి

## కొన్ని ఇతర రచనలు

| | | |
|---|---|---|
| 1) | మేఘదూతం | గేయకావ్యం |
| 2) | శివతాండవము | " |
| 3) | జనప్రియ రామాయణం | " |
| 4) | పాద్యము | పద్యకావ్యం |
| 5) | షాజీ | " |
| 6) | శ్రీనివాస ప్రబంధము | " |
| 7) | ప్రాకృతమంజరి | వ్యాససంకలనం |
| 8) | వ్యాససంపుటి | " |

ప్రాప్తి స్థానము

**డా॥ పుట్టపర్తి నాగపద్మిని**

6-3-1142

నిత్యసాయి అపార్ట్‌మెంట్స్

భోలాశంకర్ మక్తా

బేగంపేట - హైదరాబాద్ - 500 016